# అవతారిక

---

భారతదేశచరిత్రమున శివాజీమహాశయునింగూర్చి విశేషముగా కలదు. బడిపుస్తకములలోను కావ్యనాటకముల యందును పత్రికలలోను ఈయనను మనము నిరంతరము కొనియాడుచున్నాము. ఈయన చిత్రపటమును ఆంధ్రదేశమున పలుతావుల నెలకొల్పుచు, సాంవత్సరికోత్సవములు జరుపుచు, వ్యాయామమండలులను స్థాపించుచు స్మరించుచున్నాము. కాని, ఆంధ్రులును, ఈ శివాజీప్రభువునకే సమకాలికులును, ఈతనికే దక్షిణదిగ్విజయమునకు అపారధనమిచ్చి ఉపకరించిన వారును, అబుల్ హసన్ తానాషా (తానీషా) సుల్తానునకు ఆప్తమంత్రులై గోలకొండసామ్రాజ్యము నేలుచు, ఢిల్లీపాదుషా యొక్క దక్షిణదిగ్విజయ ప్రయత్నములనెల్ల నిరంతరము భంగపఱచుచు ఆతనికి ప్రక్కలోనిబల్లెమై, గోలకొండసామ్రాజ్యమును ఆంధ్రసామ్రాజ్యముగా భావించి, దానిని విస్తరింప దృఢదీక్షవహించి, సుల్తాను సంపూర్ణామోదముతో హైందవ మతమును పోషించుచు, తుదకు పాదుషాయొక్క కుట్రచే దుర్మరణముపాలై, తమ మరణముచేత గోలకొండరాజ్య వినాశమునకును తానాషా పతనమునకు కారణభూతులైన యక్కన్న మాదన్నల యాశ్చర్యజనకమైన చరిత్రము ఆంధ్రులింకను సమగ్రముగా తెలిసికొనవలసియున్నది. దాదాపు

పంధ్రెండుసంవత్సరములకాలము మాదన్న మహామంత్రి తన సోదరుడైన యక్కన్నసాయముతో నాంధ్ర (గోలకొండ) సామ్రాజ్యము నేలినాడు. తానీషా సుల్తాను మహమ్మదీయుడే యైనను బుద్ధిమంతుడు, హైందవపక్షపాతి. మాదన్నయందు సంపూర్ణవిశ్వాసముంచి రాజ్యభారమంతయు ఆయనకువదలి తాను నిశ్చింతుడై యుండెను. తానీషా మాదన్నలు రాజును మంత్రులుంగాగాక సహోదరులవలె నుండిరి. ఇట్టి యాంధ్ర మహనీయులంగూర్చి మనకొక చిన్నకావ్యమైనను లేదు, నాటకమునులేదు, నవలయులేదు, తుదకొక వ్యాసముకూడలేదు.

నాకు వీరిచరిత్ర ఒకయాకరమున దొరకలేదు. సర్కారు పండితుడు రచించిన ఔరంగజేబు చరిత్రమున అచ్చటచ్చట కొంతగలదు. అతడు సయితము ప్రాచీన దాక్షిణాత్యచరిత్రకారుల గ్రంథములను పరిశీలించి వ్రాసినట్లు కానరాడు. మొగలాయీపక్షపాతులు రచించిన వాక్యములను గ్రహించినాడు. ఈభావమునే వెల్లడించుచు తానాషా అక్కన్న మాదన్నలలో ఎట్టిదోషమును లేదనియు ఔరంగజేబు సామ్రాజ్యకాంక్షచే వారికి అసత్యము నారోపించెననియు ప్రొఫెసర్ అబ్దుల్ మజీద్ సిద్దికిగారు ఒకవ్యాసమును ఆంగ్లమున రచించి యున్నారు. [హైదరాబాద్ ఎకాడెమీజర్నల్] భారతేతిహాస పరిశోధకమండలి, పూనా, వారు 'గోల్కొండ్యాచీ కుతుబ్ శాహీ' అని ప్రకటించినగ్రంథమున, మెకంజీదొరవారి స్థానిక చరిత్రలనుండి కొంతయు, 'హదికత్-ఉల్-అలామ్' అను

గ్రంథమునుండి కొన్ని ప్రకరణములను ప్రకటించిరి. మదరాసు విశ్వవిద్యాలయ సంస్కృతాధ్యాపకులు శ్రీ డాక్టరు రాఘవన్ గారు, డాక్టరు సి. కున్హన్‌రాజాగారికి మిత్రులు సమర్పించిన వాల్యూములో అక్బర్‌షా స్వాములవారి శృంగారమంజరిని గురించి యొకవ్యాసము వ్రాయుచు తానాషానుగురించి వ్రాసి యున్నారు. దాని సారాంశము.

శృంగారమంజరి యనునది రసమంజరివంటి శృంగార గ్రంథము దీనిని తొలుత బడాఅక్బర్ అను నామాంతరము గల అక్బర్‌షా అను సన్న్యాసి ఆంధ్రమున రచించెను. ఆంధ్ర కావ్య మంతరించిపోఁగా దాని సంస్కృతానువాదము మాత్ర ము మైసూరు ప్రాచ్యలిఖితగ్రంథభాండాగారమున మిగిలియు న్నది. ఈకవి తానీషా సమకాలికుఁడు, గురువును. తన్నుగూర్చి యిట్లు వ్రాసికొనెను.—

“ శ్రీశహారాజపుత్రోఽ ప్యకబరశాహో మహద్వన్ద్యః,
యస్యబడేసాహేబ ఇతి నామ మహోవై భవైకపదమ్.
కః కిల తపసామహసా యశసా జ్ఞానేన ధర్మేణ,
అభవద్భవతి భవిష్యతి జగతి బడేసాహబేన సమః.
కోవిష్ణుః కోబ్రహ్మే తాభ్యాం శ్రేష్ఠస్తతోఽ ప్యకబరోయమ్,
ప్రథయతిమహేశ్వరత్వం యస్యబడేసాహబేతినామాఖ్యామ్.
అకబరమవచోగోచరగుణమపికవయోయథామతి ప్రశంసంతి
యత్కిల తద్గుణగరిమావర్ణయితుర్గౌరవం తనుతే.
తేనాంధ్రభాషాయం రచితః శృఙ్గారమఞ్జరీ ఛాయం.

స్వయమకబరేణ భూభృన్మకుటమణిరఞ్జితాంఘ్రికమలేన.''

ఈభూభృత్తే మన తానాషా యని తర్వాత నుడువుచున్నాఁడు.

''చతురబ్ధివేష్టిత సర్వం సహేశనుత శౌర్య ధైర్యమనోహర లావణ్యా సఙ్గీత లలిత సాహిత్యభావజ్ఞతా సదృక్పాండిత్య కలిత సులతానబులహసన్ క్షోణీశ ముకుటతట దేదీప్యమాన రుచిరతర రత్నకిరణ నీరాజిత కల్పతరుకిసలయసదృశ చరణ గురురాజ శహారాజ భక్తిపాత్ర సుగుణగరిష్ఠ పరిమితహిత వాక్య పాణ్డిత్యయుక్త స్వమత పరమత సంపన్నసిద్ధాన్త నిరన్తర సంస్థాపనాఖిల నవరసాలంకార నవ్యగుమ్భైక కవనధౌరేయతా కలిత సన్నిధాన శ్రుతిస్వరస్థాన రాగాఙ్గ గానక్రియాస్థాయీ గమక ప్రబన్ధ ధాతు గాయనగుణ తతానద్ధసుషిరఘనగాత్ర భేదక్రియాగ్రహ జాతిమార్గ తాల దేశీతాల తత్వజ్ఞనిధి పాలితాశ్రిత కవిబన్ధు మిత్ర బడేసాహేబాకబర శాహః శృఙ్గార మఞ్జరీగ్రన్థరాజం రుచిరం విరచయతి.''

ఈ 'గురురాజ శహరాజే' తానాషా గురువైన షారాజు కొత్తాల్. ఈతనింగూర్చి ఈతని వంశముంగూర్చియు నిట్లు వ్రాసియున్నాఁడు.

''కింకరనరమధుకరకుల దత్తమహానన్దమకరన్దే
బన్దేనవాజహరతి పదారవిందే సదావందే.
తద్వంశాత్ వరముక్తామణిరివవిమలద్యుతిస్సఆవిరభూత్
శ్రీశహారాజనామా భూమిరభూమ్యాభిషితాయేన.

ఆసం స్తస్యతనూజా సహాహ కేనాక రాజ ఇత్యాద్యః
శాహన పేసరుల్లా హాఽపృకబర శాహ త్రయ స్తే చ సుర
తుల్యాః
శాహన పేసరుల్లాహాఖ్యాతగుణః శహరాజ ఇత్యభవత్
విబుధజనమాననీయో మహానుభావః క్షితీన్ద్ర గురుః.

వీనింబట్టి చూడఁగా నీకవి తానాషాకు గురుపుత్రుఁడును, గురువును. తానాషా అట్టిక్షీమహనీయుల సాంగత్యమున సర్వజనమాననీయుఁడై యుండి నందుననే హిందూగ్రంథములలో శ్రీరామలక్ష్మణులు తానాషాకు దర్శన మనుగ్రహించి నట్లు కలదు.

డచ్చిరచయిత హావార్టను నతఁడు వీరింగూర్చి కొంత వ్రాసియున్నాఁడు. వీరు మొదట 1666 లో (తర్వాత మీర్ జుమ్లా అని ప్రసిద్ధుఁడైన) సయ్యద్ ముస్తఫా అనువానికడ గుమాస్తాలుగా 10 గిల్డర్సు జీతమున ప్రవేశించిరట. వీరిలో మాదన్న ఉపాయశాలియనియు అక్కన్న కొంత తొందర పడువాఁ డనియు, వీరిరువురవలననే మీర్ జుమ్లా గోలకొండ నుండి పాఱిపోవలసి వచ్చెననియు తర్వాత మాదన్న 'సూర్య ప్రకాశరావు' బిరుదముతో సర్వాధికారమును వహించియుండఁగా సుల్తాను అంతటిని ఆతనిపై వదలి తానుమాత్రము 75000 డాలరులు జీతము గ్రహించి ఆనందించుచుండెనని వ్రాసి యున్నాఁడు. మాదన్న పర్షియను హిందూస్థానీలలో పండితుఁడట. ఆతని బంగారుపల్లకీ పోవుచుండఁగా వీధులలో నెల్ల

వారును లేచి నిలిచి గౌరవించుచుండిరట. డచ్చివారిని చాల మర్యాదగా మాదన్న చూచెననియు హవార్టుకు దర్శనము సైతక మొసంగెననియు కలదు.

మొగలాయీ చరిత్రకారులును వారిని అనుసరించిన వారును అక్కన్నమాదన్నలను తానీషాయే చంపించెనని వ్రాసిరిగాని ఇందెంతమాత్రమును సత్యముకానరాదు. మెకంజీ వారు గ్రహించిన స్థానికచరిత్రలలో నంతఃపురమువారే ఈ పని యొనర్చిరనియు, తానాషా వారినివదలుట కెంతమాత్రము సమ్మతింపనివాఁడు, వారి మరణమునకు చాలదుఃఖించెననియు కలదు.

తానాషా అక్కన్న మాదన్నలచరిత్ర వ్రాయుటకు ఎంతేనియు సామగ్రికలదు. వీని నెల్ల చర్చించి వాస్తవాంశము లను గుర్తించి వ్రాయుటకు చాలకాలము పట్టును గాన ప్రస్తు తము నాకు నిజమని తోచిన విషయములనే నవలవలె సామాన్య పాఠకలోకమునకు అందఁజేయు నుద్దేశముతో నీ వచనమును రచించితిని. ఒకటి రెండుచోట్ల కొద్దిగా కల్పించి తిని. ఈమహామంత్రుల చరిత్రను, మొగలాయీవారు రచించి నవే గాక దక్కనీల వ్రాఁతలనుకూడ చూచి, చక్కఁగా పరి శోధించి వ్రాయుట ఆంధ్రులకర్తవ్యము.

**వేదము వేంకటరాయశాస్త్రి, *M. A.***

**ABUL HASAN TANASHAH**

(From Havart)

Reproduced by kind permission of
The Govt. Epigraphist for India.

.

# తానాషా
# అక్కన్న మాదన్నలు.

## ప్రకరణము ౧. దండోరా.

"హిందువుగాని మహమ్మదీయుఁడుగాని, ఎవరైనను ఈ కాగితమును చదివి ఇందులోని విషయమును విశదీకరించువారికి అబుల్ హాసన్ తానాషాసుల్తాన్ బహద్దరువారు 'వసారత్' అను ఉద్యోగమిచ్చి చాలగౌరవము చేయుదురు. ఎవరైనను చదువగలిగినవారు వచ్చి చదువవచ్చును" అని గోలకొండపట్టణము వీథులలో నొకదినము దండోరా వినవచ్చుచుండెను. వెట్టివాఁడొకఁడు డప్పువాయించుచుండఁగా తెల్లని కాగితమును చూపుచు నతనివెంట రాజభటులును వారితో నొక యుద్యోగస్థుఁడును పోవుచుండిరి. ఆ కాగితమున నక్షరములు లేవు. ఒక బాటసారి దానినిచూచి "ఓరి అల్లదా. మూడునెలల మట్టీ ఈగోలకొండలో తిరుగుతున్నారు. ఎవరూ దొరకలేదంటయా ఒట్టి కాగితం చదివేవోళ్లు. అచ్చరాలుంటే చదవతారా లేకుంటే చదవతారా." అని పరిహాసముగా తన మిత్రులతో మాటలాడుచుండెను. వారు నవ్వుచుండిరి. కొందఱు జనులు అందేదో వాస్తవముగానే విశే

షము కలదనుచుండిరి. వీథులలో నిది యొక వేడుకగా నుండెను.

ఈ తెల్లని కాగితము ఔరంగజేబుపాదుషా గోలకొండ సుల్తానుకు పంపిన ఇనయత్ నామా. పాదుషాయొక్క యుద్యోగస్థుఁడు అంతకు కొన్ని నెలల క్రింద దానిని తెచ్చి గోలకొండ సుల్తానైన తానీషా (తానాషా) గారికిచ్చి జవాబుకోరియుండెను. అక్షరములు లేని తెల్లని యాకాకితమును చదువుఁడని తానీషా తన వజీర్లను ఉద్యోగులను అందఱను అడిగెను. ఎవరును చదువ లేకపోయిరి. అది కేవలము కాగితమే అని ఎవరును సాహసించి చెప్ప లేకపోయిరి. దర్బారులో నెవరును చదువ లేకపోఁగా సుల్తాను ఊరిలో నెవరైన చదువగలరేమో విచారింపుమని కొత్వాలును నియమించెను. ఎవరును కనఁబడ లేదు. తుదకు ఇంటింటికడను డప్పువాయించుచు, చౌబుదారులు గోలకొండలోని పండ్రెండు పెద్ద వీథులలో తుడుము కొట్టసాగిరి. మూఁడు నెలలుగా తానా వాయించుచుండినను ఎవరును ముందుకురా లేదు. వాడుక ప్రకారము వారు అను దినము వాయించుచునే యుండిరి. అదియే నాటి దండోరా.

దండోరా ఒక గొప్ప భవనముకడకు వచ్చి నిలిచినది. ఆయింటి యజమాని సయ్యద్ ముజఫర్ అను సేనాపతి. దండోరా వినఁగానే ఆయింటినుండి యొకఁడు ఆచౌబుదారుల జమాదారును లోనికి పిలిచెను. జమాదారు వరాండాలో ప్రవేశింపఁగానే లోపలి తిన్నెలపై కూర్చుండి లెక్కలు

తయారుచేయుచుండిన ఇరువురు బ్రాహ్మణ యువకులు నౌకరు మూలముగా నా కాగితమును తెప్పించుకొనిరి. వారిలో ప్రథముడు 'మాదన్నా ఆకాగితం అందుకో' అని ద్వితీయుని హెచ్చరించెను. మాదన్న 'ఇద్దరం చూదాం అన్నయ్యా' అని దానిని గ్రహించి 'అక్కన్నా చూచావా' అని ఒకరు మార్చి యొకరు దానిని చూచి తమలో తామేదో చెప్పుకొని వెంటనే తమ యజమానునికడకు పోయిరి.

అక్కన్న మాదన్నలు.—సలాం దివాన్ బహద్దరువారికి ఈకాగితమును మేము చదువగలము.

వారి యజమాని ముజఫర్ సేనాపతి ఆశ్చర్యపడెను. 'క్యా! క్యా! క్యా!' అనెను. ఆయువకులు మరల నట్లే పల్కిరి.

ముజఫర్.—ఏమి హాశ్చర్యం! మూడు నెలల్ కాలం నుంచి ఈజాబు ఎవరూ ఈగోల్కొండామే సద్వలేక వీళ్లు దండోరా త్రిప్పతారు. మీరు ఇద్దరు నిన్నలేదు మొన్నవచ్చి నార్, అప్పుడే ఇట్వాంటిజాబు సద్వుతాము చెప్తారు. అట్వాంటి జ్ఞానంవుందా మీకి?

అక్కన్న మాదన్నలు.—దివాన్ బహద్దరువారి యనుగ్రహముండిన ఇంకను ఎన్నెనియు చేయగలము. నియోగి కుఱ్ఱవాండ్రముగదా. మాది ఓరుగల్లు. మాతండ్రిగారు భానూజీపంతులుగారు, తల్లి భాగ్యమ్మ, మాకు ఎన్నియో విద్యలు నేర్పినారు. మా మాతృభాషలగు సంస్కృతాంధ్ర

ములేగాక అరబ్బీ పారసీభాషలను నానావిధములైన లిపులను నేర్చినారు. దర్బారులోకూడ ఎవరికిని సాధ్యముగాని లెక్కలన్నియు మేము తయారుచేయగలము. ఎటువంటి అసాధ్యమైన రాచకార్యమైనను తమవంటి ప్రభువులు దయదలఁచిన క్షణములో సాధింపగలము.

ముజఫర్.—అచ్ఛా, అచ్ఛా, మీరు తెలంగీ నియోగులు బలే హషార్యులు. మీకు ఇంతబుద్ధి శక్తీ తల్లి కడుపునుంచీ వస్తుంది. మరి ఆజాబు సద్వండి తమాషా చూస్తాం.

అక్కన్న.—ఇది చాల రహస్యమైన విషయము. సుల్తానువారి సన్నిధిలో చెప్పవలసినది.

ముజఫరుకు ఈజవాబు కొంత యతృప్తిని కలిగించినట్లుండెను. అతఁడొకక్షణముండి 'ఓహో! అట్లాగా, అయితే మనం సుల్తాన్వారి దర్శణాన్కి రేపుపోతాం. ఈదినం ఇక్డ మనకు పని జరూరత్ కాదా.' అనెను.

మాదన్నకు ముజఫరువాక్యములతో కాపట్యము కనఁబడెను. వెంటనే అక్కన్నను చూచెను. ఆచూపులోనే అతని యభిప్రాయము "ఈమహానుభావుఁ డేదో అడ్డుదారి తీయుచున్నాఁడే! ఈతని కప్పుడే మనమీఁద నసూయజనించినది" అని అక్కన్నగ్రహించెను. మాదన్న పైమెత్తు ఎత్తెను. 'సర్దారుచిత్తము. మరి దండోరావారు ఈవిషయము సుల్తాను

వారికి నివేదించిన వా రేమనుకొందురోగదా' అని దంఢోరా జమాదారును కనుగిరెను.

జమాదారు.—సర్దార్ సాహేబ్. సుల్తాన్వారి పనికంటే మనకు వేరే యేమిపని జరూరత్ ఉంది. మనం మొదట సుల్తాన్ బహద్దర్ వారికీ దర్షణంచేసి తర్వాత వేరేపని చూడడం షరీ మన్వీచేస్తాం. వారు ఈ ఆళశ్యంకు సహించలేరు సర్దార్ సాహేబ్.

ముజఫర్.—'ఈ జమాదార్ వదలడు. ఈ తెలంగీ పిల్లకాయలు అసాధ్యులు. వీళ్లకు సుల్తాన్ దర్షణం ఐతే మాకీ చాలాకష్టం వస్తుంది తోస్తుంది. ఏమిగతి, కానీ చూస్తాం.' అని ఆలోచించి, వారితో "ఓహో! అట్లాగా. అచ్ఛా. అచ్ఛా. అయితే మనం సుల్తాన్వారి దర్షణాన్కి పోతాం. అరే దంఢోరా జమాదార్, నీవు ముందుగాపోయి సుల్తాన్వార్కి మాసలాముల్ చెప్పి, 'ఇనయత్ నామాకీ సద్వేముతసుదీలు ఇద్దరు బొమ్మన్లు వరంగల్ నుంచి వచ్చినారు. వారిని సుల్తాన్వారి దర్షణాన్కి తెస్తావున్నాం' అని మన్వీచెయ్యి. మేం ఇప్డే వస్తావున్నాం.

వెంటనే ఊరంతయు పుఖారేర్పడెను. చాల నేర్పరులైన గుమాస్తాలు ముజఫరుసాహెబువద్ద చేరియున్నారని అందఱును చెప్పుకొనసాగిరి. కబురందఁగానే సుల్తాను తత్క్షణమే ఆయువకులను తెమ్మని పరుగుబంటౌతును పంపెను. ఇక

తప్పదని ముజఫరు అక్కన్న మాదన్నలను వెంటబెట్టుకొని దర్బారుకు పోయెను.

## ప్రక ౨. తానాషాదర్బారు.

గోలకొండపర్వతదుర్గము. కొండకు క్రింద మొదటిదర్వాజాకడనుండు గోడలపై దాదాపు తొంబది లేక వంద అడుగుల యెత్తు గోడలమీఁద గండభేరుండపక్షులు చిత్రితములై యున్నవి. నేఁడును యాత్రికులు చూడవచ్చును. దర్వాజాకు ఆనుకొనియుండు తిన్నెలపై కూర్చుండి మాటలాడినయెడల ఆశబ్దము పైకిపోయి పది పదునైదునిముసములు ప్రతిధ్వనించుచుండును. సింహద్వారము దాటఁగానే కొండయడివారము మొదట మఱియొకదర్వాజా కలదు. దానికి ముందు పెద్ద మంటపము. కిటికీలు లేవుగాని లోన వెలుతురుకలదు. అటనుండి మెట్లెక్కిపోవలయును. ఆకొండయంతయు దుర్గాకృతిని రక్షితమై రహస్యగృహములచేతను వానికి వలసిన నీటిసదుపాయముల చేతను తయారుచేయఁబడి నేటికిని చూపరుల కాశ్చర్యము కలిగించుచున్నది. ఏచోటినుండి ఏచోటికిపోవుటకు ఎచ్చెచ్చట రహస్యమార్గముకలదో కొలది రక్షకులకుమాత్రమే తెలియును. నాలుగైదు అంతస్థులుదాటిన యనంతరము తానీషామందిరము కొండనెత్తమున నున్నది. అచ్చట స్థలము కొంతవిశాలము. ఆమందిరమున నడుమ పెద్ద కొలువుమంటపమును, దాని కిరుప్రక్కల రెండుగదులు, దీనికెక్కుటకు ముందు

భాగమున రెండువైపుల ఎదురెదురుగా పదిమెట్లు మంటప మధ్యభాగమున కలసి సింహాసనమున కెదురుగానుండును. దీనికిపైన మరియొకమంటపము. దానికిని పైన ఇరుకుమెట్లచే పోదగినది బోడిమేడ. అచ్చట మెట్లకుపైన నొకయెత్తు నివేశ మును దానిపై సుల్తాను కూర్చుండుటకు స్థలము ఏర్పరుపఁబడి యున్నవి. అచ్చట సుల్తాను కూర్చుండిన గోలకొండదుర్గ మంతయు నాతనికి కనఁబడుటయేగాక చుట్టువైపుల పదిమైళ్ల దూరమువరకు కనఁబడును. ఆ మహత్తరసన్నివేశము చూచు టకు నేఁడే ఎంతో ఆనందకరముగా నుండఁగా నాఁడు సజీవమై యుండునప్పుడు చూచినవారిదే భాగ్యము.

అబుల్ హసన్ తానాషా సుల్తాను మొదటిమంటపముననే దర్బారుతీరియుండెను. అమీరులు, వజీరులు, ఉమ్రావులు, ఫౌజుదార్లు వారివారి పరివారము, విదేశీయులు ఎల్లవారును వారివారి స్థల ములలో కూర్చుండియు నిలువఁబడియు నుండిరి. సిఫాయీలు దర్వాజాలకడ విచ్చుకత్తులతోను ఈటెలతోను జాగరూకులై వచ్చుచు పోవుచు నున్నవారిని నిదానించి చూచుచుండిరి. దర్బారులో సుల్తానుప్రక్కన మొగలాయీపాదుషా ఔరంగ జేబు పంపిన రాయబారి కూర్చుండియుండెను.

మొగ. రాయ.—తానాషా సుల్తాన్ బహద్దర్. మా యేలినవారు ఔరంగజేబ్ అలంఘీర్ పాదుషావారు మాకీ గోల్కొండకీపంపి కొన్నిమాసాల్ ఐనవికదా. మేముతెచ్చిన ఇనయత్నమా ఇప్పట్కీ ఎవరూ సద్వలేదు. దర్బార్లోనే

ఎవరూ లేకపోతే ధూరం పర్గణాలలోను గ్రామాలలోను ఎవరూ ఉంటార్. మాకీ శెల్వాయిస్తే మేముపోతాం. పాదుషాగారితో చెప్పేయేస్తాం—గోల్కొండామే దీన్కి సద్వే దాన్కి ఎవడ్కి షక్తీ సామర్థ్యం నహీ—అని.

తానాషా.—[ప్రశాంతముగా] రాయ్బారిభాయి, మీారు అవసరపడవద్దు. మా దేశం చాలా విస్తీర్ణంచేత దూరంలో ఉంటారు మాతసుదీలు అందుచేత వారికి కనిపట్టడం అసాధ్యంగా ఉంది. [వజీర్లను చూచి] అయితే ఇంకా ఎవరూ దొరకలేదా నజీర్సాహేబులు.

సభలో సుల్తానుకు చెంతనేయుండిన యొక ముసలి వజీరు అబ్దుల్ రజాక్ లారీ యనునతఁడు—సుల్తాన్ బహద్దర్, మనకీ కొంచెం నిదానం కావాలా తోస్తుంది. మన యీ ఆంధ్ర దేశం సుల్తాన్వారూ సెలవు ఇచ్చినట్లు చాలా విస్తారం ఉంది. శ్రీకాకుళం మొదలు పుదుచ్చేరివరకు మూలమూలలకు అన్ని ఠాణాలకు మనుషులుపోయి ఉన్నారు. తెలింగానాలో నిత్యం దండోరా వేయిస్తున్నాము. మన గోలకొండలో ప్రతిక్షణం దండోరా ఉంది. ఈదేశంలో హిందువులు మహాత్మదీయులు అందఱున్నూ బుద్ధిమంతులు. ఎవరో దొరకవచ్చును తప్పకుండా.

తానాషా.—అవును అబ్దుల్ రజాక్ సాహేబ్ అదే మాకుకూడా తోస్తుంది.

ఇట్లు వీరు మాటలాడుచుండఁగానే మహారాజవాను ప్రవేశించి, ఖుర్నీషు సలాములుచేసి.—తఫావద్ బాదద్, మన బడా వజీరుసాహేబ్ ముజఫర్ బహద్దర్ వారి దగ్గరనుండి జవాన్ వచ్చియున్నాడు. ఆయనకూడా వెన్కనేవస్తావున్నార్.

తానాషా.—తక్షణం రమ్మను.

అంతట దండోరాసిఫాయి ప్రవేశించి సుల్తానునకు సలాములుచేసి ఇట్లు నివేదించెను. "ఈదినం దండోరా మామూల్ ప్రకారం వేసినప్పుడు ముజఫర్ సాహేబ్ వాడు మాకీపట్టి ఇట్లా చెప్పినార్. 'సుల్తాన్ బహద్దర్ వారి పాదాలకీ మాసలాముల్ చెప్పి — ఇనయత్నామా సద్వేవాడు, తెలంగీనియోగీ బొమ్మను మాతసుదీలు ఈగులాంవద్ద వచ్చిఉన్నారు. వారిని సుల్తాన్వారి దర్షణాన్కి తెస్తావున్నాం—అని మన్విచేయి, మేం ఇద్దో వెన్కానే వస్తావున్యాం' ".—అని.

తానాషా సంతోషముతో — అచ్ఛా, అచ్ఛా. రాయబ్బారి భాయి. చూచినారూ లేదూ. మీజాబు ఇప్పుడే సద్వేతారు మా తెలంగీమూతసుదీలు. మీరుచూస్తారు.

రాయబారి.—అట్లాగైతే చాలాసంతోషం. కానీ చూస్తాం.

తానాషా.—ఓయి సిఫాయి, నీవు మళ్లీ వారిని జల్దీ రమ్మను.

2

సిఫాయి మరల పరువెత్తెను. చూచితిమిగదా ముజ ఫరు ముందు ప్రకరణమున ఆలసించుట. సిఫాయి మరల రాఁగానే ఆతఁడు ఇఁక నిలువలేక బయలుదేరెను. వీరు కడ పటిదర్వాజా సమీపింపఁగానే దౌవారికుఁడు వీరిరాకను సుల్తానునకు నివేదించెను. ప్రభువులు వసనభూషణోజ్వలముగా కొలువున్నచోటికి ముజఫరు ముందుపోవుచుండ నీయాంధ్రసోదరు వెంటనంటిపోయిరి. అందఱిచూపులును వారిమీఁదనే యుండినవి. వీరేదో యాశ్చర్యకరమైనపని చేయఁబోవుచున్నారని సభ్యులును పరివారమును తలంచుచుండిరి. వారి వేషము చాల వినీతముగానుండెను. దోవతియు, పొడుగుచొక్కాయయు, పైన సన్నని యంగవస్త్రమును నెత్తిన తిలక్ టోపీవంటి టోపీయు, మొగమున గీరు నామములును. దూరమునుండియే సుల్తానునకు మోకాళ్లపై నిల్చి సలాములుచేసిరి. ముజఫరు సలాముచేసి, 'సుల్తాన్ బహద్దర్ సాహేబ్. వీరే ఆ తెలంగీ మాతసుదీలు.' సుల్తానునకు వారినిచూడఁగానే ఏదో చెప్ప రానియానంద మేర్పడినట్లుండెను. వారిని చెంతకుపిలిచెను. చూపులోనే భావముగ్రహించిన యాంధ్రసోదరులు సింహాసనముకడకుపోయి నిలిచిరి.

అక్కన్న మాదన్నలు మరల సలాములుచేసిరి; వినమ్రులై నిలువఁబడిరి.

తానాషా వారిని నిదానించి చూచి—రండి. మీబుద్ధి శక్తి మేము ఇప్పుడేవిన్నాం. ఇంతచదివినవారు మాదర్బారులో

ఉండడం మాకు చాలగౌరవంగదా. ఎవఁరా, ఆఇన యత్నామా తెండి.

తానాషా.—మీపేరు ఏమి?

మాదన్న.—మహాప్రభూ క్షమింపవలెను. "ఆత్మనామ గురోర్నామ, నామాతి కృపణస్య చ, ఆయుఃకామో న గృహ్ణీయాత్ జ్యేష్ఠాపత్య కళత్రయోః." అని మాపెద్దలయాచారము. ఎవఁడును తనపేరు తానే చెప్పుకొనరాదుగదా.

తానాషా.—బలే! బలే! అవును. మీరు సాంప్రదాయస్థులు.

ముజఫరు.—ఈయన అక్కన్నగారు, ఈయన మాదన్నగారు.

తానాషా.—అన్నతమ్ములు ఒకటే ఆకారం ఉన్నారు. మీకుచూస్తే మాకు చాలసంతోషం ఉంది.

అక్కన్న.—మహాప్రభువులవారి యనుగ్రహము కలుగుట భగవంతుని యనుగ్రహము కలుగుటయే. ఏలినవారి దర్శనమైన సంతోషముతో మాకు నోట సరిగా మాటలు వచ్చుటయే కష్టముగానున్నది.

మాదన్న.—జగద్రక్షకా, తమయనుగ్రహము గలిగిన నేఁడే మాజన్మమునకు మంచిరోజు. ఏలినవారికి ప్రియముగా నౌకరిచేసి మా రక్తమాంసములు గోలకొండకును ఈ యాంధ్రసామ్రాజ్యమునకును ధారపోయుటకు సిద్ధముగా

నున్నాము. ఏదినము అట్టిసందర్భముకలుగునో నాఁడు మా జన్మము పావనము అగును. మావలన పనిగొనుము మహా ప్రభూ.

అబ్దుల్ రజాక్.—అచ్ఛా, అచ్ఛా. బాగాచెప్పినారు మాదన్నాపండత్. ఈ గోలకొండకీ మీరు రక్తమాంసాలు ధారపోస్తే మేము మాప్రాణం శరీరం సర్వం అడ్డంపెడ్తాం. అల్లాకటాక్షం బాగావుంటే ఇట్వాంటి రాజభక్తి, దేశభక్తి ఉండే రాజ్యానికి ఆ రావణాసురుడుకూడా ఏమీ చెయ్యలేడు. మీవంటివాళ్లు మాకు అవశ్యం స్నేహితులు ఉండడం సరి.

తానాషా.—అచ్ఛా అచ్ఛా. మీరు అంతా మనకీ స్నేహితులు. అంతా అన్నలు తమ్ములు. మాదికూడా సామాన్య ప్రాణం. భగవంతుడి వేడుకాకోసం మేము ఈసింహాసనం మీద ఉన్నాం. ఈప్రపంచం అంతా హాశ్చర్యం, సందేహం, మోసం, తమాషా గమ్మత్ ఉంది. మనం ఎందుకు పుట్టినాం తెలియదు. ఏమి ఔతాం తెలియదు. ఎక్కడికిపోతాం? ఎప్పుడు పోతాం? ఎట్లా పోతాం? ప్రాణం ఏమి? హాత్మ ఏమి? అంతా తెల్వనే తెల్వదు. అంతా తమకు తెల్సును చెప్పి కొందఱు మోసం చేస్తారు. అందుక్కచేతా మనం ప్రాణంతో ఉండే నాల్గుదినాలూ సంతోషంగా ఉంటాం. భాయి భాయి స్నేహం చేస్తాం. ఒకరికి కష్టంవద్దు, నల్గురికి ఉపకారం చేస్తాం, కాలం వచ్చినప్పుడు ఎవడిదోవలో వాడుపోతాడు. మీరుషులు

చెప్పేది అదే. మనసూఫీలు చెప్పేది అదే. మా గురుమహా రాజ్ షారాజు కొత్త్వాల్ వారి ఉపదేశంకూడా అదే.

అక్కన్న మాదన్నలు.—ఆహాహా ఎంత మహాత్ముఁడయ్యా ఈతానాషా సుల్తాను. మీరు గొప్ప వేదాంతి మహా ప్రభూ, తమ దర్శనముచేతనే మాజన్మము పావనమైనట్లున్నది.

ఈసంభాషణయంతయు ముజఫరునకు వానితోడి వజీరును మహల్దారునైన మూసాఖానను వానికిని ప్రియముగా నుండలేదు. అతఁడు ఇంకను నౌకరులు ఇనయతు్నామాను తేలేదే యని వేదనపడుచుండెను. నౌకరులు తేగానే దానిని త్వరగా నందుకొని సుల్తాను ముందిడెను.

తానాషా.—దయచేసి సద్వండి పండత్ వార్లూ.

మాదన్న దానిని చేతగ్రహించెను.—మహాప్రభూ. ఇందలి విషయములు చాల రహస్యములు. తమకుమాత్రమే తెలియవలెను.

తానాషా.—'అచ్ఛా, అలాగైతే మనం మాకులయత్ఖానాకు పోతాం.' కులయత్ఖానా యనఁగా నాంతరంగిక గృహము. సుల్తాను, అక్కన్న మాదన్నలు, అంగరక్షకులును మాత్రమే మేడమీఁదికి పోయిరి. ముజఫరుకు నెత్తిన పిడుగు పడినట్లు ఆయెను. తన గుమాస్తాలేమి సుల్తానుతో నాంతరంగిక గృహమున ముచ్చటించుట యేమి? ఈయువకులకు జరుగు మర్యాద ఆతనికి కనుకుట్టుగా నుండెను. తనకుకూడ పోవలయు

నని సంకల్పమున్నను సుల్తానుయొక్క అనుజ్ఞలేనిదే పోరాదు. ఈతని ఈ వేదనకు కారణము మున్ముందు తెలియును.

కులయత్ ఖానాలో ప్రవేశింపఁగానే తానాషా – 'మరి వచ్చిరాంగదా, ఇప్పుడు సద్వండి' అనెను.

మాదన్న.—జగత్ప్రభూ, తమకొక వేడుక చూపె దము (అని) ఒక గళాసు నీరు (అని నౌకరును చూచెను) వెంటనే నీరు రాఁగా దానిని ఆకాగితముపై చల్లెను. వెంటనే నల్లని యక్షరములు కనఁబడినవి. ఈయక్షరములు ఇంతకు ముందే ఏదైన కారణముచే నీరుపడి కనఁబడియుండవచ్చును గదా. దండోరావారి చేతనుండు కాలమున రెండు వానచినుకులు వానిపైఁబడియుండినను వాని రహస్యము వెల్లడియై యుండును. కాని దైవవిలాసము అట్టిదేదియు జరుగక మాదన్నవఱకు ఆపని నిలిచియుండినది. ఇట్టివే కాఁబోలు జీవితములోని యవకాశములు.

తానాషా —ఏమి హాశ్చర్యం అక్షరాలు ఉన్నవి. ఇప్పుడు కనపడుతున్నవి.

మాదన్న.—ప్రభూ, ఇది తెల్లసిరావ్రాఁత. అందుచేత తెలియలేదు. దీనిరహస్యము మాతండ్రిగారు మాకు చిన్నప్పుడే బోధించినారు అలంఘీరుపాదుషా దీనిని పంపుటలో గోలకొండ దర్బారులో ఎటువంటివారున్నారు అని పరీక్ష చేయునట్లున్నది. మహాప్రభూ మనరాష్ట్రమునకు వారివలన ఉపద్రవము ఎన్నటికైన తప్పదు. బిజాపూరుమీఁద మొగలా

యీలు బలముగా యుద్ధసన్నాహములు చేయుచున్నారు. బిజాపూరు పడిపోయినచో తర్వాత మనవంతు తప్పదు. చాల జాగ్రత్త వహించవలెను.

తానాషా.—అవును. మీమాట నిజం. ఔరంగజేబు ఎప్పుడైనా గోల్కొండా తినడాన్కే ఉన్నాడు. మాసర్దార్లు బుద్ధిలేక ఒకరితో ఒకరు జగడం వేస్తారు. కానీండి ఆలోచన చేస్తాం.

మాదన్న.—మహాప్రభువుగారితో పదిమాటలేల. మేము తమ చిత్తమునకు వచ్చునట్టి నౌకరులము.

తానాషా.—అచ్ఛా. అదే మాకి కావాలా. మీవల్ల మాకీ చాలాపని కావలసిఉంది. ముందుకి ఆలోచిస్తాం. ఇప్పుడు ఈఇనయత్నామాకి జవాబ్ రాయండి.

మాదన్న వెంటనే తన చొక్కాజేబునుండి ఏదోపాడి తీసి జవాబు తయారుచేసి సుల్తానుకు చూపెను. తానాషా— 'శబాష్. ఎవరురా అక్క. ఆమొగల్‌రాయ్బారికి పిల్వండి' అని సగములో 'వద్దు దర్బార్లోనే ఈజబాబ్ ఇస్తాం' అని మరల దర్బారుకు పోయెను. అక్కన్న మాదన్నలు పరమానందభరితులై ఒకరి నొకరు చూపులతో మాత్రమే హెచ్చరించుకొనుచు సుల్తాను వెంట దర్బారులోనికి జని.

తానాషా.—మొగల్ రాయబారిభాయి ఇద్గో మీకి జవాబ్. పాదుషాగార్కి మీరు దీన్కి రవానాచేయండి.

సభలో నందఱును ఆశ్చర్యపడుచుండిరి. అక్కన్న మాదన్నలు సుల్తాను ఎదుట నిలువఁబడియే యుండిరి. తానాషా వజీర్లనుచూచి ఇట్లనెను. "వజీర్సాహేబులు. ఈపంతుల్లు మాకీ చాలా మెహనత్ చేసి మాపర్వ నిల్పినార్. వీరి తెల్వి అపారం, ఆశ్చర్యం, సంతోషం ఉంది. వీర్కి మేం వసారత్ ఉద్యోగం ఇచ్చినాం. ముజఫర్ ఖాన్ బహద్దర్ మీరు ఇప్పుడే ఫర్మాన్ తయూర్ చెయ్యండి. మిగిలిన మర్యాదా అంతా చెయ్యండి. రేపు దర్బార్లో గౌరవం చెయ్యండి. మీరు తెచ్చిన మాతసుదీలు ఇంతమంచివారుగా ఉన్నది మీకుకూడా గౌరవంకదా. మీరుకూడా మాకు ఎంతో మెహనత్ చేసినార్ గదా."

ముజఫర్.—సుల్తాన్వారి చిత్తం. అంతా ఇష్టే చేస్తాం.

సుల్తాను దర్బారును అంతటితో నాఁడు చాలించెను.

ఎవరీ యక్కన్న మాదన్నలు? వీరే గోలకొండ సామ్రాజ్యాధినాయకులై కొంతకాలము పరిపాలించిన సుప్రసిద్ధాంధ్ర మంత్రులు అక్కన్న మాదన్నలు. వరంగల్లు ఫర్గణాలో భానూజీపంతులు ఒకానొక అమీలు క్రింద సుంకాధికారి. ఈయనభార్య భాగ్యమ్మ. ఆయమభాగ్యమున నలువురు కుమారులు జనించిరి—అక్కన్న, మాదన్న, విశ్వనాథుఁడు, మృత్యుంజయుఁడునని. తండ్రియే కుమారులకు చదువుచెప్పెను. సకాలమున వివాహములంజేసి గృహస్థులంగా నొనర్చెను. ఉత్సాహవంతులైన పెద్దకొమారు లిరువురును ఒక శుభ

ముహూర్తమున తండ్రియాజ్ఞనంది తమ పురోహితుని వెంటనిడుకొని రాజకీయోద్యోగములకై గోలకొండకువచ్చి ముజఫరుకడ గుమాస్తాలుగా ప్రవేశించిరి. ఆ మూఁడవనాఁడే దండోరావినిరి. నాఁడే సుల్తానుదర్శనమును వసారత్ ఉద్యోగ లాభమును. మెల్లమెల్లగా పైకివచ్చి ఎన్నఁడో సుల్తానుదర్శన మగుటకన్న తలవనితలంపుగా నొక్కదెబ్బతో వారికి సుల్తాను దర్శన మైనది. దర్బారుపిడె తమ యదృష్టమును తండ్రికి చెప్పి పంపుటకు వారు వెంటనే తమబసకు పోయిరి.

## ప్రకరణము 3. తానాషా పూర్వచరిత్ర.

అక్కన్న మాదన్నలకు తానాషా వేదాంతమును విని నదిమొదలు ఆతఁడేల యట్లు మాటలాడెనో, ముజఫరు ఖానుఁడు తమపై నేల యసూయవహించెనో కనుగొనవలయు నని కుతూహలము పొడమినది. వారు అటనట విచారింపఁగా నీక్రిందివిషయములు తెలిసినవి.

గోలకొండ సుల్తానులలో అబ్దుల్లాకుతుబుషా ఆఱవ వాఁడు. ఈతఁడు తన తండ్రి మరణానంతరము క్రీ. శ. 1626లో పండ్రెండవయేట రాజ్యమునకువచ్చి నలువదియాఱు సంవత్సర ములు పరిపాలించెను. ఈకాలమందంతయు నాతఁడు ఇతరుల చేతి కీలుబొమ్మయై యుండెను. నలువదియేండ్లకు పైగా నీతని రాజ్యతంత్రమునంతయు నీతనితల్లి హాయత్ బక్ష్ బేగమ్ అనునామె, నడపుచు వచ్చెను. ఈమె బలవంతురాలు,

దర్పముగలది. ఈమె చనిపోయినతర్వాత అబ్దుల్లా సర్వవిధ ముల తన పెద్దయల్లుఁడైన సయ్యదు అహమ్మద్ అనువానికి వశవర్తియై యుండెను.

ఈ ఇరువురు మంత్రులయొక్క రాజ్యతంత్రముచే గోల కొండసామ్రాజ్యము మొగలాయీచక్రవర్తులకు లోఁజిక్కక దాదాపు అర్ధశతాబ్దము తప్పించుకొనెను. ఈ విశ్రాంతి తాత్కాలికమైనదేగాని స్థిరమైనది కాదు. రాజ్యనాశము ఎట్లును తప్పని పరిస్థితి రావొడఁగినది. అబ్దుల్లా తన జీవితకాల మంతయు సోమరిగాను దుర్బలుఁడుగా నుండెను. క్రీ. శ. 1656–వ సంవత్సరమున నీతఁడు ఔరంగజేబు చేతఁబడక కొంచె ములో తనప్రాణములను కాపాడుకొనెను. నాటి విదేశయాత్రి కుఁడు బెర్నియర్ అనునతఁ డిట్లు వ్రాసెను. "రాజు (అబ్దుల్లాకు తుబ్ షా) తన మనోదార్ఢ్యమునంతయు పోఁగొట్టుకొని రాజ్య తంత్రమును నడపుటయే మానుకొనినాఁడు. ఇతఁ డెప్పుడును ప్రజలకు దర్శనమిచ్చుటగాని దేశాచారముల ననుసరించి ధర్మా ధర్మముల విచారించుటగాని లేదు. పైగా నీతఁడు గోలకొండ కోటగోడలనుదాటి ఇవలికివచ్చుటకు అధైర్యపడును. ఇట్టి పరి స్థితిచే దేశమందంతయు కల్లోలములును అరాచకమును సహజ ముగా తప్పనివయ్యెను. ప్రభువులు సామంతులు ఈరాజునందు ఏమాత్రము గౌరవానురాగములు లేనివారగుటచేత ఈతని యాజ్ఞలను తిరస్కరించి దేశమునందు జనులకు దుర్భరములగు కష్టములను పెట్టుచున్నారు."

రాచనగరునందు పరిస్థితు లింతకన్న నేమాత్రమును మంచిస్థితియందు లేవు. రాజు వృద్ధుఁడై తనకాలమునంతయు భోగమువాండ్ర సాంగత్యమున గడపుచుండెను. రాజకుటుంబమునందు అంతఃకలహము లేర్పడుచుండినవి. సుల్తాను అబ్దుల్లాకు పుత్రసంతానములేదు. ముగ్గురు కొమార్తె లుండిరి. మొదటికొమార్తెను సయ్యద్ అహమ్మద్ అనునాతఁడు వివాహమాడి, నామమాత్రునిగా అబ్దుల్లాసుల్తాను నుంచి రాజ్యమంతయు తానే ఏలుచుండెను. రెండవకొమార్తెను ఢిల్లీ పాదుషా ఔరంగజేబు రెండవకొమారుఁడు మహమ్మద్ సుల్తానను నతఁడు వివాహమాడెను. ఈ యిరువురలో సయ్యద్ అహమ్మదు మక్కాకుచెందిన యొక గొప్పకుటుంబములో జనించి కేవలము తనశక్తిచేతనే రాజ్యమునందు సర్వాధికారియై యుండెను. సుల్తానుయొక్క మూఁడవకొమార్తెకు వివాహము కావలసియుండెను. ఈమెను సయ్యద్ అహమ్మదు యొక్క ఆశ్రితుఁడును, అతని తండ్రిగారి శిష్యుఁడును నైన సయ్యద్‌సుల్తాను అనువానికిచ్చి వివాహము జరుపుటకు ఏర్పాటులు జరిగియుండినవి. కాని సయ్యద్‌సుల్తాను తన కాలంబమైన సయ్యదు అహమ్మదుయొక్క వంశమును వెక్కిరించినందున ఇరువురకును ద్వేష మేర్పడినది. అది క్రమముగా జగడమునకు పరిణమించి సరిగా వివాహముహూర్తదినము రాఁగా, సయ్యదు అహమ్మదు సుల్తానుకడకుపోయి ఆవివాహము జరిగినచో తాను తత్క్షణమే రాజ్యమునే వదలిపోవుదు

నని చెప్పనంతటిపరిస్థితి యేర్పడినది. బలహీనుఁడైన యా సుల్తాను తానా చిరకాలమునుండి యలవాటుపడిన సహాయుని వదలుట కిచ్ఛగింపకయు, పెద్దకొమార్తెకు కోపమువచ్చునేమో యని భయపడియు, పెద్దయల్లుని యిచ్చకు సమ్మతించెను. తత్క్షణమే సయ్యదు సుల్తానుయొక్క వివాహవేషమును లాగివేసి రాజ్యమునుండి తఱుమగొట్టి అతనియింటిని సుల్తానుయొక్కభటులు కొల్లగొట్టిరి.

తర్వాత జోస్యులుపెట్టిన లగ్నము దాఁటిపోనీయక ఆ దినమే సుల్తానుయొక్క కొమార్తెకు వివాహము నెఱవేర్పవలసియుండెను. సుల్తాను ఆజ్ఞచే అధికారులు వరాన్వేషణ మొనరింపసాగిరి. బలవంతుఁడు బుద్ధిమంతుఁడును నగువాఁడు సుల్తానునకు అల్లుఁడైన తన కాపదయని సయ్యదహమ్మదును అష్టమంత్రులును తలంచి వ్యర్థుఁడెవఁడైన దొరకునాయని చూచి అబుల్‌హసన్ అనువానిని సంపాదించిరి. ఈతఁడు తండ్రిపార్శ్వమున రాజబంధువు. ఈతనితండ్రి గొప్పవర్తకమునుసాగించి మరణించినను అతని యవసానకాలమున నేమియు మిగులనందున అబుల్‌హసను పేదరిక మనుభవించుచుండెను వివాహదినమునాటికి పదునాలుగు సంవత్సరములుగా నీతఁడు సయ్యద్‌రాజు కొత్త్వాల్ అను స్వామికి శిష్యుఁడై అతని సాంగత్యమందే కాలముగడపుచుండెను.

ఈ మహమ్మదీయస్వామి సంస్కృతాంధ్రములలోకూడ కవి, వేదాంతి, పండితుఁడు. ఈతఁడు తానాషాకాలమున గోల

కొండలో మహాతపస్వియని ప్రసిద్ధినందియుండెను. ఈతఁడు తపస్సంపన్నుల వంశమున జనించినవాఁడు. బందేనవాజ్ హజరత్ అను తపస్వియొకఁడు ఢిల్లీనగరమునుండి బయలుదేరి అల్లావుదీను సుల్తానుకాలమున (క్రీ. శ. 1321-1422) గుల్బర్గాలో కొంతకాలముండి అచటనే సమాధినందెను. ఈతని వంశమువా రందఱును గొప్ప వేదాంతులై స్వాములని ప్రసిద్ధి నందిరి. వీరిది సూఫీమతము. మహమ్మదీయులయందు వీరికి పక్షపాతములేదు. ఏమతమువారైనను సరే వేదాంతులైన చాలును. ఇట్టి పండితశిఖామణి, మహర్షి, అబుల్ హసను యొక్క గురువు. ఈమహర్షి పెద్దకొమారుఁడు బడేసాహేబనఁబడు అక్బర్ షా తండ్రివలెనే కవి శిఖామణి. ఆంధ్రమందు శృంగారమంజరియను నొక కావ్యమును రచించెను. అందు తన పూర్వుఁడైన బందేనవాజ్ హజరత్ కు వందన మాచరించి యున్నాఁడు. ఇతఁడును అబుల్ హసనుకు గురువే.

నిరంతరము ఈమహాశయుల మాటలు వినుచు వేదాంతిగా నబులహాసను కాలము గడుపుచుండెను. దీనినెల్ల నీచసహవాసముగా భావించి ధనికులెవ్వరును ఈతనితో చేరరైరి. అబుల్ హసనునకును ఐహికవాంఛలు జనింపలేదు; గురువుమీఁద నపార భక్తియు గురువర్యున కీతనియందు చాల వాత్సల్యమును ఏర్పడియుండినవి.

ఒక దినము గురుశిష్యులగోష్ఠిలో సుల్తాన్ కుమార్తె వివాహ ప్రస్తావము వచ్చినది; ఆమఱునాఁడే వివాహముహూ

త్రము. సంతోషముగా నేవో మాటలాడుచు తటాలున గురువు నేలమీఁదనున్న ఎఱ్ఱని బంకమట్టినెత్తి అబుల్ హాసన్ యొక్క వ్రేళ్లను దానితో పారాణివలె నలంకరించెను; పరిహాసముగా నవ్వుచు 'నేను నిన్ను పెండ్లికొమారునివలె నలంకరించుచున్నాను' అని పల్కెను. ఏలయన వారిలో వివాహానంతరము పెద్దలు పెండ్లికొమరుని యాశీర్వదించు విధమిది. ఇదేమని యందఱును ఆశ్చర్యమునందిరి. 'ఏమో! భగవంతుఁడు నాకీబుద్ధిని పుట్టించినాఁడు' అని యా మహాత్ముఁడు బదులు పల్కెను. మహాత్ముల వాక్యము లెన్నఁడును నిరర్థకములు గావు. ఆమఱునాఁడే రాజాధికారులువచ్చి అబుల్ హాసనును గురుసన్నిధినుండి తోడ్కొనిపోయి ఆతనికి వివాహమంగళవేషమిచ్చి, సయ్యదు సుల్తానుకొఱకు తయారుచేయఁబడిన వస్తువుల నొసంగి ఉజ్వలాలంకృతమైన మహోన్నతాశ్వముపై నెక్కించి, దీపములతోను సంగీతాదికములతోను ఊరేగించి రాజుకొమార్తెకు వివాహము గావించిరి. ఇదంతయు నాతఁడు స్వప్నమాయగా తలంచెను. వివాహానంతరము గురువును దర్శించి ఆతని పాదములలో వ్రాలెను. జగత్తే అట్టిదని ఆతని గురువు బోధించెను. ఈమహానుభావుఁడే తానాషా, ఆంధ్రులకు రామదాస చరిత్రమున చిరపరిచితుఁడైన తానీషా. నిరంతరము వేదాంత వినోదములలో ప్రొద్దుపుచ్చుటచే నీతనికి తానాషా (నిత్య సంతోషి యగు రాజు) అని ప్రసిద్ధి యేర్పడెను.

క్రీ. శ, 1671 లో. ఏప్రిలు 21 వ తారీఖున అబ్దుల్లా సుల్తాను మరణించెను. తత్క్షణమే సింహాసనమునకు తగవులు ప్రారంభమైనవి. సయ్యదు అహమ్మదు తాను అబ్దుల్లాకు పెద్ద యల్లుఁడైన కారణమున సింహాసనము తనదని లేచెను. అతని భార్య, మూసాహేబు, తనచుట్టునున్న వైదేశసేవికలను బానిసలను సాయుధలంగావించి అంతఃపురమందు తన హక్కులను కాపాడుకొనుటకు సంసిద్ధురాలుగా నుండెను. కాని లాభము లేక పోయినది. సయ్యదు అహమ్మదునకు ఆతని యధికార కాలమున నాతని కర్కశ స్వభావముచే శత్రువు లనేకులేర్పడి యుండిరి. పైగా నీతఁడు పరిపాలనయందు సమర్థుఁడగుటచే ఉద్యోగులు ఈతని ధార్ష్ట్యమును సహింపలేకయుండిరి. అబుల్ హసనుయొక్క వినోదస్వభావము లంచగొండ్లైన రాజకీయులకు చాల అనుకూలముగా నుండెను. అతనిని సుల్తానుగా సింహాసన మెక్కించిన తమకు విశేష లాభముండునని వారను కొనసాగిరి. అంతఃపురములోను కోట దర్బారులోను కొంత జగడమైనది. సయ్యద్ ముజఫర్ అను సేనాపతియు, మూసా ఖాఁ అను మహల్దారును (అంతఃపుర రాజగృహాధికారి) మఱి కొందఱు ఉద్యోగులును ఏకమై ఆకస్మికముగా సయ్యద్ అహమ్మదును పట్టి చెరసాలయం దుంచిరి; వెంటనే అబుల్ హాసనును సింహాసన మెక్కించి పై యిరువురును మంత్రులైరి. ఇతఁడే సయ్యద్ ముజఫర్ సర్వసేనాపతి, మహామంత్రి, అక్కన్న మాదన్నలను తానాషాకడకు తెచ్చినవాఁడు. ఈ

మంత్రియొక్క అధికారవాంఛయు తలపొగరుదనమును తానాషాకు చాల దుస్సహముగా నుండెను. ఈమంత్రుల నిరు పురను తొలగించుట కాతఁడు తరివేచియుండెను. అందులకు తగిన సహాయులు దొరకలేదు. అక్కన్న మాదన్నలు తనకీ సహాయముచేసి ఉపకరింతురని తానాషా తలంచెను. తానాషా వేదాంత వాక్యములకును ముజఫరుయొక్కయు వేదనలకును కారణమును వెదకినందుల ఫలముగా నింత పూర్వకథ అక్కన్న మాదన్నలకు తెలిసినది.

ప్రక. ర. మాదన్నకు 'సూర్యప్రకాశరావు' బిరుదము.

అక్కన్న మాదన్నలు తానాషా కొలువులో ప్రవేశించి వారను దినములైనవి. అనుదినము రాజగృహమునకుపోవుచు తమ యుద్యోగమును నిర్వహింప మొదలిడిరి. చాల సులువుగా వీరు అన్నికార్యములను చూచుకొనుటచే ఇతరులు మహమ్మ దీయులు పెక్కింటికి వీరి సాయమపేక్షింపసాగిరి. మిత్రులేర్ప డిరి. సుల్తాను రహస్యముగా వీరి శక్తిసామర్థ్యములను పరీ క్షించుచుండెను. ఆయవ్యయ విధానములలో వీరు లెక్కలు తయారుచేయుటను చూడవలెనను మిషతో వారిని తన కుల యఖ్తానాకు పిలిపించుకొని ప్రసంగించుచుండును. వారి తండ్రి భానూజీపంతులు కొమారుల యభివృద్ధిని ఎఱిఁగినను ఏకార ణముచేతనో ఓరుగల్లునందేయుండె . మున్ముందెప్పుడో గోల కొండకు వత్తునని కొమారులకువ్రాసెను.

ఒకనాఁడు అన్నదమ్ముల కిరువురకును మంచి శుభస్వప్నములైనవి. వెంటనే వారు మేల్కాని ఒకరితో నొకరు చెప్పుకొనిరి. తెల్లవారిన తర్వాత స్నానాదినామధారణము లైన వెనుక పూజాగృహము ప్రవేశించిరి.

మాఁడుపల్లి కృష్ణభట్టుగారువారి పౌరోహితులు. సోదరులిరువురును వారిని సమీపించిరి–'భట్టుగారూ, జపమైనదా'

భట్టు.—ఆ అయినది నాయనా. ఇందతీర్థము.

అక్కన్న మాదన్నలు తీర్థము గ్రహించి వారిముందు పీఠములపై కూర్చుండిరి.

అక్కన్న.—భట్టుగారూ, మాకిద్దరకు నిన్నరాత్రి అద్భుతమైన స్వప్నములు వచ్చినవండీ. చాల ఆశ్చర్యముగా నున్నది. వాని ఫలము తాము చెప్పవలయును.

భట్టు.—శుభం, శుభం. మీకు ఇటీవలనే సుల్తాను దర్శనము, రాత్రి శుభస్వప్నము. ఈగోలకొండసామ్రాజ్య ధౌరేయులౌతారు కాబోలు. చెప్పండి బాబూ.

అక్కన్న.—తమ యాశీర్వచనము. మూఁడవజామున నేను ఎక్కడనో దేవాలయములో నున్నాను. చుట్టును భక్తులనేకులుండిరి. తటాలున దీపారాధన జరిగినది. ఎదుట భగవతి భవాని కనఁబడుచున్నది. విగ్రహముకాదు. సజీవముగా నుండెను. చేతుల నాడించుచు నామె ఎల్లవారిని చూచుచుండెను. నాకు ఒక క్షణము ఏమియు తోపలేదు. మాదన్న నా

ప్రక్కనే యుండెను. ఆభక్తకోటిలో తానాషాకూడ కనఁబడుచుండెను. ఈమహమ్మదీయుఁ డెట్లు గర్భాలయములోనికి రాఁగలిగెనని నాకాశ్చర్య మాయెను. మాదన్నవైపు చూచితిని. ఆతఁడు 'చూడు, చూడు, అమ్మవారు పిలుస్తున్నది' అని చెప్పెను. అటు చూతునుగదా భక్తులు తానాషా ఎవరును లేరు. భవానీదేవిమాత్రము కనఁబడుచుండెను. 'అక్కన్నా ఇంద, ఈకరవాలము గ్రహింపుము, మాదన్నా ఈపాశము నీకు. మీకు మేలు కలుగును' అని అంతర్ధానమాయెను. అదే స్వప్నము తమ్మునికికూడ వచ్చినది.

మాదన్న—అవునండి. మాయిరువురి స్వప్నములు ఒకటే. మేము ఏకకాలములో మేల్కని ఒకరి నొకరము చూచుకొని కొంతసేపుండి తర్వాత స్వప్నవృత్తాంతములను చెప్పుకొంటిమి. ఏమి యాశ్చర్యము!

భట్టు.—ఆహా! హా! దివ్యమైన కల. స్వప్నశాస్త్రములో చెప్పియున్నట్లు మూఁడవజామున వచ్చినకల మూఁడు నెలలలో ఫలించును. మీకు ఈవసారత్ నౌకరి మూఁడు నెలలు మాత్రమే. తర్వాత అక్కన్నా, నీకు మహాసేనాధిపతి పదవియు, మాదన్నా నీకు మహామంత్రిత్వమును లభించును. అమ్మవారి ప్రసాదము వృథాపోదు. భక్తకోటిలో మీకు తానాషా కనఁబడుటచే నాతఁడు మహాభక్తుఁ డనియు, గొప్ప వేదాంతి యనియు, మహమ్మదీయుఁడే యైనను పూజనీయుఁడని తెలిసికొనవలయును.

అక్కన్న మాదన్నలు.—'అంతయు అమ్మవారి యనుగ్రహము' అని శక్తి పటమునకు నమస్కరింతురు. ఇంతలో వారి మేనల్లుఁడు గోపన్నవచ్చి 'తానాషా సుల్తానువాఁడు మామయ్యలకోసం కబురంపించినాఁడు. జవాను వచ్చియున్నాఁడు' అని చెప్పెను. వెంటనే అక్కన్న మాదన్నలు బయలుదేరి పోయిరి.

తానాషా గొప్ప యెత్తుగడలో నుండెను. తనకు తొలుత రాజ్యప్రాప్తికి కారకులైన ముజఫరు మూసాఖానులు తన్ను కేవలమొక బొమ్మగాఁ జేయుటచే శత్రువులైరి. వీరి నెట్లు తొలగించుట యని తానాషా తలంచుచుండెను. సుల్తాను హృదయమును ఈమేధావంతులు క్షణములో గ్రహించిరి. సుల్తానుతో నాంతరంగిక సంభాషణలు మొదలిడిరి. ముజఫరు మూసాలను తక్షణమే తొలగించిన నిందవచ్చుననియు ఆపని క్రమముగా చేయువలయుననియు మాదన్న సుల్తానున కుపాయము తెల్పెను. ఆయిరువురకును పరస్పర విరోధ మేర్పడు నట్లు చేయుమనెను. ఒకనిని మించి వారిలో నొకనిని మర్యాద చేయుచుండుమనెను. నాఁడు తానాషా మాదన్నచే నీతంత్రమును గ్రహించి అట్లేచేయ నారంభించెను. ముజఫరు మూసాలు ఒక్కొక్కఁడును సుల్తానునకు తానే ఆప్తుఁడననియు, సుల్తానునకు సాయముచేయు ప్రాధాన్యము తనదే యనియు మరియొకఁడు తన స్థానము నాక్రమింపఁజూచు శత్రువనియు తలంపసాగెను. వారిలో ద్వేషమభివృద్ధి కాసాగెను.

ఈ ద్వేషము వారి సేవకులలోకూడ వ్యాపించి వారు వీథులలో కొట్టుకొనువఱకు వచ్చెను. ఒకదినము మూసా ముజఫరులు పరస్పరము దూషించుకొని రాజవీథులలో చాల యల్లరి గావించుకొనిరి. వెంటనే ఆవిషయము సుల్తానువఱకును పోయెను. సుల్తాను మాదన్నను రహస్యముగా సలహా అడిగెను. మాదన్న ఇట్లు నేర్పెను-వారిద్దరను ప్రత్యేకముగా పిలిపించి ఒక్కొకనితోను వానిమీఁదనే తన కభిమానమనియు ఇంకొకనిమీఁద ద్వేషమనియు చెప్పి, తర్వాత, ప్రతిష్ఠకొఱకు నలువురయెదుట దర్బారులో మందలింపఁబోవుచున్నానే గాని వేఱుగాదని పలికి దర్బారులో నిరువురకును బుద్ధిచెప్పవలసినది అని. సుల్తాను ఆప్రకారమే చేసెను. అంతవఱకు వారిచేతి కీలుబొమ్మ ఈసుల్తానని తలంచుచుండినవారు ఇప్పుడు కొంత భయపడసాగిరి. వాస్తవముగా బలవంతుఁడనియే తలంచిరి. ఆమంత్రు లిరువురును ఇది నాటకమేగదా యని తలంచియుండిరి. ఈవిధముగా రెండు మూఁడు పర్యాయములు జరిగినది. మూసా ముజఫరులు కత్తియుద్ధమునకు కూడ సంసిద్ధులై యుండిరి. ఇంతలో అక్కన్న మాదన్నలు లంచములిచ్చియు, బెదరించియు ప్రభువులను, సామంతులను ఉద్యోగులను, యోధాగ్రేసరులను సుల్తానుపక్షమునకు త్రిప్పియుండిరి. మంత్రులకు గౌరవముతోకూడ బలమును ఉడిగెను. వీరు సుల్తానును త్రిప్పుచున్నా రనుమాటపోయి వీరు సుల్తానునకు లొంగిపోవుచున్నారు గాని సుల్తాను వాస్తవముగా సాధువు, లేకున్న



**AKKANNA PANTULU**

(From Havart)

Reproduced by kind permission of
The Govt. Epigraphist for India.

వీరిని ఎన్నడో కడతేర్చి యుండునని జనులు చెప్పుకొన సాగిరి.

నాలుగవ పర్యాయము చాలరచ్చ జరిగెను. మూసా ముజఫరులు దర్బారులో పరస్పరము చాల దూషించుకొనిరి. సుల్తాను మాటలను సయితము లక్ష్యముచేయక తిట్టుకొను చుండిరి. సుల్తాను మాదన్నను చూచెను మాదన్న కనుసైగ చేసెను. వెంటనే తానాషా వారిదవురను ఖైదుచేయుటకు ఆజ్ఞచేసెను. ముందే మాదన్న ఏర్పాటుచే కాచుకొనియుండిన రక్షకవర్గము మూసా ముజఫరులను బంధించి కొనిపోయిరి. ఈమాదుకూడ సుల్తాను ఆత్మగౌరవమును నిలువఁబెట్టుకొనుట కొఱకు అట్లు చేసెనని అభ్రాంతులు తలంచిరి. కాని సుల్తాను వారికి మరి విడుదలలేకుండఁ జేసెను; వారి యాప్తవర్గమును పూర్తిగా శిక్షించెను. కొందఱు సుల్తానునకు పాదాక్రాంతులై మన్ననలకు పాత్రులైరి. తత్క్షణమే సుల్తాను,మూసా ముజఫరులు ద్రోహులనియు వారికి తానిచ్చినది లఘుశిక్షయనియు నుద్ఘోషించి, మాదన్నను వజీరుగ నియమించి అతనికి "సూర్య ప్రకాశరావు" అను బిరుదము నొసంగెను. అక్కన్నను మహా సేనాధిపతిగా నేర్పాటుచేసెను. వారి మేనల్లుఁడు గోపన్నకు మాదన్న సిఫారసుమీాద భద్రాచలమున తాసిల్దారుద్యోగ మిచ్చెను. వాని తమ్ముడు వెంకన్నకు 'రూస్తుంరావు' అను బిరుదిచ్చి ఫౌజుదారుగా నియమించెను. అమ్మవారి ప్రసాదము ఈ విధముగా నెఱవేరెను. సుల్తాను మాదన్న సిఫారసుమీాద

మహమ్మద్ ఇబ్రహీం అనువానిని మొదట సార్-ఇ-ఖేల్ (అశ్వసాహిణి) గాను తర్వాత నవాబుగాను చేసెను.

భానూజీపంతులు కొమాళ్ల యభ్యుదయమునకు సంతోషించి భార్యతో వచ్చి గోలకొండలోనే నివసింపసాగెను. హనుమకొండలోనుండి మాదన్న సోదరులును వచ్చిరి. విశ్వనాథునకు బక్షిగిరి, అనగా సైన్యమునకు జీతమిచ్చు నధికారమును, మృత్యుంజయునకు పీష్వాయుద్యోగమును లభించినవి. సభ్యులందఱును మాదన్నకు నజరులు వగైరాలు సభలో చెల్లించి గౌరవించిరి. తర్వాత సుల్తానుయొక్క ఆజ్ఞమీఁద అక్కన్న మాదన్నలను నవాబులందఱును ఏనుఁగుపై నూరేగించి వారి యింటికి కొనిపోయి అచ్చట వారికి చాల గౌరవముచేసి పెక్కు సలాములతో వీడ్కొనిరి.

పదవీస్వీకారానంతరము సుల్తానుయొక్క అనుమతి నంది అక్కనయు నాతని సోదరులును తమ కనుకూలముగా నొకయింటిని కట్టుటకు ప్రారంభించిరి. తండ్రితోను తమ విద్యాగురువైన మాడుపల్లి కృష్ణభట్టుతోను ఆలోచించి ఖిల్లాకు తూర్పున సాహుబండ్ అనుచోట, శకాబ్దములు 1593 అగు విరోధికృత్సంవత్సరము మాఘ శుద్ధ పంచమినాఁడు (క్రీ. శ. 1672 జనవరి 21వ తారీఖున) శంఖుస్థాపన మొనర్చి మూఁడు నెలలలో పూర్తిచేసి, శకము 1594 పరీధావి వైశాఖ శుద్ధ సప్తమినాఁడు (క్రీ. శ. 1672 ఏప్రిలు 22 తేది) గృహప్రవేశ మొనర్చిరి.

## ప్రకర-౫. మాదన్న పరిపాలనారంభము.

మాదన్న కావించిన మహోపకారమునకు తానాషాకు ఆతనియం దపారమైన నమ్మకమును వాత్సల్యము నేర్పడెను. సర్వాధికారమును మాదన్నకే వదలి తాను వినోదాదికముల లోను విద్యావంతులతోను కాలముగడుప నారంభించెను. మాదన్న తత్క్షణమే సామ్రాజ్యములో గొప్ప మార్పులేవియు తేలేకపోయెను. రాజ్యరక్షణమే ప్రధానముగా నుండెను. కావున పాలనము చాలవఱకు అబ్దుల్లా కుతుబుషాకాలమున నున్నట్లే యుండెను. మాదన్న అధికారమువహించిన నాలుగు సంవత్సరములకు 1676 సం. జూలై నెల 23 తారీఖున ఆంగ్లేయులు మదరాసులోనుండి తమ పుస్తకములలో నిట్లు వ్రాసికొనియుండిరి. "మాదన్నచేత సర్వాధికారమును కలదు. అధికారులకు జనులను పీడించి ఎంతయైనను సొమ్ము గుంజుకొనుట తప్ప వేఱు చింత లేకుండెను.........రాజ్యపరిపాలనము అధములచేత నుండుటచే మోసమును బాధయు; సిగ్గుమాలిన ప్రభుత్వమగుటచే ఒప్పందనమునకుగాని, వాగ్దానములకుగాని, కౌలుకుగాని ఫర్మానాలకుగాని ఎవరికిని అప్పుపుట్టుటలేదు."

[Love i 356–357]

ఈవర్ణన తానాషాకు పూర్వముండినస్థితి. అధికారము వచ్చిన వెంటనే అక్కన్న మాదన్నలకు తల తిరుగలేదు. ఈ మహోపకార మొనర్చిన సుల్తానుపై వారికపారమైన భక్తి యేర్పడెను. ఆతని పూర్వచరిత్రమంతయు గ్రహించిన వెనుక

నాతఁడు కేవలమొక జ్ఞాని ఈరూపున నున్నాఁడని తలంప సాగిరి. అట్టి ప్రభువును కొలుచుట మహాభాగ్యమని తలంచిరి. అనుదినమును ఉదయము కచేరికిపోయి సుల్తానునకు నాటి విష యముల నెల్ల విశదీకరించి తాము చేయఁబోవువానిని మనవి చేసి ఆతని యనుమతి నందుచుండిరి. మునుపటి వజీర్లకును వీరికిని ఎంతభేదము! ముజఫరు మూసాలు తానాషాకు ఏమియు చెప్పెడివారే కారు. వీరు, సుల్తాను రాజకార్యముల వివరములు తనకు వలదనినను, ఆయనకు నివేదించుట ధర్మమనియు మర్యాదయనియు చెప్పుచు అతనిని చాల అనుసరించుచుండిరి. భగవంతుఁడు తనకింత మంచి మంత్రుల నంపెగదా యని తానాషా సంతసించుచుండెను.

మాదన్న మంత్రియైన కొలదికాలముననే దేశమును బాగుపఱిచెను. మొదటిపనిగా కొండలలోనుండి దేశోపద్రవము చేయు జాతులవారిని శిక్షించి పైరుపంటలకు రక్షణయొసం గెను. జనులను పీడించు జమీందారులను సుంకాధికారులను లాగివేసి సాధువులను ధర్మపరాయణులను వారిస్థానమందు నియమించెను. ఈవిధముగా నన్నిజిల్లాలను నిష్కంటక మొన ర్చెను. తర్వాత అన్నిసుభాలలోను గ్రామగ్రామముగా తనిఖీలు చేయించి వివరముగా పన్నువసూలుపట్టీలు ఆయాసంవత్సర ములకు ప్రత్యేకముగా తయారు చేయించెను. ఇందువలన జనులకు కొంత నెమ్మది యేర్పడెను. ఇనాములు, అగ్రహార ములు, దేవబ్రాహ్మణ దానములు, 'నౌకరీ ఇనాములు' మొద



**MADANNA PANTULU**
(From Havart)

Reproduced by kind permission of
The Govt. Epigraphist for India.

త్తైనవాని పాలనలోని అక్రమములను మాన్పించెను. తాను క్రొత్తగా పెక్కుదానములను ఇనాములను ఇచ్చెను. హిందూ మహమ్మదీయులకు పక్షపాతములేక శిక్షణ రక్షణ లొసంగు చుండెను.

గోలకొండసామ్రాజ్యము చాల విస్తృతమైనది. ఉత్తరమున శ్రీకాకుళము (గంజాంజిల్లా) మొదలు దక్షిణమున పుదుచ్చేరివఱకును, ఆంధ్రదేశమంతయు నీవిశాల సామ్రాజ్యమున చేరియుండెను. కడపజిల్లాయును కర్నూలుజిల్లాలోని తూర్పు భాగమును నేటి హైదరాబాదుసంస్థానమునందలి కల్యాణీ జాగీరువఱకుగల భాగమంతయు ఇందులోనిదే. ఏవో ఒకటి రెండు ప్రదేశములు తప్ప ఆంధ్రదేశమంతయు తానాషా పరిపాలనలో నుండెను. నాటి యాంధ్రదేశమున బంగారము పండుచుండెననిన అతిశయోక్తి కానేరదు. బిజాపూరునందలి నిస్సార ప్రదేశమును వదలి ఆంధ్రదేశమును (తెలింగానా-త్రిలిఙ్గదేశమును) ప్రవేశించినంతనే పచ్చని పైరుపంటలు చూపరుల కానందమును గొల్పుచుండినవి. ఫలవృక్షములు నేత్రోత్సవము సేయుచుండినవి. ఈదేశమునందలి వజ్రపుగనులును విశేష వ్యాపారస్థానములైన రేవుపట్టణములును ఖండాంతరములయందు ప్రసిద్ధినందియుండినవి. తానాషా సుల్తానునకు సంవత్సరమునకు దాదాపు మూఁడుకోటుల రూపాయల యాదాయముండెను. ఈమొత్తము సుల్తానుయొక్క సకల వినోదాదికములకును చాలి పైపెచ్చు రాజ్యరక్షణకొఱకు విదేశీయు

లకు వార్షికము లిచ్చుటకు సయితము చాలియుండెను. ఈ వైభవమే శత్రువులకు కనుకట్టాయెను. మొగలాయీలకు ఈ సంపదనంతయు నూరగొను దురాశ పొడమెను.

ఔరంగజేబు సింహాసనమెక్కిన తర్వాత ముప్పది సంవత్సరములవఱకు గోలకొండసామ్రాజ్యమునకు శాంతియుండెను. ఇందులకు కారణము,బిజాపూరువలె,గోలకొండ మొగలాయీలను నేరుగా నెదుర్కొనక పోవుటయే. ఇంతవఱకును మొగలాయీలకు, శివాజితోను అతని స్నేహితుఁడైన ఆడిల్‌షాతోను యుద్ధముచేయుచుండినందున, గోలకొండపై దాడి సలుపుటకు అవకాశము దొరకలేదు. పైగా గోలకొండవారు ఢిల్లీవారికి సక్రమముగా కప్పము పంపుచుండిరి.

గోలకొండ రాజ్యమునకు సరియైన రక్షణలేదు. దానియుత్తరభాగము మొగలాయీలు జయించిన రాజ్యమును ఆనుకొనియున్నట్టి విశాలమైన బయలు. దానియందు బిజాపురముయొక్క రక్షణకున్నట్లు దుర్గమపర్వతములుగాని, నీరు దొరకని ఎడారిగాని మఱియెట్టి నైసర్గిక నిరోధముగాని లేకుండెను. కాని ఎంతకాలము బిజాపూరు స్వతంత్రరాజ్యముగా నుండునో అంతవఱకు గోలకొండకు అపాయములేదు. ఈవిషయమును చక్కఁగా నెఱిఁగిన వాఁడగుటచే నౌరంగజేబు పాదుషా గోలకొండను మొదట జయించి తన సామ్రాజ్యమందు కలుపుకొనుటకు యత్నింపలేదు. అట్లు చేయుటయు అసాధ్యముగా నుండెను.

మాదన్నపంతులు కొలది మార్పులతో తత్పూర్వము గోలకొండవా రనుసరించుచుండిన విదేశాంగనీతినే యనుసరించెను. క్రీ. శ. 1636-వ సంవత్సరము, నైజాముషాహిరాజ్యము పడిపోయినది మొదలు దక్షిణరాజ్యములకు పట్టిన భీతియే గోలకొండవారికిని పట్టినది, ఎట్లు మొగలాయీవారిబారినుండి తప్పించుకొనుట యని. ఇందుచేతనే కుతుబుషాహి (గోలకొండ) సుల్తానులు మాటమాత్రము పాదుషాకు వశంవదులుగానుండిరే గాని వాస్తవముగా, లోలోపల, బిజాపూరు ఆడిల్‌షాకు ధన సహాయము చేయుచుండిరి. మొగలాయీలు బిజాపురము మీఁదికి దాడివచ్చినప్పుడంతయు తమ సైన్యములను ఎల్లల కడకు పంపుచుండిరి. మొగలాయీలు తాము బిజాపూరుమీఁదికి దాడివెడలినయెడల గోలకొండ సైన్యములు మొగలాయీ దేశముమీఁదికైనను, లేదా మఱియొక వైపునుండి మొగలాయీ సైన్యముమీఁదికైనను, బిజాపురమువారికి సాయముగా దండెత్తివచ్చునని ఎఱిఁగియుండిరి.

మాదన్న బిజాపురమువారితో విరోధింపలేదు; స్నేహమే చేయుచుండెను. కాని బిజాపుర వ్యవహారము ఇప్పుడు చాల గందరగోళముగా నుండెను. ప్రకృతులలో నంతఃకలహములు జరుగుచుండినవి. ఇట్టి రాజ్యముతో నీకాలమున స్నేహము అసాధ్యమును నిరుపయోగమును. ఈవిషయములెల్ల నాలోచించి మాదన్నపంతులు నిరంతర విజయులైన మహారాష్ట్రులతో స్నేహము మొదలుపెట్టెను. శివాజీతో నుత్తర ప్రత్యుత్తరములు ప్రారంభించెను.

## ప్రకరణము ౬ - శివాజీ.

క్రీ. శ. 1674 లో శివాజీపట్టాభిషేకము చేసికొనెను. అందుచే నాతని బొక్కసము చాల తగ్గిపోయెను. తర్వాత ఆడిల్‌షాహి రాజ్యమును పలుచోటుల దోపిడిచేసినను ఎక్కువ ధనము దొరకలేదు. దక్షిణాపథములోని పలు ప్రదేశములను ఆతఁ డిప్పటికే దోచియున్నాఁడు. ఈతని దాడికి భయపడి పెక్కు వ్యాపారస్థలములు పాడైపోయినవి. దక్షిణదేశమున నేటి మదరాసుతీరము సుభిక్షముగా నుండుటయేగాక శివాజీ కంట నింకను పడలేదు. ఈదేశమందలి జనులు నిరాడంబర జీవులై సౌఖ్యముగనుండిరి. ఇచ్చటి రేవుపట్టణములు అతి ప్రాచీనకాలమునుండియు విశేషవ్యాపారముల కాటపట్టు లగు టయేగాక ఇచటి గనులు తఱుగని సౌభాగ్యముగా నుండినవి. ఈధనమంతయు చాలవఱకు దేవాలయములకును ధర్మకార్య ములకును ఖర్చగుటయేగాక విశేషముగా జనులకు దాఁచుకొను టకును ఆభరణములు చేయించుకొనుటకును మిగులుచుండెను.

విజయనగరసామ్రాజ్యపతనానంతరము దక్షిణదేశము పెక్కు రాజ్యములాయెను. ఈరాజ్యములన్నియు నిరంతర మును తమలో తాము కలహించుకొనుచునేయుండినవి. తమకు సాయము చేయుటకై వీరు గోలకొండ బిజాపూరు మొదలైన మహమ్మదీయ రాజ్యముల సాయమును వేడుటచే తురుష్కు లకు పలుకుబడి హెచ్చసాగెను. మొగలాయీల బలముచే

ఉత్తరమున రాజ్యమును విస్తరించుట అసాధ్యమైనందున బిజాపుర గోలకొండలు దక్షిణమున వ్యాపించుటకు ప్రయత్నించు చుండిరి. ఇందుచే గోలకొండవారు కడప, ఉత్తర ఆర్కాటు జిల్లాల భాగమును పాలారునదివఱకును జయించిరి. బిజాపూరు వారు కర్నూలు, బెంగుళూరు, ఉత్తరమునందున్న మైసూరు భాగమును పాలారు కొల్లడముల నడిమి మదరాసు భాగమును వేలూరు మొదలు తంజావూరువఱకు ఆక్రమించిరి. శివాజీ సోదరుఁడైన వెంకాజీ తండ్రివలెనే ఆడిల్‌షా క్రింది సర్దారుగా నీప్రదేశములను పాలించుచుండెను. ఇతనికి జింజిప్రాంత భాగము తండ్రివలన వచ్చినట్టిది.

ఈలోపున మధురనాయకులకును తంజావూరి ప్రభువుల కును స్పర్ధలువచ్చి తంజావూరి పాలకుని మధురవారు చంపి వేసిరి. గతించిన రాజుయొక్క కొమారుఁడు బిజాపూరు ఆడిల్ షాకు మొఱపెట్టుకొనఁగా నాతఁడు వెంకాజీని సాయముపొమ్మ నెను. వెంకాజీ తంజావూరిని జయించి మధురవారిని పాఱ ద్రోలి ఆరాజ్యమును తానే అపహరించెను. పైగా నీతఁడు ఫ్రెంచివారి సాయముతో తనచుట్టునున్న పాళెగాండ్రను జయించుటకు ప్రయత్నించుచుండెను. బిజాపురమువారి ప్రతి నిధులు నాసర్ మహమ్మదును షీర్‌ఖాన్‌లోడి యనువారు పర స్పరము పోరాడసాగిరి. నాసర్ మహమ్మదు గోలకొండవారి సాయ మపేక్షించెను. ఈమధ్య 1675 సం. ఏప్రిలు ప్రాంత

మున శివాజీ సైన్యములో నొకభాగము బిజాపురభూములలో దోచుకొనుచు గోలకొండ రాజ్యములోనికి చొచ్చి ఏతగిరి (యాద్గీర్) ప్రవేశించి పూర్తిగా కొల్లగొట్టి హైదరాబాదు వఱకును వచ్చి వెడలిపోయెను. గోలకొండవారి మహామంత్రి మాదన్నపంతులు విజయాపురమందలి దక్షిణభాగములను సైతము జయించి ఆంధ్రసామ్రాజ్యమున చేర్పఁదలంచియుండెను. ఇట్టి సందర్భమున శివాజీతో సంధిచేసికొని తాము ఇరువురును కలసి దక్షిణదేశమును జయించి పంచుకొనుట మంచిదని తలంచి మాదన్న శివాజీతో సంధికి తానీషాను ఒడంబడుపసాగెను. బిజాపురములోని కర్నాటక దేశమును తానాషాకొఱకు శివాజీ జయించునట్లును దండయాత్రాకాలమున దొరకిన లూటీయంతయు శివాజీ గ్రహింపవలసినట్లును నిబంధనలు కుదుర్చుటకు మాదన్న ప్రయత్నించుచుండెను.

శహాజీ చనిపోవునప్పుడు వెంకాజీ బాలుఁడు. అనుభవములేని కుమారునికి సాయముగా రఘునాథనారాయణహనుమంతే అనువానిని ఏర్పాటుచేసి శహాజీ మరణించెను. ఇంతకాలము ఈహనుమంతే తానే ప్రభువైనట్లు ఎల్లకార్యములను జరుపుచుండెను. వెంకాజీ నేఁడు పెద్దవాఁడై హనుమంతుని పెత్తనమును సహింపలేకపోయెను. పైగా హనుమంతే నానా మాయోపాయములచేతను విస్తారము ధనమార్జించియుండెను. వెంకాజీకి అసహనము ప్రారంభమైన వెంటనే హనుమంతుని పిలిచి మునుపటి లెక్కలు వ్రాసి తెమ్మనెను.

హనుమంతె వెంటనే తన యుద్యోగమునకు రాజీ నామా నిచ్చివేసి తాను కాశీయాత్ర కేఁగుచున్నట్లు నటించి తంజావూరునుండి తన యావదాస్తిని గ్రహించి తన తమ్ముఁడైన జనార్దనుని కూడ నుంచుకొని బయలుదేరెను. తీర్థయాత్రకని బయలువెడలినవాఁడు బిజాపూరులో ఆడిల్‌షా ఆస్థానము చేరెను. ఈతని శక్తిసామర్థ్యములును ప్రసిద్ధియు ఈతని కొక మంత్రిపదవికి కారకములైనవి. కాని ఆడిల్‌షాల రాజ్యము దుర్బలమై అనుక్షణము పాతము నెదురు చూచుచుండెను. అట్టి సందర్భమున శివాజీ హనుమంతుని తనకడకు ఆహ్వానించెను. వెంటనే బిజాపూరును వదలి హనుమంతె పూనానగరమునకు పోయెను.

వెంకాజీమీఁద పగతీర్చుకొను నభిప్రాయము హనుమంతునికి నానాటికి బలపడుచుండగా నాతఁడు శివాజీని దక్షిణదేశముపై దండెత్తుటకు పురికొల్పుచుండెను. శివాజీ తండ్రి తన రెండవ కొమారుఁడైన వెంకాజీకి ఒసంగిన రాజ్యమును, దాని సౌభాగ్యమును ఎట్లు అది సులువుగా శివాజీకి స్వాధీనమగు ననుటను గుఱించి సమయము దొరకినపుడెల్ల హనుమంతె శివాజీకి చెప్పుచుండెను. తనకును తన బంధువులకును గల పలుకుఁబడినంతయు శివాజీకి సాయమొనర్చుటలో వినియోగించుటకు సిద్ధముగా నుండెను; శివాజీకి తమ్ముని రాజ్యము మీఁద ఇంతవఱకు అపేక్ష లేదుగాని హనుమంతుని యుద్బోధముచే ఇప్పుడు దక్షిణరాజ్యములమీఁదికి దండయాత్రకు సిద్ధము కాఁదొడఁగెను.

## ప్రకరణము-౭. శివాజీ గోలకొండ ప్రయాణము.

ఈకాలమునకు సరిగా రాజకీయపరిస్థితి శివాజీకి అనుకూలమాయెను. మొగలాయీ పాదుషా పంజాబులో యుద్ధమొనరించి ఢిల్లీకి వచ్చియుండినను ఆతని సైన్యము ఇంకను పంజాబునందే యుండెను. బిజాపూరులో సికందరు అను బాలుడు సుల్తానైనందున వశీకరపదవికై అంతఃకలహములును హత్యలును జరుగుచుండినవి. దక్కనీసాయబులు ఒక కక్షియు ఆఫ్ఘనులు ఒక కక్షిగాను కొట్టుకొనుచుండిరి. ఆఫ్ఘనులు పూర్తిగా నధికారమందుండిరి. మొగలాయీ రాయబారి బహదూర్ఖాను ఒక పక్ష మవలంబించి మఱియొక పక్షము మీద యుద్ధోన్ముఖుడై బిజాపురము మీఁదికి దండెత్తెను. ఇట్లు చేయుటచే క్రొత్తమంత్రి భలోల్ఖాన్ శివాజీతో చేరునని వాని యుద్దేశము. అది యట్లే యైనది. మాదన్న బిజాపురమును రక్షింపదలచియున్నందున శివాజీకిని భలోలుఖానునకును సంధి కుదిర్చెను. బిజాపురమువారు శివాజీకి మూఁడులక్షల రూపాయలు బహుమతిగాను, వారి తూర్పువైపు కృష్ణాతీరప్రశ్లను కాపాడుటకును మొగలాయీలను తఱుముటకును లక్షహొన్నులు వార్షిక మొసంగుటకును మాదన్న ఒప్పించెను. ఇట్టి సందర్భమున ఉత్తరమునుండి తనకెట్టి యాపదయును లేదని శివాజీ కనుగొనెను. ఈకట్టుబాట్లను తాత్కాలికముగా నొప్పుకొనెనే గాని ఎక్కువ కాలము పాలించు నుద్దేశ మాతనికిలేదు. నిలుకడలేని బిజాపూరు

ప్రభుత్వముతో నెట్టి స్నేహమును కుదుర్చుటకు సాధ్యముకాదని యాతఁడు తలంచెను. ధనము మాత్రము గ్రహించెను. పైగా నీమొగలాయీ రాయబారి బహదూరుషా, అంతకుపూర్వము రెండు సంవత్సరములుగా శివాజీతో యుద్ధ మొనరించుచుండి విసిగి విరామమపేక్షించుచుండెను. అందుచే నాతఁడు శివాజీతో సంధికోరఁగా తన దక్షిణదేశ దండయాత్ర కనుకూలమని శివాజి తత్క్షణమే అంగీకరించెను. తాను కర్నాటకదేశముపై దండెత్తి తిరిగి వచ్చులోపల దాదాపొక సంవత్సరకాలము బిజాపురమునకు మొగలాయీలవలన బాధలేకుండిన తాను శ్రమపడకయే వానిని రక్షించినట్లగునని యాతని యాశయము.

ఈకాలమునకు సరిగా నేతాజీఫాల్కర్ అను నతఁడు పదేండ్లకాలము తురకలలో కలసియుండి ఢిల్లీలో కొలువుచేసి మహారాష్ట్ర దేశమునకు వచ్చియుండెను. ప్రాయశ్చిత్తము చేసికొని మరల నీతఁడు హిందువయ్యెను. ఈతఁడును శివాజికి తోడై బయలుదేరెను.

ఈలోపల మాదన్నమంత్రికడనుండి రాయబారము వచ్చి గోలకొండవారికిని మహారాష్ట్ర నేతకును సఖ్యము కుదిరినది. మాదన్న సంవత్సరమునకు ఒకలక్ష హొన్నులు(బంగారు నాణెములు) తమ రాజ్యమును రక్షించుటకు శివాజీ కిచ్చుటకు ఒప్పుకొని యుండెను. ప్రహ్లాదనిరాజీ అను మహారాష్ట్రుని శివాజీ గోలకొండకు రాయబారిగా పంపియుండెను. శివాజీ

యును తన ఖర్చులు రాబట్టుకొనుటకొఱకు తన విజయములలో కొంతభాగము తానాషా కిచ్చుట కొప్పుకొనెను.

శివాజీకి స్వయముగా గోలకొండ వైభవమును చూడ వేడుకాయెను. హైదరాబాదులోని తన రాయబారికి ఈవిషయమును తెలిపెను. ప్రహ్లాదనిరాజీ అందులకు తగు సంవిధానమును మాదన్నతో మాటలాడి కుదిర్చెను. అఫ్జల్ ఖానును కూల్చినవానితో ఏకాసనమందు కూర్చుండిన నేమగునో యని తానాషా తొలుత భయపడెనట గాని ప్రహ్లాదనిరాజీ నమ్మకముగా పలికినంతట ఒప్పుకొనెను. మాదన్నయు శివాజీ ద్రోహ మొనర్పడనియు నాతనికి మొగలాయీలే వైరులనియు దృఢముగా తానాషాను నమ్మించెను. పైగా శివాజీతో ముఖాముఖిగ మాటలాడుటచే పెక్కు లాభము లున్నవనియు తెలిపెను.

తానాషా సమ్మతించిన వెంటనే రాయఘురునుండి శివాజీ 1677 సంవత్సరము జనవరిలో బయలుదేరెను. హైదరాబాదు రాజ్యముయొక్క ఎల్లలలో ప్రవేశింపఁగానే తన సైనికులకు ఎచ్చటను ఎవరికిని ఎట్టి హానిగాని కలిగింపరాదని గట్టి యాజ్ఞ నొసంగెను. ఇతరత్ర ఒనర్చునట్లు దోపిళ్లు ఇచ్చట పనికిరావనెను. ఎల్లవారితోను స్నేహముగా మర్యాదను పాటింపవలసినదని కట్టడిచేసెను. ఇందుచేత నాతని వెంట వచ్చిన ఏఁబదివేల సైన్యమును సాధువులవలె గోలకొండ రాజ్యమున ప్రయాణమొనర్చిరి. ఫిబ్రవరి నెలలో గోలకొండను

శివాజీ ససైన్యుఁడై సమీపించెను. తానాషా శివాజీకి ఎదు రేగి తోడ్కొని రాదలంచెను గాని శివాజీ వారించెను. "తానాషా దొడ్డవాఁడు. నాకన్నను చాలపెద్ద. నావంటిచిన్న వానికి ఆయన ఎదురేగరాదు" అని యామహావీరుఁడు పలికెను. కాని అక్కన్న మాదన్నలు మాత్రము కొన్నిమైళ్లు ఎదురువచ్చి శివాజీని సగౌరవముగా కొనిపోసాగిరి.

శివాజీరాకకై గోలకొండకు ఆఱుమైళులదూరమున నుండిన హైదరాబాదు నగరము అలంకరింపఁబడియుండెను. వీధులును సందులును గొందులును రంగవల్లులచేతను సన్నని కుంకుమకెంధూళులచేతను పసుపుపొడిచేతను మనోహరముగా నలరారుచుండెను. రాజమార్గములయందును నాలుగువీధులు కలియుచోటులయందును మహాసౌధములకడను గొప్పగడలు నిలిపి వానికి జెండాలు తోరణములు కట్టియుండిరి. వెదుళ్ల చేత అటనట గొప్పదర్వాజాలు కట్టి వానిని శృంగారించియుండిరి. జనులు వివిధములైన దుస్తులు ధరించి వీధులలో శివాజీయను నావింతపురుషుని చూచుటకు తమకపడుచు నిలిచియుండిరి. స్త్రీలందఱును మేడలమీఁదను కిటికీలకడను క్రిక్కిరిసియుండిరి.

మహారాష్ట్రసైన్యము పట్టణములో ప్రవేశించెను. సైనికులును వారి యున్నతాధికారులు బహువిధాభరణములతో ఉజ్జ్వలవేషములను ధరించియుండిరి. వారి కిరీటములు, వాని మీఁది బంగారు, రత్నములు, వారిజలతారువస్త్రములు, మహా

రాష్ట్ర వేషమంతయు తెలంగాణమువారికి వేడుకగా నుండెను. ఏబదివేల సైన్యము సుముహూర్తమున పట్టణమును చొచ్చెను. "ఈసైన్యమేగదా ఢిల్లీపాదుషాకు ప్రక్కలో బల్లెముగా నున్నది. వీరేగదా రెండేండ్లక్రింద ఏతగిరినిదోచి హైదరాబాదు వరకు వచ్చి కొల్లగొట్టినవారు. వీరేగదా ప్రసిద్ధినందిన వీరులకు గండరగండంత్రై యున్నారు!" అని జనులు రెప్పలువాల్పక వారిని చూడసాగిరి. కొంతసేపు మరాటా ఆశ్వికదళము ఖదం త్రొక్కెను. తర్వాత మావలీల కాల్బలము నడచెను. వారివారి దళనాయకులు జగత్ప్రసిద్ధులు, హమ్మీరరావు మోహితే, ఆనందరావు, మానాజీమోరే, సూర్యాజీమాల్సురే, యెశాజీ కంకు పోవుచుండఁగా జనులు వారిని తమ మిత్రులకు చూపి చూపి వారి వృత్తాంతములను వర్ణించుచుండిరి. వారితర్వాత శివాజీయొక్క ప్రతీహారి సోనాజీనాయకు, వానివెనుక బాబాజీ దంఢేరే, శివాజీయొక్క యంగరక్షకుఁడును పోయిరి. వారి విశాల నేత్రములు, నల్లని కనుబొమలు, కుంకుమచందనాదిక లిప్తమగు ఫాలభాగమును ప్రస్ఫుటముగ కనఁబడుచుండెను. తర్వాత రఘునాథ హనుమంతెయును అతని సోదరుఁడు జనార్దన హనుమంతెయు ప్రహ్లాదనిరాజియు, గ్రంథకారుఁడైన దత్తాజీ త్రింబక్, కేశవపంత్, నీలోమోరేశ్వరరావు, గంగాధరపంత్ మున్నగువారు గుఱ్ఱములమీఁద నేగిరి. వారి వెనుక వినీతవేషధారులైన కాయస్థుల వరుసలో పారసీ వ్రాయసకాఁడైన నీలప్రభు, కార్యదర్శి బాలాజీ అవ్‌జీ, రాజముద్రికా

ధారి శామ్‌జీనాయక్ అనువారలు ప్రవేశించిరి. వీరిందఱేగి నను చూపరులలో సంచలనము కలుగలేదుగాని, వారివెనుక మహామంత్రులు సేనాధిపతులు ప్రభువులు పరివేష్టించి వచ్చుచుండఁగా వారి నడుమ సన్నగా చిక్కిపోయిన వ్యక్తి జనుల నాకర్షించెను. అతఁడే శివాజీ. మూఁడువందల మైళ్లు నడచి యున్నందునను అప్పుడే ఏదో జబ్బునుండి తేఱుకొనుచున్నందు నను చాల బలహీనుఁడుగా కనఁబడుచుండెను, కాని ఇటునటు వీక్షించుచుండిన యాతని నేత్రములలో తైక్ష్ణ్యమును కాంతి యు జ్వలించుచుండినవి. పెదవులమీఁది యా 'మీసాలలో నవ్వులు'ను చక్కఁగా కోఁటేరు తీర్చినట్లున్న యాతని నాసి కయు నాతనికొక శోభను గూర్చి 'ఈతఁడు చండశాసనుఁడే గాని దయాళువే'యని నాఁడు గోలకొండ చూపరులకు తోఁచు చుండెను. 'శివాజీ మహారాజ్‌కు జయ్' అని ఆతని చూచు చునే జనులు అఱచుచుండిరి. స్త్రీలందఱును మేడలనుండి పువ్వులవర్షమును కురిపింపసాగిరి. ఇండ్లవాకిండ్లలో ముత్తై దువలు హారతు లెత్తుచుండిరి. ఈ వైభవము నంతయు చేయించుకొనుచు శివాజీ బదులు తాను బంగారమును వెండిని దారిపొడుగునను వర్షించుచుండెను. హారతులెత్తిన యిండ్లకడ తానే నిలిచి బ్రాహ్మణులచే ఆపళ్లెములలో వర హాలు పోయించుచుండెను. పట్టణములోని పేటలలోని యధి కారులు మర్యాద లొనర్చినప్పుడు వారికి శివాజీ ఉడుగర లిప్పించి గౌరవించెను.

ప్రకరణము - ౮. శివాజీ తానాషాను దర్శించుట.

ఈవిధముగా నూరేగింపు దాద్ మహల్ కడకువచ్చి నిలిచెను. ఎల్లవారును వారి వారి స్థానములో దిద్ది తీర్చినట్లు నిలువఁబడిరి. శివాజీయును అతని యుద్యోగస్థులు ఐదుగురును అక్కన్న మాదన్నలును గోలకొండ ప్రధానులు మఱికొందఱు వెంటరాఁగా తానాషా నగరులోని కేగిరి. విశాలమైన యాస్థానమంటపమును శివాజీ ప్రవేశింపఁగానే అచ్చట సిద్ధముగా నిలువఁబడియుండిన తానాషాయును అతని యనుచరులును ఎదురువచ్చిరి. తానాషా శివాజీని కౌఁగిలించుకొని తన ప్రక్కన రాజోచితమైన రత్నకంబళముమీఁద జలతారు దిండ్లకు ఆనుకొనునట్లు కూర్చుండఁబెట్టుకొనెను. వారి ప్రక్కనే సుల్తాను సైగచే మాదన్నమహామాత్యుఁడును అక్కన్నమహాప్రచండదండనాయకుఁడును కూర్చుండిరి. మిగిలినవారందఱును నిలువఁబడియే యుండిరి. లోపలనుండి సన్నని కంతలగుండ అంతఃపురస్త్రీలు ఈ వేడుకను చూచుచుండిరి. శివాజీ యంతటివాఁడు ఇంట ప్రవేశించుట యనఁగా నాగుఁబాము సాధువై మన ప్రక్కవచ్చి కూర్చుండుటవంటిదిగాను, ఆనాగమును అట్లు కొనివచ్చిన మాంత్రికుఁడు మాదన్నయనియు వారు తలంచుచుండిరి.

మూఁడుగంటలసేపు శివాజీ తానాషాలు గోష్ఠి సలిపిరి. మొదట పరస్పరము ఆచారోపచారములు, కుశలప్రశ్నలు మొదలైన మామూలుకార్యక్రమము జరిగినది. తర్వాత శివాజీ

కావించిన మహాత్కార్యములనుగుఱించియు నాతని ధైర్య సాహసములనుగుఱించి సభ్యు లుద్ఘోషించుచుండఁగా తానాషా కొంతసేపు వినెను. సభ్యులవర్ణనకు తనివిఁజెందక శివాజీ 'ఈ కామదేవతలు సరిగా వర్ణింపలేరు' అన్నట్లు తానే ఎట్లు తాను అఫ్జల్‌ఖానును కడ తేర్చినదియు, ఆతఁడు ద్రోహ మొంచిరాఁగా తా నందులకొనర్చిన ప్రతిక్రియయు, తనది ద్రోహము కాదని యు విరివిగా నుద్ఘాటించెను. తర్వాత తానాషా ఔరంగజేబును గూర్చి ప్రస్తావింపఁగా శివాజీ, పాదుషా నీచుఁడనియు, తనకు మొగలాయీలు తా మొనర్చిన వాగ్దానాదికములను నెఱవే ర్పక అల్పులుగా ప్రవర్తించిరనియు, సభలో తా నెట్లు పాదుషాను ధిక్కరించి వెడలివచ్చినదియు, తర్వాతి ఖైదును, ఆఖైదునుండి తాను తప్పించుకొనివచ్చినవిధమును, ఆవచ్చు టలో జరిగినవిశేషములను కథగా జెప్పెను. తర్వాత తాను సూరత్తును కొల్లగొట్టినదియు, దుర్గములను కూల్చినదియు, మొగలాయీవారిని ఏడిపించినవిధమును వర్ణించెను. ఈవిధ ముగా చాలసేపు మాటలాడిన ఛత్రపతికి తానాషా ఆభర ణము లొసంగి భూషణము లిచ్చి గుఱ్ఱములు, ఏనుఁగులు, మున్నగువస్తువు లొసంగి విశేషముగా గౌరవించెను. తానాషా కనుసన్నచే నాతని యనుచరులు శివాజీ యనుచరులకు వారి వారి కుచితమైన మర్యాద లిచ్చిరి. సభ లేవఁగానే తానాషా శివాజీపై అత్తరు పన్నీరు మొదలైనసువాసనలు చల్లి తాం బూల మొసంగి స్వయముగా మెట్లవఱకునువచ్చి విడిదికి సాగ

నంపెను. శివాజీ విడిదికిపోవుచు మరల మార్గమున ధనము చల్లుచు పోయెను.

అక్కన్న మాదన్నలు శివాజీతోకూడ నాతని విడిదల కేఁగి ఆతని కచట అన్ని యేర్పాటులనుచేయించి మరల సాయంకాలము వత్తుమనిపలికి వీడ్కొనిరి. తానాషాను వారువచ్చి మరల దర్శించిరి. శివాజీ సందర్శనమునకు అందఱును చాల సంతోషించి అతని సౌజన్యమునకు ఆతనిరాయబారిని చాల మెచ్చుకొని బహూకరించిరి. ఆమఱుసటిదినము అక్కన్నమాదన్నలయింట శివాజీకి విందు ఏర్పాటాయెను. వైభవముతో మహామంత్రులు శివాజీని ఆతని ముఖ్యవర్గమును తమభవనమునకు కొనిపోయిరి. ఆబ్రాహ్మణగృహమున శివాజీ పావుకోళ్లులేకయే ప్రవేశించి భానూజీభాగ్యమ్మలకు సాష్టాంగముగా నమస్కరించి ఆవృద్ధదంపతులచేత దీవనల నంది వారియెదుట వా రమర్చిన తివాసీపై కూర్చుండెను. కొంతసే పైనతర్వాత భానూజీ పంతులు శివాజీకి స్నానాదికముల కేర్పాటుచేయించి మడిగా నాతని పూజాగృహమునకు కొనిపోయి ఆశీర్వదించి భగవత్ప్రసాద మిప్పించి, బ్రాహ్మణసంతర్పణ మైనవెనుక భోజనాదికమున కేర్పాటుచేయించెను. సేవకులు, పరిచారకులు, వంటవాండ్రు శివాజీపరివారమును చూచుకొనుచుండఁగా భానూజీభాగ్యమ్మలు మర్యాదకు శివాజీకి ముందు భోజన మిడుదుమనిరి. ఆతఁడు వారు భుజించినగాని తానుభుజింపనని పట్టుపట్టగా విధిలేక తా మెల్లరును శివాజీక్షమను నూర్లపర్యాయము ప్రార్థించి భుజిం

చిరి. తర్వాత శివాజీని కూర్చుండ నియోగించి చెంత నానావిష యములు భానూజీ మహారాష్ట్రభాషలో మాటలాడుచుండఁగా భాగ్యమ్మ స్వయముగా, పరిచారకులు తెచ్చియిచ్చినపళ్లెముల నందుకొని వడ్డించెను. అక్కన్నమాదన్నలు తండ్రియెదుట కూర్చుండువారు కారు గాన దూరమునుండి చూచుచు వచ్చుచు పోవుచు నుండిరి. శివాజీ ఈమర్యాదకు పరమానందభరితుఁడా యెను. భోజనానంతరము తాంబూలచర్వణ మైనవెనుక శివాజీ ఎల్లవారికిని రత్నాదికములు భూషలు నిచ్చి బయలుదేరెను. అక్కన్నమాదన్నలును తండ్రిచేత శివాజీకి వస్త్రములు ఏనుఁగులు గుఱ్ఱములు నిప్పించిరి. శివాజీ ఆవృద్ధదంపతులకు సాష్టాంగముగా నమస్కరించి వీడ్కొనె . ఆతనియనుచరులును ఆ పార్వతీపరమేశ్వరులకు అట్లేచేసి బయలుదేరిరి. మాదన్న మరల మహారాష్ట్రపతిని మర్యాదగా బసలో విడిచివచ్చెను.

ఇంతవఱకు శివాజీ మాదన్నలు వ్యవహార విషయములు మాటలాడలేదు. అబుల్ హసన్ తానాషాకు శివాజీయందు చాలస్నేహ మేర్పడెను. శివాజీ చాల సరసుఁడనియు సౌజన్యవంతుఁడనియు, మహాసత్త్వుఁడనియు, సైన్యశిక్షణలోను కార్యదీక్షయందును అసామాన్యుఁడనియు తలంచెను. ఆతఁడేమి కోరినను ఒసంగి ఆతనితో సంధిచేసికొమ్మని మాదన్నను కోరెను. శివాజీతో మాదన్న ఆలోచించి యొక పథకమును కుదుర్చుకొనెను. దక్షిణదేశమును జయించుటకు శివాజీకి దిన మొకటింటికి మూఁడువేల హొన్నులు లేదా నాలుగునర

లక్ష రూపాయలు నెలనెలకు ఇచ్చునట్లును, తన సేనాధిపతి (సార్-ఇ-లష్కర్) యైన మీర్జామహమ్మద్ అమీన్ అను నతని నాయకత్వమున వేయిగుఱ్ఱపుదండును నాలుగువేల కాల్బలమును పంపునట్లును ఒప్పుకొనెను. కొంత తుపాకులు ఫిరంగులు వానికి వలసినమందులును, ఒప్పుకొన్నద్రవ్యము కొన్ని నెలలది ముందుగానే ఖర్చులకు ఇచ్చుటకు సైత మొప్పు కొనెను. ఈసాయమునకు బదులుగా శివాజీ దక్షిణదేశమును జయించి తన తండ్రియైన షాజీకి చెందని భాగముల నన్నిటికిని గోలకొండవారి కిచ్చునట్లును పూర్వము తనతండ్రి పాలించు చుండిన ప్రదేశములను తానుంచుకొనునట్లును వాగ్దాన మొన ర్చెను. మొగలాయీలవలన గోలకొండకు ఎట్టి యుపద్రవ మును తాను రానీయనని శివాజీ తానాషా ఎదుట ప్రమా ణము చేసెను. తానాషాయును పైయుద్ధద్రవ్యముగాక రక్షణ విధానమునకుగాను సంవత్సరమునకు శివాజీకి లక్షహొన్ను లిచ్చునట్లును మహారాష్ట్రుల రాయబారి నొకనిని తన యాస్థాన మం దుంచుకొనుటకును ప్రమాణపూర్వకముగా నొప్పు కొనెను.

శివాజీ గోలకొండలో ఒక నెలదినములుండెను. ఈనెల యంతయు ఊరిలో నుత్సవములు జరుగుచునే యుండినవి. శివాజీకి తానాషా రెండుపర్యాయములు దర్శన మొసంగెను. వ్యవహారములను గూర్చిన మాటలన్నియు మాదన్నయే ఆడెను. మరల దర్శన మిచ్చినప్పుడు మరల విస్తారము అనర్ఘ్య

వస్తువిశేషములను తానాషా శివాజీ కొసంగెను. తానాషా తన సౌధమున పైన కూర్చుండి ప్రక్కను శివాజీని కూర్చుండ బెట్టుకొని ప్రజలకు దర్శనమిచ్చెను. తానాషాయొక్క మంత్రులు సేనాధిపతులు మొదలు సామాన్యసైనికులవఱకు అందఱును రాజవందన మొనర్చిరి. వెంటనే మహారాష్ట్రులును అట్లే తానాషాకును శివాజీకిని వందనమాచరించిరి. తానాషా మహారాష్ట్ర సైన్యమునకు అధికారులకును సత్కారమొనర్చెను ఈవైభవమంతయు నైన వెనుక తానాషా శివాజీ గుఱ్ఱము మెడలో వెలలేని వజ్రహారమునువైచి చాల మెహనత్తు చేసెను. హైదరాబాదులోని ప్రభువులందఱును ఆదినము శివాజీకిని అతని బృందమునకును విందొనర్చిరి. విందైనవెంటనే తానాషాకు మహారాష్ట్రవీరుల శౌర్యబలాదికములను చూపనెంచి శివాజీ యశాజీకంకు అనువానిని ఏనుఁగుతో పోరాడుమనెను. గోలకొండవారి ఏనుగులలోని యుత్తమ మత్తేభమును తానాషా తెప్పించెను. ఆవీరుఁడు కత్తితో నాయేనుఁగుతో కొన్నిగంటలు పోరి దానికి రోషము పుట్టించి తుదకు దాని తొండమును నఱికె తఱుమగొట్టెను

తానాషా.—శివాజీ అన్నగారూ, మీవద్ద ఎన్ని గొప్ప ఏనుగులున్నవి.

శివాజీ.—తానాషా సుల్తాన్‌భాయి, వీరందఱును మాయేనుఁగులే. అని తన వీరులను చూపి సుల్తానును నవ్వించెను.

శివాజీ గోలకొండనుండి పోగానే ఈవిషయమంతయు మొగలాయీవారికి తెలిసిపోయెను. ఔరంగజేబు చాలకోపపడి బహదూరుషాను అధికారమునుండి తొలగించి ఆతని స్థానమున దిలిరుఖానును నియమించెను. దిలిరుఖాను గోలకొండమీఁదికి దాడివెడలెను. మాన్యఖేటము (మాల్ ఖేడ్) కడ గోలకొండవారి ఫౌజులు మొగలాయీవారిని ఎదుర్కొని సులువుగా ధ్వంసముచేసెను. అదే సందర్భమున మొగలాయీల బలము తగ్గినదని గ్రహించి దత్తాజీయను మహారాష్ట్ర సేనాపతి, గృహరక్షణకై శివాజీ నిలిపినవాఁడు, కనరాపైకి దాడివెడలి హుబ్బళి పట్టణమును కొల్లగొట్టెను.

ప్రక - గా. శివాజీ దండయాత్ర. మాదన్నకు ఆశాభంగము.

ఆవిధముగా నొక నెల వినోదించి ఛత్రపతి తనకు వలసిన వస్తువులను ద్రవ్యమును గ్రహించి గోలకొండనుండి సెలవు దీసికొనెను. ఆంగ్లేయులు నేఁడు కర్నాటకమని పేర్కొను దక్షిణదేశమందు శివాజీ 1677–78 సంవత్సరముల నడుమ జయించిన భాగము సంవత్సరమునకు ఇరువదిలక్షల హొన్నుల యూదాయము గలదిగా నుండెను. ఈ ప్రదేశమున దాదాపు నూఱు కోటలుండెనవి. వీనిలో చెంచి (జింజి) వేలూరును గలవు. ఈప్రదేశములలో నాతఁడు తన సిబ్బందిని కాపుంచెను. బంగారమును వెండియు కావలసినందునగదా శివాజీ ఈ యాత్ర బయలుదేరెను. తాను జయించిన యీదేశమును ఆతఁడు మూలమట్టముగ దోచుకొనెను. ఇట్లు దాహశాంతి

యైనంతట నాతఁడు మైసూరు, కొప్ప, గదగు, ధార్వారు, బెల గాములను జయించెను.

ఇప్పుడు శివాజీ గొలకొండవారికి కృతజ్ఞత తెలుపుచు ఒప్పందనమును నెఱవేర్పవలసియుండెను. కాని ఆతఁడు ఆప్రకారము చేయలేదు. మాదన్నకును తానాషాకును ఆశాభంగమాయెను. గొప్పవారికి ఎట్టివారికైనను ఏదో ఒక లోటుండును. అది రాజనీతి కానిండు లోకనీతి కానిండు. శివాజీ తనతోడి హిందువునకే మాటతప్పెను. తనప్రక్కనుండు దక్కను రాజ్యములలో నొకదానినే మోసముచేసెను. ఇంతవఱకు మాదన్న నిర్మించిన నీతి పునాదిలేని సౌధమువలె నేలఁగూలెను. తానాషా శివాజీ శీలమును చక్కఁగా నెఱింగెను. శివాజీకి దక్షిణ దిగ్విజయమునకు వలసిన ద్రవ్యమును వస్తువులను తానొసంగియుండియు గోలకొండలో తానును తన మంత్రులును వజీర్లును అట్లు మర్యాదచేసియుండియు దక్షిణ దిగ్విజయమున శివాజీ తనతండ్రికి పూర్వము చెందని రాజ్యములను తానాషాకు తానిచ్చుటకు ఒప్పుకొనియుండియు తుదకు ఇట్లు గోష్పాదమంత భూమియైన నీయక పూర్తిగా ఏమియు నెఱుంగనియట్లుండుట ఎల్లవారికిని ఆశ్చర్యకరముగా నుండఁగా తానాషాకును అక్కన్న మాదన్నలకు ఆశ్చర్యమగుటలో నాశ్చర్యము లేదు. తాను జయించిన కోటలలో నొకటిగాని, తాను గ్రహించిన ధనములోగాని తాను కొల్లగొట్టినదానిలో కొంతయైనను గాని మరల ఇచ్చుట ఏదియు శివాజీ తలపెట్టలేదు. దోచిన

ధనమంతయు తానే గ్రహించెను. ఆక్రమించిన భూమినంత యు తన యధీనమందే యుంచుకొనెను. జగడమాడు భార్యలు, చెప్పినమాట వినని కుమారుఁడు నిర్వహింపవలసిన కార్యభా రము అపారముగా నుండుట—వీనిచే శివాజీ మాట నిలుపు కొనలేకపోయెను కాబోలు.

గోడుచుట్టుపై రోఁకటిపోటుగా శివాజీ మఱియొక ఎత్తు, ఎత్తెను. లంచములిచ్చి బిజాపురమును స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నములు చేయసాగెను. కాని సిద్ధిమసూదనువాఁడు వానిని భంగపఱిచెను. తానాషా తానిన్ని దినములు బిజాపుర మునకు రక్షకుఁడుగను సికందరు సుల్తానునకు సహోదరునివలెను వ్యవహరించుచుండినందున శివాజీయొక్క క్రొత్తయెత్తులు దుస్స హము లాయెను. మాదన్న ఈసందర్భమున బిజాపురమునకు సాయముచేయఁదలంచి, క్రొత్తమంత్రియైన సిద్ధిమసూదునకును నాతని బిజాపుర శత్రువులకును సంధిగావింపఁ దలంచెను. ఆతని సైన్యమునకు ఈయవలసిన జీతములిచ్చి వారిని తిరుగుబాటు చేయనీయక కాపాడుటకును, శివాజీపై దాడివెడలి ఆతని కొంకణమునుండి వెలికి రానీయక యుంచుటకును సాయము చేయుటకు వాగ్దాన మొనరించెను. ఈయుపాయముమీఁద ఆడిల్‌షాహి సర్దారులు ఇరువదియైదు వేల గుఱ్ఱపుదళముతోను లెక్కలేని కాల్బలముతోను శివాజీమీఁదికి తయారగుచుండిరి. కాని ఇంతలో దిలిరుఖాను ఈప్రయత్నమునంతయు పాడు చేసెను.

దిలిరుఖాను మొగలాయి సేనాధిపతి. బిజాపురమును ఓడించి 1677 నవంబరులో సిద్దిమసూదునకు చాల యవమాన కరమగు పద్ధతులలో సంధిచేసికొనెను. ఊరిలోని యంతఃకలహములు, ఆఫ్ఘను సిఫాయీలు అనుదినము జీతము లడుగుచు తిరుగుబాట్లు చేయుచుండుట, ఒకవైపు రాజ్యములో శివాజీ కొల్లలు గొట్టుచుండుట వీనిచే ఎల్లవారును తన్నుదూషించుచుండఁగా సిద్దిమసూదు చాల చీకాకు పడసాగెను. ఖజానా ఖాళీగా నుండెను. ఇట్టి సందర్భములలో శివాజీతో సంధిచేసికొనుట మేలని యాతఁడు తలంచెనుగాని దిలిరుఖాను అట్టిచర్య అనవసరమనియు మహారాష్ట్రులను శిక్షించుటకు మొగలాయీ సైన్యము సిద్ధముగా నున్నదనియు ధైర్యమొసంగెను. కాని దేశముండిన సంక్షోభములో సిద్దిమసూదు చాలవ్యాకులచిత్తుఁడై శివాజికే జాబువ్రాసెను. "మనము ఇరుగు పొరుగు వారము. ఈరాజ్యముయొక్క యోగక్షేమములలో నాకు ఎంత యక్కఱయో నీకును అంతే. మొగలాయీలు మనకు ఉభయులకును శత్రువులు. మన మిరువురమును కలసి వారిని పాఱద్రోలవలెను."

ఈవిషయము తెలియఁగానే దిలిరుఖాను చాలకోపపడెను. ఇంతవఱకును బిజాపురమువారితో చేసికొనిన సంధి షరత్తులను పాటించుచుండెను గాని శివాజీతో సిద్దిమసూదు సంధి వ్యవహారములలో నున్నాఁడని తెలియఁగానే యాతఁడు బిజాపురముమీఁదికి దండెత్తెను. ఈకాలమున నొక విశేషము

జరిగెను. శివాజీ కొమారుఁడు శంభూజీ తండ్రికి లోబడక వ్యర్థుఁడుగా నుండెను. ఆలోచన లేనివాఁడై, ముంగోపియై, నిలుకడలేక, నీతిరహితుఁడై తిరుగుచుండెను. పరదారను బలాత్కరించిన కారణమున శివాజీ అతనిని పన్హాలా కోటలో ఖైదు చేయఁగా తప్పించుకొని భార్యతోఁగూడ లేచివచ్చి మొగలాయీవారితో చేరెను. దిలిరుఖాను పరమానందభరితుఁడై శంభూజీని సప్తహజారి మన్సబ్దార్ గావించి, ఏనుఁగులతో బహుమానించి ఔరంగజేబుచే సత్కరింపించెను. బిజాపురము ముట్టడించుటకు దిలిరుఖాను చేయు ప్రయత్నములు తీవ్రములయ్యెను.

తత్క్షణమే సిద్దిమసూద్ శివాజీని సహాయము కోరెను. శివాజి వెంటనే ఆఱు ఏడు వేల గుఱ్ఱపుదండును బిజాపురమును కాపాడుటకు పంపెను. కాని మసూదుకు మహారాష్ట్రులయందును నమ్మకము తక్కువగా నుండెను; మహారాష్ట్రులు కొంతవఱకు స్నేహముగానేయుండి తమ ద్రోహబుద్ధిని చూపఁగానే సిద్దిమసూదువారిని దూరమందుంచెను. వెంటనే శివాజీయాజ్ఞచే వారు దోచుటకు ప్రారంభించిరి గాని తుపాకి దెబ్బకు వారి నాయకుఁ డొకఁడు చచ్చుటచే వారు వెంటనే పాఱిపోయిరి. బిజాపురము మొగలాయీలతో సంధిచేసికొనెను.

మరల 1679 లో మొగలాయీలు బిజాపూరుమీఁదికి దండు వెడలిరి. సిద్దిమసూదు మరల శివాజీని ప్రార్థించెను. మరల శివాజీ సైన్యమును సహాయము పంపెను. కాని మొగ

లాయీలు వదలక ఆక్రమించుచు బిజాపురమును మెల్ల మెల్లగ సమీపించుచుండిరి. కాని శివాజీ సాయముచేత బిజాపూరు వారి మొండిపట్టుచేతను మొగలాయీలకు విజయము కలుగ లేదు. తర్వాత శివాజీ ఎక్కువకాలము బ్రదుకలేదు. సయ్యద్ జాన్ మహమ్మద్ అను సన్యాసియొక్క శాపముచేతనో లేక ఆయుర్దాయము లేనందుననో శివాజీ 1680 ఏప్రిలు 5 ఆదివార మునాడు మరణించెను. తర్వాత శంభుజీరాజారాములకు రాజ్య ముకై తకరారు కలిగి తుదకు శంభువు 1680 సం॥ జూలై నెల రాజాయెను గాని 16 జనవరి 1681 లోనే ఆతనికి పట్టాభి షేకమాయెను. శంభుజీకి కొంతకాలమువఱకు మొగలా యీల బాధలేకుండెను. కారణము ఈకాలమున మొగలాయీ సైన్యము రాజపుత్రులతో యుద్ధమొనరించుచుండెను. దక్షిణా పథమున బలవంతులైన మొగలాయీ సేనాధిపతు లెవరును లేరు. ఈలోపల పాదుషా కుమారుడు అక్బరనువాడు తిరుగఁ బడి శంభూజీ అండఁజొచ్చెను. మహారాష్ట్రుల శిక్షించుటకు ఔరంగజేబు చేసిన ప్రయత్నములేవియు కొనసాగవయ్యెను. 1683 వ సంవత్సరము పాదుషా తానే అహమద్ నగరుకు వచ్చెను. ఇచ్చటినుండి మహారాష్ట్రులమీఁదికి సైన్యములను పంపసాగెను. అటనట కొందఱు వీరులు తమ ప్రతాపములు చూపినను మొత్తముమీఁద ఫలితము సున్న. 1684 మార్చి నెల వచ్చునప్పటికి మొగలాయీలు బిజాపురముమీఁదికి సన్న

ధ్యులైరి. మే నెలకు పాదుషా స్వయముగానే షోలాపూరులో విడిసెను. మహారాష్ట్రులమీఁది ఒత్తిడి తగ్గెను.

1680 లో దిలిరుఖాను బిజాపురమును స్వాధీనము చేసి కొనలేక పోయినది మొదలు మొగలాయీలు బిజాపురము మీఁద ఎట్టిచర్యయు గ్రహింపలేదు. ఇందులకు కారణము మహారాష్ట్రులు ఆకస్మికముగా వచ్చుచు మొగలాయీలను బాధించుచుండి వారికి విరామములేక చేయుచుండినదే. ఇందు వలన బిజాపూరు ఆడిల్‌షాహి రాజునకు కొంత విరామముండినది కాని అది తాత్కాలికమే. తన కొమారుఁడైన అక్బరు శంభుజీకడ నున్నాఁడని తెలియఁగానే ఔరంగజేబు రాజపుత్రు లతో సంధికుదుర్చుకొని 1681 లో దక్షిణమునకు వచ్చెను. అప్పటికి శంభుఁ డొకఁడే ఆతనికి శత్రువు. బిజాపురముమీఁదికి గాని గోలకొండమీఁదికిగాని దాడివెడలు నుద్దేశ మాతని కింకను లేదు. శంభాజీతోడి యుద్ధమునకు బిజాపురి సర్దారులను సాయపడవలసినదని పాదుషా కోరెనుగాని వారెవరును ఆపని చేయలేదు. శంభూజీతో ఆడిల్‌షా స్నేహముగానే యుండెను. శంభుజీకి బిజాపురమువారి సాయము రానీయక యుండుటకుగాను పాదుషా తన సైన్యమును ఇరువురమీఁదికిని 1682లో పంపెను. కాని ఎక్కువపని జరుగలేదు. 1683 లో పాదుషా అహమద్ నగరమునకు వచ్చెను. కాని 1685 మార్చివఱకు తీవ్రయుద్ధము ప్రారంభించుటకు అనువుపడదాయెను. ఈలోపల 1683 లో రాజ్యములోని అంతఃకలహములకు విసిగి మహామంత్రి సిద్ది

మసూదు ఉద్యోగమును వదలుకొని అదవానిలో తన కోటకు చేరుకొనెను.

దక్షిణరాజ్యములకు మొగలాయీలవలన బాధతప్పదని తలంచి గోలకొండ మాదన్నపంతులు మహారాష్ట్ర బిజాపురీయులతో చాల సఖ్యముగా నుండెను. ఎట్లును గోలకొండవారు బిజాపురమునకు సాయముచేయుదురని తెలిసి ఢిల్లీపాదుషా 'ఎంతమాత్రమును బిజాపురమునకు సాయము చేయవలదు, చేసితివా నీకును అంత్యకాలము సమీపించును' అని తానీషాకు రాయబారమంపెను. కాని 1684 లో సికందర్ అడిల్‌షా గోలకొండవారి సహాయమపేక్షించియుండెను. మాదన్నమంత్రి దక్షిణరాజ్యము లన్నియు కలసియుండుట మంచిదని తలంచి ఒప్పుకొనెను. సికందర్ ఆడిల్‌షా పదునాలేండ్ల బాలుఁడని తానాషా ఆతనిపై కనికరము వహించెను. 1685 మే నెల, గోలకొండవారి చర్యలను పరికించుటకు ఔరంగజేబు సర్దారులను పంపఁగా వారు తానాషా సికందరుకు వ్రాసిన జాబును ఒకదానిని పట్టుకొనిరి. సికందరుకు సాయముగా పదివేల సైన్యమును గోలకొండవారు పంపునట్లును అట్లే శంభూజీని పంపుమని తాను ప్రార్థించుచున్నట్లును ఆజాబులో తానాషా వ్రాసియుండెను. ఈవిషయము తెలియఁగానే పాదుషా హైదరాబాదు మీఁదికి దండుపంపెను. బిజాపూరు గోలకొండవారలకు స్నేహముకలదని నాటి ఇంగ్లీషువర్తకులు ఎఱిఁగియుండిరి. దూరమున నుండుటచే వారికి కొన్ని విషయములు తెలియలేదు. ఈ

కాలపు వ్రాతలలో వారు, గోలకొండవారి సాయముతో పాదుషా సైన్యమును బిజాపూరువారు ఓడించిరనియు, పాదుషా కొమారుని షాఆలమును ఖైదుచేసిరనియు, నాతఁడు విషముతిని మరణించెననియు వ్రాసిరి. ఇది నిజము కాదు గాని గోలకొండవారు బిజాపురమునకు సహాయముపంపుటమాత్రము నిజము.

ప్రకరణ ౧౦. ఢిల్లీపాదుషా పంపిన రాయబారి.

అక్కన్న మాదన్నల యధికారమునకు గోలకొండలో నడ్డులేదు. తానాషాసుల్తాను వారికి స్వాధీనుఁడు. వారిచేతిలోని కీలుబొమ్మయని ప్రజలు వాకొనుచుండిరి. పైకట్లే తోఁచును. ఏలయన సకల విషయములును ఈమంత్రుల చేతులలో నుండెను. సుల్తాను వారినడుగక ఏదియు చేయఁడు. అంతమాత్రమే గాదు తనతో వారేదిచెప్పినను ఒప్పుకొనును. వారియందు అతనికి అట్టి నమ్మకము కుదిరినది. మొదట వారు మూసా ముజఫరులను తొలగించి అతనికి సాయము చేసిననాటి నుండి పెత్తనమంతయు వారిదే. తొలుత కృతజ్ఞతతో ప్రారంభమైన నమ్మకము స్నేహముగా మారినది. అక్కన్న మాదన్నలు తురకలు గాకపోయినను దైవభక్తి గలవారనియు రాజసేవాసక్తులనియు ఎంతమాత్రము ద్రోహులుగారనియు నాతఁడెఱుఁగును. తానాషా సుల్తాను విషయాసక్తుఁడనియు నిరంతరము అంతఃపురములోనే కాలము గడపుచుండుననియు, తన త్రాగుడు

నిరంతరాయముగ జరిగిన నాతనికి ఎది ఎట్లుపోయినను దుఃఖము లేదనియు మొగలాయీలు ప్రచారము చేయుచుండిరి. కాని వాస్తవము చూడఁగా తానాషా మహోత్కృష్టుఁడు. బాల్యములో తండ్రి మరణానంతరము పదునాలుగేండ్లు గొప్ప ఋషియొక్క పరిచర్య చేసియుండెను. ఇప్పుడును ఆయన సాన్నిధ్యమును పాయఁడు. సత్పాత్రమందు రాజ్యమునుంచి వేదాంతగోష్ఠి యందు కాలక్షేపమును చేయుచుండెను. కాని రాజకార్యముల యందు ప్రమత్తుఁడు గాఁడు. స్వయముగా నన్ని విషయము లను తెలిసికొనుచునేయుండును. ఉర్దూ ఫారసీ భాషలలో కవి త్వము చేయుచునుండును.

ఔరంగజేబు పాదుషా ఎట్లైనను గోలకొండరాజ్యమును ఆక్రమింపఁదలంచియుండెను. తానాషా సుల్తానుపై నేదైన నిందారోపణచేసినగాని తోడి మహమ్మదీయులు ఒప్పరని ఆతఁడు ఆతనిపై దోషములు కల్పింపసాగెను. పాదుషా గోల కొండలోని తన స్థానాధిపతి కిట్లు వ్రాసెను. "వీఁడు(తానాషా) దురదృష్టవంతుఁడు. ఒక కాఫిరువాని (మాదన్న)చేతిలో రాజ్య మునువదలి గొప్పగొప్ప సయ్యదులను, షేకులను, పండితులను వానికి లోఁబడునట్లు చేసియున్నాఁడు. తన రాజ్యములో ప్రత్యక్షముగా సకల పాపములను చేయించుచున్నాఁడు. త్రాగుడు, వ్యభిచారము, జూదము హెచ్చినవి. తానే స్వయ ముగా త్రాగి నిరంతరము స్త్రీల సహవాసమున ఒడలుమఱచి యున్నాఁడు. రాజ్యమదాంధుఁడై న్యాయాన్యాయములకును,

పుణ్యపాపములకును, ఇస్లామునకును కాఫిర్ల మతమునకును భేదము తెలియకయున్నాఁడు. ఆకాఫిరు శంభువునకు (శంభాజీ) లక్షహొన్నుల నిచ్చినాఁడు. నాస్తికులతోనే స్నేహము. భగవంతుని నియమముల నుల్లంఘించి ఈపాపి దేవమానవులకు ఇట్లు దూరమైపోవుచున్నాఁడుగదా.'' ఇదెంత నిజమో చదువరులకు తెలిసియేయున్నది.

కాని ప్రస్తుత పరిస్థితులచే కుతుబుషాయొక్క సామ్రాజ్యమును పీడించి ధనమును పిదుకుటయే దానిని స్వాధీనము చేసికొనుటకన్న మేలని చక్రవర్తి తలంచియుండెను. హైదరాబాదులోని మొగలాయీ స్థానాధిపతి గోల్కొండ సుల్తాను మీఁదను జనులమీఁదను అధికారము చలాయించుచు, వారిని తిరస్కరించుచుండినను వారు సాయుధులై తిరుగఁబడునంత వఱకు రానీయక వ్యవహరించుచుండెను. ఇందులకై ఔరంగజేబు కావలయుననియే మీర్జామహమ్మద్ అను నొక దయారహితమతిని, నిష్ఠురాలాపుని అతి కర్కశుని పంపియుండెను. ఆతని పని నిరంతరము కఠినముగా మాటలాడుచు ఏదోసాకు మీఁద గోల్కొండ సుల్తానుకు కోపము తెప్పించి, కొంత ఘర్షణకులాగి, ఆమీఁద గోల్కొండపై నొకదాడికి నెపము కలుగునట్లు చేయుటయే. తన రాయబారిని గోల్కొండకు పంపుచు ఔరంగజేబు ఇట్లు చెప్పియుండెను. ''నేను నిన్ను గోల్కొండకు పంపుట అచటినుండి నీవు రెండు పనికిరాని రాతిముక్కలను తేవలయునని కాదు. (వాస్తవముగా కుతుబుషాకడ రెండు గొప్ప

వజ్రము లుండినవి) నాకు అవిగాదు లక్ష్యము, నీవు తానాషాను సంతోషపెట్టవలయునవియు గాదు. నిర్లక్ష్యముగా వానితో మాటలాడుచు ఘర్షణకు దిగుము. అందుచేత నాతఁడు కోపము తెచ్చుకొని నిన్నుఁ దిరస్కరించినయెడల వాని నుచ్చాటనచేయుటకు నాకు అవకాశము దొరకును. సాధ్యమైనంతవఱకు వానితో జగడమువేయుము. సభలోగాని ఏకాంతమునగాని వానిని మర్యాదగా చూడకుము.”

తానాషా చాల మేధావంతుఁడు. శత్రురాయబారి యొక్క యభిప్రాయమును గ్రహించి అతఁడేమి చేసినను ఆగ్రహింపక యుద్ధమునకుగాని మనస్తాపమునకుగాని ఎట్టి యవకాశ మొసఁగక మెలగుచుండెను. ఈవిధముగా మొఘలాయి రాయబారితోడి మొరటుప్రసంగములలో మర్యాదపోయినను సౌఖ్యము కలుగునట్లు మెలగుటలోని న్యూనత నితఁడు తన చమత్కారముచే తప్పించుకొనుచుండెను. ఒకదినము మీర్జా మహమ్మదు పలికిన యాక్షేపమునకు కోపము మితిమీరివచ్చి తానాషా “మమ్ముకూడా మా దేశస్థులు పాదుషా అనియే అంటారు” అని బదులుచెప్పెను. అంతట నా దాంతుఁడు “నీవు పాదుషా అనిపించుకొన తగవు. ఔరంగజేబు వింటే ఆయనకు చాల కోపము వచ్చును.” అని అడ్డుపలికెను. తత్క్షణమే తానాషా సద్యః స్ఫురణతో “నీది పొరపాటు. మేము పాద్షాను కాకపోతే ఔరంగజేబు పాదుషాలకు పాదుషా ఎట్లా [illegible]డు.” అని ఆరాయబారిని నిరుత్తరునిఁ జేసెను. రాయ

బారి తానోడిపోయినట్లు తన మిత్రులతో చెప్పుకొనెను. ఈ విషయము ఔరంగజేబుపాదుషాకు తెలియవచ్చెను.

ఈవిషయములనే బెర్నియరను పాశ్చాత్య యాత్రికుఁడు ఇట్లు వ్రాసియుండెను. "ఔరంగజేబుకు ఆరాజ్యములోనికి (గోలకొండ) సైన్యములను పంపవలసినట్టి నిమిత్తము లేదు. గోలకొండరాజ్యము తనదిగానే యాతఁడు భావించుచుండెను. అయ్యది చాలకాలము మొగలాయీలకు సామంతరాజ్యము ......గోలకొండలో నున్నట్టి, మొగలాయీ రాయబారి తాను సర్వస్వతంత్రుఁడైన ప్రభువవలె వ్యవహరించుచు, నిరంకుశముగా నాజ్ఞలు, నిర్గమనపత్రములు శాసనములు నిచ్చుటయేగాక జనులను మిక్కిలి పీడించుచున్నాఁడు."

## ప్రకర. ౧౧ – దురదృష్ట ప్రారంభము.

ఒకనాఁడు అక్కన్న తమ ఇంటి మేడమీఁద నిల[illegible] బడి వీథివైపు చూచుచుండఁగా దూరమున నొక పల్లకి[illegible] ఎవరిదో వచ్చుచుండెను. అది పెద్ద పల్లకి. దానిని మోచుసేవారు దాదాపు పదునాలుగురుండిరి. వారి వెనుకను మ[illegible]ఘుర్ధును కొంత సిబ్బంది. వారు 'ఓంభాయి' అను అఱచు శబ్దము[illegible]లుగూరాల దూరము వినవచ్చుచుండెను. అక్కన్న ఆవైపే చుఱచుచు [illegible] చూడసాగెను. ఆవీథిలో నెవరి సవారిగాని వైభవముసాటకు [illegible] రాదు. మహామంత్రియు మహాసేనాధిపతియు [illegible] తే [illegible] గృహాముముందు వారితో సమానమైన వైభవము [illegible]తా[illegible]ప్ప

చుటకు ఎవరికిని అధికారములేదు. మీఁదు మిక్కిలి ఎక్కువగా చూపుట ఇంకను ధిక్కారమగును. అక్కన్నకు ఈపల్లకీ వైభవమంతయు చూడఁగానే ఎవఁడో తమ్ము ధిక్కరించు సంతటివాఁడు వచ్చుచున్నాఁడని తోఁచినది. ఆతఁడు ఎవఁడుగా నుండునాయని ఆలోచించునంతటి నెమ్మది అక్కన్నకు లేదు. వెంటనే ఆబోయలను నిలుపుఁడని తమ సేవకులకు ఆజ్ఞ చేసెను. తటాలున మంత్రుల సేవకులు ఆబోయలను అడ్డగించిరి. పల్లకి నిలిచినది. వారి సిబ్బందికిని వీరి సిబ్బందికిని మాటలును తిట్లును పోరాటమును నైనవి. మంత్రులయొక్క పటాలము ఎక్కువమంది అచటనుండినందున అక్కన్న చూపులో వారు ఆపల్లకిని చించి చెండాడిరి.

సరిగా నాసమయమునకే లోన నేదో పనిలోనుండిన మాదన్న వెలికివచ్చెను. ఆపల్లకిలోని గొప్పవాఁ డెవఁడు ఆతఁడు అత్తిమత్తరాయఁడు. 'ఆ! ఆ! ఎంతపని! ఎంతపని! ఎవరురా ఈపని చేసినవారు' అని తమ బంట్లను తఱిమి, అన్నను చూచి 'ఏమన్నా, ఈవిధంగా జరిగింది ఈయనగారిని నీవు చూడలేదా.' అని అనుచునే ఆయనను చాల మర్యాదగా లోనికి కొనివచ్చి చాల క్షమాపణకోరుచు, మర్యాద చేయించెను. అక్కన్న తమ్ముని భావము గ్రహించి, ఇది సిబ్బంది దోషమనియు, తనకు తెలియకపోయినదనియు చెప్పి తానును మన్ననవేఁడెను. అత్తిమత్తరాయఁడు 'ఏమి పరవాలేదు' అనెనే గాని ఆతని హృదయమున క్రోధానలము ప్రజ్వలించుట

మాదన్న కనిపట్టెను. ఆతఁడు ఢిల్లీపాదుషాయొక్క నివేద కుఁడు. ఆకాలమున పాదుషా సకలవృత్తాంతములను ఈనివేద కుల మూలమున గ్రహించుచుండెను. పాదుషాకు ఎవరియం దును నమ్మకములేదు. తన కొమారులనే నమ్మఁడు. తన రాయ బారి గోలకొండవారిని గుఱించి వ్రాయు వర్తమానములు 'నిజమా, కాదా' యని తెలిసికొనుట కాతఁడు నివేదకులను నియమించి యుండెను. రాయబారిమీఁద నీనివేదకుఁడు వేగు. రాయబారికి ఈతఁడన్న హడలు – ఏమి వ్రాయునో తన్ను గుఱించియని. అట్టివానికి కోపము వచ్చినయెడల అది ఎంత ప్రమాదకరమో ఊహింపశక్యమా! ఆతని శాంతింపజేయు టకు మాదన్న చాల ప్రయత్నించెను. మెల్లగా మర్యాద లతో తమ పల్లకీలో కూర్చుండఁబెట్టి ఆయనను సాగనంపెను.

ఈగందరగోళమైన నాటిరాత్రి మాదన్నకు చాలసేపు నిదురరాలేదు. ఉదయమున జరిగినదానినే చాలసేపు తలపో యుచు అక్కన్నచేసిన ఆలోచనతక్కువపనికి చింతించుచు ఇందేదో అనిష్టమున్నదని తలంచుచుండెను. సగమురాత్రి గడ చిన యనంతర మాతనికి నిదురపట్టెను. అప్పుడు ఆతనికి స్వప్న మున మహాలక్ష్మి దర్శన మిచ్చెను; 'మాదన్నా నేను మీ యింట అడుగుపెట్టి పదునొకండు సంవత్సరములు. ఇక నొక సంవత్సరము పూర్తియగు లోపలనే నేను మిమ్ము విడిచిపోవు చున్నాను.' అని స్పష్టముగా నాదేవి మాటలాడెను. మాదన్న మేలుకొనెను. ఆనిముసమందే అక్కనయు అదే స్వప్నముఁగని

మేల్కొనెను. సోదరు లిరువురును కలియబలికిరి. మాదన్న వెంటనే ఇట్లనెను. 'అన్నా తెలిసిపోయినది. మన భాగ్యదేవత వదలిపోవు దినములు వచ్చినవి. అందుచేతనే మన బుద్ధులు ఆ విధముగా మారినవి. కానీ; దైవగతి.' ఆతర్వాత వారిరువురు నిదురపోక ఉదయము తలిదండ్రులకు ఈవిషయమును తెలిపిరి. తండ్రియు 'భగవదాయత్తము' అనెను. నాడు అందఱును కలసి గ్రహశాంతులుచేసి దానధర్మములు చేసిరి.

మాదన్న తన పదవికి అంతము సమీపించుచున్నదని నిశ్చయించుకొనెను. ఇఁకను మిగిలియుండు నీకాలమును సద్వినియోగము చేయనెంచెను. భావికాలమునకు జాగ్రత్తగా కోయిలకొండ, హసనాబాదు, రాజగోపాలపేట లనుమూఁడు పర్గణాలను తన సోదరులు విశ్వనాథ మృత్యుంజయులకును తన తల్లిదండ్రుల కిప్పించెను. వెంటనే వారిని గోలకొండనుండి పదిలముగా నాప్రదేశమునకు రక్షణకై పంపెను. తనబంధువుల కనేకులకు అచ్చటచ్చట భూదానములు చేసెను,

ఆదినము అక్కన్న తన పల్లకిని నాశము చేసినది మొదలు అత్తిమత్తరాయఁడు అక్కన్న మాదన్నలమీఁద గంటువహించియుండెను. మాదన్నకు ఈవిషయము చక్కగా తెలియును. ఆదినము తాను అతనిని మర్యాదగా పంపినది చాలదని మరల నొకమారు ఆతని యింటికేగెను. మరల క్షమాపణ కోరెను. అక్కన్నకు ఆలోచన తక్కువ యనియు నాతఁడు కొంత ముంగోపి యనియు పైగా నాపల్లకి ఎవరిదో అని

అతఁడు నాఁడు తలఁచెననియు చెప్పి నానావిధముల నాతని హృదయమును రంజింపనెంచెను. తనకు తోచిన బహుమతుల నెన్నిటినో ఇచ్చెను. కాని అతఁడు వానిని గ్రహింపలేదు. తా నా విషయమునే మఱచిపోయితి ననెను. అతఁడు నవ్వుచునేయుండెను గాని అది తెచ్చికోలు నవ్వు. వికారముగా నుండెను. ఆ హృదయమున క్రోధానలము ఇంకను ప్రజ్వరిల్లుచుండెనే గాని ఆఱలేదు. "అక్కన్న ఈవిధముగా ప్రవర్తించినందువలన అక్కన్నకే మానభంగము గాని నాకేమి కొదువ. ఆతని గౌరవము పోయినదిగాని నాకేమిపోయినది. దీనిని గుఱించి మీరు ఏమియు అనుకొనవలదు." అని ఈతీరుగానే మాటలాడుచుండెను. మాదన్న ప్రయోజనము లేదని తలంచి వెడలిపోయెను.

ప్రకర. ౧౨ - మొగలాయీలతో ఘర్షణ. క్రీ. శ. 1685

బిజాపూరు రాజ్యమునకు సాయము చేసినందువలన గోలకొండకు మొగలాయీవారితో జగడమేర్పడినది; విషమించినది. క్రీ. శ. 1685 మార్చినెల ఔరంగజేబు బిజాపూరును ముట్టడించుచు సికందర్ ఆడిల్‌షాకు ఎంతమాత్రము సాయము చేయవలదని అబుల్‌హసన్ తానాషాకు ఆజ్ఞాపించెను. తర్వాత హెచ్చరిక వహించుటకుగాను మేనెల 24-వ తారీఖున పాదుషా బాహరామంద్‌ఖాన్ అనువానిని పంపి హైదరాబాదు ఎల్లలను కావలి కాయుచుండుమనెను. షోలాపూరులో విడిసియున్న పాదుషా స్కంధావారమున నుండిన

గోలకొండ స్థానాధిపతులను హెచ్చరికతో పరికించుచు వారి జాబులను తెఱచి చూచుటకు పాదుషా ఏర్పాటు చేసెను. జూన్ నెలాఖరులో అబుల్ హసన్ తానాషా తన స్థానాధిపతులకు వ్రాసిన యొకజాబు శత్రువులచేతఁబడెను అందిట్లుండెను. "పాదుషా గొప్పవాఁడే. ఇంతవఱకు చాల ఉదారుఁడుగానే యుండెను. కాని ఇప్పుడు సికందరు (బిజాపూరు సుల్తాను) నిస్సహాయుఁ డైనాఁడని బిజాపురమును ముట్టడించి చాల పీడించుచున్నాఁడు. కావున బిజాపూరు సైన్యమును శంభుజీ సైన్యమును కలిసి అటు ప్రక్కనుండి ఎదుర్కొని మొగలాయీలను అడ్డుచుండఁగా నేను ఈవైపునుండి నలుబదివేల సైన్యమును కలిలుల్లాఖాను ఇబ్రహీం నాయకత్వమున యుద్ధమునకు పంపుట అవసరము. అప్పుడు పాదుషా ఎటువైపునుండి యుద్ధము చేయునో చూడవలయును."

ఈజాబుచేత తానాషా తనకు స్పష్టముగా విరోధియే యని యేర్పడఁగా పాదుషా మండిపడెను. తత్క్షణమే అతఁడు 1685 సం. జూన్ 28 తేది తన కుమారుని, షాఆలం అనువానిని, గొప్పసైన్యముతో హైదరాబాదుమీఁదికి దండు బంపెను. 'ఇండి' అను ప్రదేశమున కాపున్నటువంటి ఖాసీ జహాన్ అనువానిని రాజకుమారునితో కలసికొనవలసినదని యాజ్ఞాపించెను. ఈవ్యూహముచేత బిజాపురమును ముట్టడించు సైన్యములు తగ్గి బలహీనములగునని ఎఱిఁగియుండియు తానాషాను దండించుటకు పాదుషా ఇట్లు చేసెను.

మొగలాయీ సైన్యములు భీమానదీతీరమున ఆగ్నేయ ముఖముగా నడచినవి. గుల్బర్గా షోలాపూరుల నడిమి డెబ్బది మైళ్లు మొగలాయీ స్వాధీనమున నున్నందున సులువుగా నడకసాగెను. తర్వాత కొంత మందగించెను. ముందు పోవు చున్న సైన్యమును నడపుచు ఖానీజహాను మాల్ఖేడు అనుకోటను సమీపించెను. రాజకుమారుఁడు మూఁడు నాలుగు ప్రయాణ ములు వెనుకఁబడి వచ్చుచుండెను. రెండు సైన్యములకును నడుమ 25 మైళ్లు దూరముండెను సేనాముఖరక్షకముగా నొక సైన్యమును నడుపుచు జాన్ నిసార్ ఖాన్ అను నతఁడు ముందు పోవుచుండెను. ఈసైన్యము మాన్యఖేటమునకు తూర్పుగా ఎనిమిది మైళ్ల దూరముననుండు 'సెరం' అను ప్రదే శమునకు రాఁగానే గోలకొండవారి సైన్యము, నలుబది వేలు మొదలు డెబ్బదివేలవఱకు నుండవచ్చును, మొగలాయీలను ఎదుర్కొనెను. గోలకొండ సేనాపతులు మీర్ మహమ్మద్ ఇబ్రహీం, షేక్ మిన్హాజ్, మాదన్నపంతులుగారి మేనల్లుడు రూస్తుంరావు అనువారలు. గోలకొండవారి గుఱ్ఱపుదళము మొగలాయీవారిని చుట్టవేసికొనినది. అతికష్టముమీఁద పోరాడి మొగలాయీలు దీనిని జయించినను వారి పురోగమ నము భంగమైనది. జాన్ నిసార్ ఖాను మాన్యఖేటమునకు మరలి అచటినుండి యుద్ధముచేయ నారంభించెను. గోలకొండ సైన్య ములు తమ యనుకూలములను చూచుకొని అనుదినము శత్రు వులను కొట్టుచుండినవి. గోలకొండ సైన్యము గొప్పదగుటచే

ఖానీజహాను తన స్కంధావారముచుట్టును ప్రాకారము లేర్పఱు చుచు మాన్యఖేటమునందేయుండి ముట్టడింపఁబడినవానివలె నాయెను శత్రువుల నెదుర్కొని యుద్ధముచేయుట కష్టమని యాతఁడు దుర్గము నిర్మించుకొని ఆత్మరక్షణప్రయత్నములు చేయసాగెను. ఒక యడుగైనను ముందు సాగుటకు లేకుండెను. తర్వాత కొంతకాలమునకు చక్రవర్తి కుమారుఁడు షా ఆలం వచ్చిచేరెను. ఇంతలో యుద్ధముయొక్క తీవ్రత తగ్గెను. తానాషావచ్చి ఢిల్లీ పాదుషాకు పాదాక్రాంతుఁడైనయెడల తానాయనకు చెప్పి తానాషాను క్షమింపింతునని షాఆలం రాయబారము పంపెను. తాము విజయులగుటచే తెలంగాణమువారు ఈమాటలను తిరస్కరించివేసిరి. ఉత్తర ప్రత్యుత్తరములతో కొంతకాలము గడచెను.

మొగలాయీలు మాన్యఖేటమున తమ సామానులను చేర్చుకొని తమ సేనాముఖమును ఖానీజహాను నేతృత్వమున హైదరాబాదుకు మార్గము కనిపట్టుటకు పంపిరి. ఈసైన్యమునకు మూఁడింతల సైన్యమువచ్చి ఎదుర్కొనెను. మొగలు సైన్యములో హిమ్మత్ ఖాను, సయ్యద్అబ్దుల్లాఖాఁ అనువారలక్రింది సైన్యములు మొండిపట్టుపట్టి పోరాడుచు ప్రతిదినము సాయంకాలమగుసరికి గోలకొండవారిని జయించుచుండెను. గోలకొండ సైన్యములో బారిఖాఁ అనువాఁడు, తుపాకితో గుఱిగా కొట్టునట్లు ఈటితో కొట్టు నేర్పుగలవాఁడు, ఖానీజహానును ఎదుర్కొనెను. కాని ఎచ్చటినుండియో శత్రు

వులు కొట్టిన బాణముచేత కూలిపోయెను. ఒక పర్యాయము మొగలాయీవారు ఓడిపోవుటకు సిద్ధముగానుండు సమయమున రాజారామసింగ్ అనువానియొక్క ఏనుఁగును ఉసికొల్పి శత్రువుల నడిమికి త్రోలిరి. అది తన దంతములకు కట్టియుండిన మూఁడు మణుగులు బరువుగల ఇనుపగొలుసును ఇటునటు కొట్టుచు పరుగిడి తటాలునరాఁగా గోలకొండవారి గుఱ్ఱములు బెదరి రౌతులనుత్రోసి చిందరవందరగా పాఱిపోయినవి. మొగలాయీవారికి జయ మబ్బినది. ఈవిధముగా ఒక్కొక యుద్ధముచేతను వారిపురోగమనము మూఁడు నాలుఁగు దినములాలస్యమగుచు వచ్చినది.

ఇంతలో ఆగస్టునెల వచ్చెను. ఎడతెంపులేని వానలచేత మొగలాయీలు కష్టపడఁజొచ్చిరి. వారిగమనము చాల మందగించినది. ఇంతలో గోలకొండవారు ఆయత్తపడఁ జొచ్చిరి. మాదన్నపంతులుగారి సొంత గుఱ్ఱపుదండు పదివేలస్తోమము వచ్చి యుద్ధరంగమును ప్రవేశించెను. జాఁనిసార్ ఖాను సిరములోని మట్టికోటలో చేరఁగా గోలకొండఫౌజు వారిని ముట్టడించినది గాని మొగలాయీలు ధైర్యముగా కోటను కాపాడుకొనిరి. ఈనిత్యయుద్ధములలో ఇరుపక్షములలోను లెక్కలేనివారు చనిపోవుచుండిరి. మొగలాయీలకు దినమంతయు ఘోరముగా యుద్ధముచేసినందున సాయంకాలమునకు జయమబ్బినను అలసిపోయి శత్రువును వెన్నంటుటకు సాధ్యపడనందున ఫలవంతము కాజాలకుండెను. మీఁదు మిక్కిలి మొగలాయీ

దండనాయకులలో ఐకమత్యము లేకుండెను. ఖానిజహానును కార్యకరణమందు మందుఁడని పాదుషా పలికినందునను అతని కన్నను చాల చిన్నవాఁడైన ఇతికద్ ఖాన్, ఖ్వాజా అబుల్ము కరం అనువారిని కూడలని పోగఁటచేతను, పాదుషాయం దాతనికి నిరసనభావ మేర్పడినది. వీరికెల్లరకును ప్రధాన నాయకుఁడైన రాజకుమారుఁడు చాల మృదుస్వభావుఁడై నం దున వీరి జగడములు పెరుగుచుండినవి. వీనిచేతను, అనేకులు ప్రతిదినము మరణించుచుండినందునను మొగలాయీ సైనికు లకు ధైర్యము పోసాగినది. తుదకు ఢిల్లీ వారి సేనాసమూ హము యుద్ధము నిలిపి రెండు నెలలు మాన్యఖేటప్రాంతమున విశ్రాంతినందసాగినవి. గోలకొండసైనికులును ఆచెంతనేయుండి, అప్పుడప్పుడు, రాత్రులు, మొగలాయీస్కంధావారములోనికి బాణములను అగ్నిబాణములను ప్రయోగించుచుండిరి.

ఇట్లుండఁగా పాదుషా తనకుమారుని అదలించు నొక రాయబారిని పంపెను. ఒకదినము గోలకొండవారు మొగలా యీల విడిదలలోనికి కొట్టిన బాణము కొంత అలజడి బుట్టిం చెను. మరల యుద్ధము ప్రారంభమాయెను. ఘోరముగా ఇరువాగులును పోరిన యనంతరము పాతిలము తన సూదా ర్యమును చూపెను. 'ఈయుద్ధము పురుషులకేగాని స్త్రీలకు గాదు' అని పలికి స్త్రీలను వేఱుప్రదేశమున చేర్చుటకు కొన్ని గంటలు వ్యవధియొసంగెను. తర్వాత మరల యుద్ధము ప్రారంభ మాయెను. సూర్యాస్తమయమునకు షేక్ మిన్హాజ్,

రూ_స్తమురావులకు గాయములు తగిలినవి. వెంటనే గోలకొండ సైన్యము వెనుదిరిగెను. రెండు సైన్యములకును చాల దెబ్బ తగిలెను. ఇప్పుడు ఇరువాగులును హైదరాబాదు చెంతకు వచ్చినవి. మఱునాటి యుదయము విచారింపఁగా గోలకొండ సైన్యము హైదరాబాదుకు పాఱిపోయెనని తెలిసినది.

ప్రకరణము. ౧౩ - కుట్రలు కుయుక్తులు.

తటాలున గోలకొండవారి సైన్యము పాఱిపోవుటకు కారణము చాల గొప్పదే. అత్తిమత్తరాయఁడు ఎట్లయినను అక్కన్న మాదన్నలను కడతేర్చు నుపాయ మాలోచించు చుండెను. ఇట్లుండఁగా నాతనికి సందుచిక్కెను. షేక్ మిన హాజ్ ఏకారణముచేతనో అక్కన్నతో వైరమూనియుండెను. మొదటినుండియు అంతఃపురమందలి స్త్రీలకు అక్కన్నమాదన్న లన్న ద్వేషముండెను. అబ్దుల్లా సుల్తాను భార్యలైన సరోమా జనీసాహేబులకు తానాషామీఁద మొదట నేర్పడిన ద్వేషము ఆతని మంత్రులమీఁదికి ప్రసరించెను. వీరికి ఈ హిందువులను తొలగించి తురకలను మంత్రులుగా నియమించుకొనవలయునను కోర్కెయుండెను.

స్కంధావారమునుండి అనుదినము యుద్ధమొనరించు చుండిన షేకుమిన్ హాజునకును నగరిలోనుండు అత్తిమత్తరాయ నికిని అంతఃపురమందలి ఆపూర్వసువాసినులైన పూర్వరాణు లకును ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచుండినవి. మిూర్

ఇబ్రహీం అనువానిని మొగలాయీలు తమ వైపు లాగుటకు ప్రయత్నించుచుండిరి. షేక్ మిర్జా హాజ్ కూడ మొగలాయీ లతో చేరుటకు యత్నించుచు ఆవిషయమును పైకి తెలియ నీయక మెలఁగుచుండెను. రహస్యముగా గోల్కొండకు చారు లనుపంపి ప్రతిదినము సాయంకాల మగుసరికి గోల్కొండఫౌజు ఓడిపోవుటకు కారణము ఇబ్రహీము కార్యశ్రద్ధవహింపకపోవు టయే యని తానాషాకును మంత్రులకును తెలియునట్లు చేయు చుండెను. అట్లే ప్రచారమగుచుండెను. మీరుమహమ్మదు, మొగలాయీలకు మీర్ ఇబ్రహీం అనుకూలుఁడను నభిప్రాయ మును తెలుపునట్లు మాటలాడుచుండెను. సుల్తాను మాదన్నను పిలిపించి ఇట్లుండునా యని యడిగెను. మాదన్నకు మొగలా యీలన్న ద్వేషమేగాని ఇందు సత్యము తెలియనందున తా నేమియు గట్టిగా చెప్పుటకు లేదనియు విషయము చక్కఁగా తెలిసికొనవలసియున్నదనియు చెప్పెను. గోలకొండలో మీర్ మహమ్మదును అంతఃపురమువారును వీరితో చేరినవారును 'తానాషా సుల్తానును మాదన్నయు కలసి ఇబ్రహీమును ఖైదు చేయబోవుచున్నారు' అని ప్రవాద పుట్టించిరి. ఈమాటలు స్కంధావారమున ఇబ్రహీం చెవిలోపడెను. సరిగా కూడనుండిన మిర్జాహాజ్ చెలిమి నటించుచు అతనికి అపాయము తప్పదని వెంటనే మొగలాయీలకడకు పాఱిపొమ్మనియు తానును శీఘ్ర ముగ వెనుకవచ్చునట్లును నమ్మించెను. లోకులను మోసము చేయుటకు ప్రత్యక్షముగా నిరువురును ఒకదినము జగడమాడి

తటాలున నాకారణముచేత వెడలిపోయినట్లు ఇబ్రహీము మొగలాయీలకడకు పాఱిపోయెను. అతనిని వారు గౌరవించి ఆఱువేల సైన్యమునకు మన్సబ్దారుగా నియమించి మహబత్ ఖానను బిరుదిచ్చిరి.

ఇబ్రహీము పాఱిపోయెనని తెలిసినంతనే మాదన్న మీఁద నాతని శత్రువులు చాడీలు చెప్పనారంభించిరి. శత్రుపక్షమున చేరిన మీర్ ఇబ్రహీం మాదన్నకు ఆశ్రితుఁడనియు, ఆతఁడు వంచన చేయబోవుట మాదన్నకు ముందుగానే తెలియుననియు, అందుచేతనే ఆనాఁడు తెలిసియు, ఇంకను విచారించుట మంచిదని పల్కెననియు, ఇంక త్వరలోనే మాదన్నయు గోలకొండవారిని మోసముచేసి శత్రువులతో చేరుననియు షేక్ మిర్ హాజ్ తానాషాకు చెప్పనారంభించెను. ఈవాక్యములను తానాషా నమ్మలేదు. తన చిరకాలమిత్రుఁడును, తనకు విశ్వాసపాత్రుఁడును, మహామేధావంతుఁడును ధర్మబుద్ధియు నైన మాదన్న ఈరీతినుండఁడని తానాషా గట్టిగా చెప్పి మిర్ హాజును నిరుత్తరుని చేసెను.

ఇంతలో అంతఃపురమందలి స్త్రీలు తమకు హైదరాబాదు నగరములోనుండిన అపాయమనియు మొగలాయీలు బలవంతులగుటచేత హైదరాబాదును తాము వీడి గోలకొండ దుర్గమున ప్రవేశించుట మంచిదని మిర్ హాజ్ మొదలైన వారి దుర్బోధనలచే నాందోళనము చేయసాగిరి. మిర్ హాజ్ స్వయముగాపోయి తానాషాతో నిదేరీతిని మాటలాడెను. తానాషా

మాదన్నతో నాలోచించెను. మాదన్న దూరదర్శి; ఆప్రకారము చేయరాదనెను. గోలకొండలో చేరుటకన్న ఓరుగంటికో కాక మఱియేదైన దూరప్రదేశమునకో పోవుట మంచిదనియు గోలకొండను శత్రువులు ముట్టడించిన తాము బయట ధారాళముగా తిరుగుచు లోపలివారికి సాయముచేయుచు యుద్ధమొనరించుట కవకాశముండుననియు హితోపదేశ మొనర్చెను. ఇదంతయు మాదన్న దురుద్దేశమని మిర్జాహాజ్ చెప్పసాగెను. తానాషా అతని వాక్యములను నమ్మకపోయినను రాణివాసముయొక్క ప్రోద్బలముచేత గోలకొండకోటలో ప్రవేశించెను. ఇది చాల పొరబాటైనను మాదన్న ప్రభువాక్యమును మన్నించెను.

గోలకొండపతనములో నిది ప్రథమసోపానము. రాజద్రోహపరంపరలో మొదటిది. ఈసేనాపతియొక్క ద్రోహము హైదరాబాదును తలక్రిందులు చేసెను. రాజ్యరక్షణప్రయత్నమంతయు భగ్నమాయెను. ఇంకను చాల సైన్యము సురక్షితముగా నున్నను తానాషాకు ఏదో అధైర్య మేర్పడెను.

మిర్జాహాజ్ యొక్క ఈకుట్రచేత మాదన్న మర్యాద పోలేదు గాని భాగ్యనగరము (హైదరాబాదు) అభాగ్యమాయెను. గోలకొండ సైన్యము పాఱిపోవుటయు వెంటనే సుల్తాను నగరమువదలి కోటలో చేరుటయు పాఅలమునకు తెలియుటకు మునుపే ఊరిలో నల్లకల్లోలములు రేగినవి. సుల్తాను తనకు సాధ్యమైన వస్తువులు, నగలు, నాణెములు, రత్నములు, రూప్య

ములు గ్రహించి స్త్రీలతోగూడ కోటకు పాఱిపోయెనని జనులు రచ్చచేయసాగిరి. వర్తకులును సిబ్బందియు వెనుకనుండి కోట లోనికి పరుగిడసాగిరి. సామాన్యగృహస్థులును రక్షణకొఱకు దిగులుపడసాగిరి. ఎక్కడివారక్కడ పాఱిపోవుటకు సిద్ధులైరి. సొత్తు, ఇల్లు, వాకిలి ఎట్లయిననేమి, ప్రాణమానము లుండిన చాలునని కొందఱు తమ బంధుమిత్రులతో పరారియైరి. స్త్రీలు బురఖాలు తగిలించుకొనుటకుకూడ నవకాశము లేకపోయెను. ఇంతలో దొంగలు కొల్లగాండ్రు దోపిడీలు మొదలుపెట్టిరి. సుల్తాను కోటలో ప్రవేశించిన నాటి రాత్రియంతయు నిట్లే జరిగెను. కొందఱు వీరులు తమ శక్తినంతయు వినియోగించి పలువురు జనులను ఆస్తిని కాపాడిరి. మాదన్నయు అక్కన్న యు రూస్తమురావును చాల పాటుపడిరి. మిర్జాహాజ్ స్వాధీన మున నుండినసేన మాదన్నకు సాయపడలేదు. తెల్లవాఱునప్ప టికి మొగలాయీవారి సైన్యము భాగ్యనగరమును ప్రవేశిం చెను. మూలమూలలను సందుగొందులను ప్రవేశించి దోచుకొ నెను. బంగారము, జవాహర్, రత్నములు, నగలు, వస్త్రములు వస్తువులు కొన్నివందల బండ్లకు దోపిడీ ఆయెను. రత్నకంబ ళములు గొప్పవి కొనిపోలేక ద్వేషముచేత వానిని కత్తులతో చించి చెండాడిరి. హిందూ మహమ్మదీయ స్త్రీలను, బాలురను, బాలికలను చెఱగొనిపోయిరి. వృద్ధులను బలహీనులను నానా విధముగా హింసించిరి. బలవంతులను కొద్దిమందిని పెక్కురు పరివేష్టించి బాధించిరి. ఇండ్లను తగులబెట్టిరి. పాఱలము ఎంత

ప్రయత్నించియు తన సేనకు పట్టిన ఈ యావేశమును మాన్ప లేకపోయెను. తుదకు సేనయొక్క కొత్వాలును, దివానును ఇంక కొందఱుద్యోగులును ఈదోపిడీని ఎట్లో నిలిపించి వారి చేత నింకను పడనట్టి కొన్ని కార్ఖానాలలోని ద్రవ్యమును మాత్రము హరించిరి. ఇంతలో తానాషా పాదుషాకడకు రాయ బారినిపంపి క్షమవేడగా నాతఁడు దోపిడీవారిని ఎక్కువగా శిక్షించి జనులను కాపాడెను. తగులఁబడుచుండిన ఇండ్లను ఆర్పించెను. దాదాపు డెబ్బదిలక్షల హొన్నుల విలువగల వస్తువులు, దోపిడీపోగా మిగిలినవి, పాదుషాచేతఁ జిక్కినవి. ఎంత దోపిడీయైనదో! పాదుషాకుమారుఁడు పశ్చాత్తాపపడసాగెను. ఆతనిది మెత్తని హృదయము. పాదుషాఅంతటి కర్కశుఁడు గాఁడు. ఏమైనను తానాషా మహమ్మదీయుఁడే గదా యని తలంచి ఒక కోటియు నిరువదిలక్షల హొన్నుల కప్పము సంవత్సర మొకటికి కట్టుటకు తానాషా ఒప్పుకొనునెడల తాను చక్రవర్తికి వ్రాసి మన్నన యిప్పింతుననెను.

ప్రకరణము. ౧౭-మాదన్నమీఁద రెండవకుట్ర.

అక్కన్నమాదన్నలు పెట్టిన... 

అత్తిమత్తరాయని మొదటి ప్రయోగము ఫలింపలేదు. తానాషాకు వారిపై ననుగ్రహ ముండువఱకును వారిబలము తగ్గుట కవకాశములేదు. ఈమాఱు మఱియొక విధమైన ప్రయోగము లేవనెత్తెను. మొగలాయీలువచ్చి చెంతనే యున్నారు. దినదినమును ఏదోక్రొత్త ఆశ్చర్యకరమైన విశేష

మొకటి జరుగుచునే యుండెను. మీర్ ఇబ్రహీం మొగలా యీలకడకు పోయినది మొదలు ఎవడో యొకడు ప్రతి దినము ఆపనియే చేయుచుండెను. సర్దారులు చాలమంది పాటి పోయిరి. ఒకదినము తానాషా చాల ఖిన్నుడాయెను. షారఫ్-ఉల్-ముల్క అనునతడు, ఆతని చెల్లెలి భర్తయే, మొగలా యీలకడకు పోయిచేరెను. ఈసందర్భమున అత్తిమత్తరాయడును షేకుమిర్జా హాజును కలసి యొక దొంగజాబును పుట్టించిరి. ఔరంగజేబు స్వయముగా వచ్చినయెడల తాము తానాషాను పట్టియిచ్చి గోలకొండకోటను అతనికి స్వాధీనము చేయుటకు సిద్ధముగా నున్నామని అక్కన్న మాదన్నలు పాదుషాకు వ్రాసి దానిని ఒకనిచేతికీయగా దానిని ఎవరో పట్టుకొనివచ్చినట్లు సుల్తానుకడకు తెచ్చిరి. తానాషా ఆజాబును చూచుకొనెను. మాదన్న వ్రాతవలెనే అదియుండెను. కాని సుల్తాను మనుష్యుల అంతరంగమెఱిగినవాడు. ఈజాబును పట్టుకొనినవారు మాదన్నకు స్నేహితులుకారు. ఇందేదో ప్రయోగమున్నదని యాతడు గ్రహించెను. వెంటనే అక్కన్న మాదన్నలను పిలిపించెను. వారును వచ్చిరి. ఆజాబు వారిచేత నిడెను. వారిరువురును దానిని చూచిరి. వారి మొగములయందు ఎప్పటి ప్రసన్నత యుండెనేగాని అవి దొంగమొగములుగాలేవు. తమవ్రాతగల మఱియొక కాగితమును చూపి పోల్చుకొనుమని వారు ప్రభువును కోరిరి. కొన్ని యక్షరములలోను భాషలోను భేదముండెను. ఈజాబు వాస్తవముగా తమదేయని ప్రభువు నమ్మి

యుండినయెడల తానెట్టి శిక్షకైనను తలయొగ్గియున్నటులు మంత్రులు ప్రమాణమొనర్చిరి. తానాషా వెంటనే ఆజాబును చింపివేసెను. అంతసేపును అట్టె చూచుచుండిన మిర్జాహోజ్ అత్తిమత్తులు మత్తులవలెనై వెడలిపోయిరి. తానాషా తనకు కష్టకాలము సంప్రాప్తమైయున్నదని తలంచి తన మంత్రులమీఁది యీప్రయోగములు ఎట్లు పరిణమించునో యని చింతించెను.

తానాషా సెలవునంది ఇంటికి వచ్చుచునే భగవంతునిపై భారమువేసి అక్కన్న మాదన్నలు తమ గుమస్తాలను పిలిపించిరి. కాశీ రామేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రములలో లక్షమంది బ్రాహ్మణులకు అన్నదానములకు ఏర్పాటుగావించిరి. ఎప్పటికైనను చనిపోవుట నిజము. మఱియు నీరాజకీయ కల్లోలములలో ఏపుట్టలో ఏపామో! ఇఁకను పారలౌకిక కార్యములు చేయుటకు కాలము వచ్చినదని వారు తలంచిరి. తల్లిదండ్రుల కపాయమురానీయక వారిని తమ్ములతో దూరదేశమునకు పంపివేసిరిగదా. ఇది మొదలు తమ జీవితమంతయు భగవత్కైంకర్యమున గడుపమొదలిడిరి. శ్రీశైలగర్భాలయమునకు బంగారు పూఁత పూయించిరి. పుష్పగిరి శంకరాచార్య పీఠమునకు భూదానము లిచ్చిరి. గోలకొండకు సమీపమున మహేశ్వరమను చోట శివాలయమునకు ఒకవారములో నొక మహోన్నతమగు గోపురమును నిర్మించిరి. అచ్చటనే యొక తటాకమును త్రవ్వించిరి. ఆలయగోపురమునకు కలశాదిప్రతిష్ఠలుచేసి, పూజాదులను హెచ్చుగా నేర్పాటుచేసి ప్రతిదినమును రెండువేల

మంది బ్రాహ్మణులకు అన్నదానము చేయుటకు ప్రారంభించిరి. ఎన్ని రాచకార్యము లుండినను ప్రతిదినమును, ఉదయము పది గంటలకును రాత్రి పండ్రెండుగంటలకును, అచ్చటికేఁగి స్వయముగ బ్రాహ్మణ సమారాధనలో పాల్గొని వచ్చుచుండిరి.

ఇట్లు వీరు కైంకర్యమున నుండఁగా శత్రువులు సుల్తాను సాయములేక అక్కన్నమాదన్నలను చంపివేసిన యెడల చాలబాధలు పోవునని తలంచిరి. అంతఃపురమునుండి ఆ పూర్వసువాసినులు వీరికి సాయపడుచుండిరి. వీరందఱును కలసి, తానాషాకడనుండి మంత్రులు ఒంటరిగా వెడలిపోవు సమయముచూచి వారిని చంపివేయవలసినదని ఏర్పాటుచేసికొని తమ తమ పరివారములతో సమయము వేచియుండిరి. అంతఃపురమునందలి పనికత్తెలందఱును ఇందులకు తయారై యుండిరి గాని ఎట్లో ఈవిషయము మంత్రులకు తెలిసిపోయెను. తానాషాకు దీనిని వారు తెలుపఁదలఁచుకొనలేదు. మహాలక్ష్మి త్వరలోనే వెడలిపోయెదనన్నదిగదా. దేశమా, గందరగోళముగానున్నది; ప్రాణమా, తామరమీఁది నీటివలె చలించుచున్నది. తన యైశ్వర్యమంతయు తనయెదుట కొల్లవోయినను సుల్తాను దుఃఖపడకుండ నున్నాఁడు. ఆతఁడే వేదాంతిగానుండ మనమేల అట్లుండరాదు అని ఆసోదరులు భావించిరి. ఈ మూఁడవకుట్ర జరిగిన యనంతరము తమకు అంత్యకాలము చాల దాపైనదని తలంచి మహామంత్రులిరువురును తమ ఇంటఁగూడ విశేషవస్తువు లుంచుకొనక సర్వస్వము దానముచేసిరి. బంధువు

లను సత్కరించి దూరస్థలములకు పంపివేసిరి. భార్యలును తా
మును గుమాస్తాలును పరివారముమాత్ర ముండిరి. అక్కన్నకు
మాత్రము మల్లయ్య యని రెండేండ్లకుమారుఁ డుండెనేగాని
మాదన్నకు సంతానము లేదు. మల్లయ్యను దాది ఎప్పుడును
ఎడఁబాయక కాపాడుచుండెను. ఇంటికడను బ్రాహ్మణులకు దాన
ధర్మములు చేయుచుండిరి. ఇదంతయు తానాషా ఎఱుఁగడు.

## ప్రకరణము. ౧౫-పాదుషాతో రాయబారము.

షాఆలము పంపిన రాయబారులు పాదుషాకు సకల విష
యములును నివేదించిరి. పాదుషా సంతోషించుటకు బదులు
మండిపడెను. అంత ధనము లూటీ కానిచ్చినందులకు షాఆలము
చేతఁగానివాఁడనియు బుద్ధిహీనుఁడనియు అఱచెను. తన కుమా
రుఁడు లూటీలో చాల భాగము దాఁచుకొని కొంతయే తనకు
పంపి ద్రోహముచేసియుండునని యనుమానించెను. అందుచే
మొగలాయీలు రెండవమారు గోలకొండమీఁదికి దాడివెడ
లిరి. అక్టోబరు నెల 1685 సంవత్సరము షాఆలము మొదట
డోబిపేటమీఁదుగా హైదరాబాదుకు పదునాఱుమైళ్లు పడ
మటినుండి గగన్‌పహారిపేటకు వచ్చియుండెను. అచ్చటినుండి
ఇప్పుడు ఘోషామహలు నగరుకుపోయి కోటకుచెంత తానాషా
యొక్క ఉద్యానవనమును ఆక్రమించెను. కొన్ని దినములవఱకు
అక్కన్న మాదన్న తానాషాలు రాజకుమారునితో రాయ
బారములు జరుపుచుండిరి. పాదుషాకోరినదెల్ల తాము చేయు

టకు సంసిద్ధులమని తెలుపుచుండిరి. ఆనెలలోనే తానాషాకు పాదుషా ఈక్రింది సంధినిబంధనలు పంపెను. "ఇదివఱకును ఏర్పడిన కప్పముయొక్క బాకీలకొఱకై తానాషా ఒకకోటి యు నిరువది లక్షలహొన్నులు సమర్పించుకొనవలసినది. ఇది గాక ప్రతిసంవత్సరము రెండులక్షల హొన్నులుకట్టుచుండవల సినది. తక్షణమే అక్కన్న మాదన్నలను తొలఁగింపవలసినది. మాన్యఖేటము, సిరము మొదలైన ప్రదేశములను మొగ లాయీలకు శాశ్వతముగా వదలివేయవలసినది."

షాఆలము తానాషా ప్రార్థనపై గోలకొండనుండి లేచి నలువది యెనిమిది మైళ్లదూరమున కుహీర్ అను చోటికి పోయి పాదుషా ఆజ్ఞను తానాషా నిర్వహించునని ఎదురు చూచుచుండెను. ప్రస్తుతము గోలకొండలోనుండిన పరిస్థితుల ప్రకారము ఈకార్యము తక్షణమే సాధ్యముగాదు. అన్ని లక్షలు వెంటనే ఎట్లుదొరకును? రెండవది అక్కన్న మాదన్న లను ఎట్లు తొలగించుట? తానాషా హృదయము వారియెడల కృతజ్ఞతాబద్ధమైయుండెను. తమ శరీరములు వేఱుగాని హృద యము లొకటే యని ఆమంత్రులును ఆసుల్తానును తలంచియుం డిరి. వారియందేమి దోషము? తానాషా వేదాంతి. రాచ కార్యములకును మతమునకును సంబంధము ఆతనికి గోచరింప లేదు. పైగా కుతుబుషాహి గోలకొండ రాజ్యములో మహ మ్మదీయేతరులు మంత్రులుగా నుండియున్నారు. వారికి రాజ భక్తియు దేశభక్తియు లేకపోలేదు. ఇంతవఱకును ద్రోహ

మొనర్చినవారందఱును మహమ్మదీయులే. ఈహిందువులే సుల్తానును వదలకయున్నారు. అక్కన్న మాదన్నలు సుల్తానును సమీపించిరి. ఆతఁడు పాదుషా రాయబారములోని ఈవాక్యములను వారికి వినిపింపలేదు. కాని ఆమహాత్ముని హృదయమును వారు గ్రహించిరి. వెంటనే తానాషా పాదములకు సాష్టాంగముగా మ్రొక్కి "మహాత్మా! మేము హిందువులము, బ్రాహ్మణోత్తములము, మాగురువులకు తప్ప నమస్కారము చేయము. తాము మహమ్మదీయులైనను భగవత్స్వరూపులు. మీవంటి వేదాంతియు పండితుఁడును మాయాంధ్ర దేశమును ఎన్నఁడును పాలించియుండఁడని తలంచుచున్నాము. మీగురువు గారు జగద్గురువులేగాని వేఱుగాదు. స్వామీ ఈదేహము నశ్వరము. దీనికై మాకు చింతలేదు. తమ సింహాసనమును రాజ్యమును కాపాడుటకు వీని నర్పించుచున్నాము. గ్రహింపుఁడు. మమ్ము పంపివేసిన మేము కాశికో లేక రామేశ్వరమునకో పోఁగలదము. లేదా మాప్రాణములనే గ్రహింపుఁడు." అని తానాషా హృదయము కరఁగునట్లు పలికిరి.

తానాషా తటాలున నేడువసాగెను. అంతటి సుల్తాను, అంతటి దొర, అంతటి వేదాంతి, పండితుఁడు సింహాసనమును వదలి, తన గాంభీర్యమంతయు అదృశ్యముకాఁగా ఆసోదరులను కౌఁగిలించుకొనెను. అబ్దుల్ రజాకులారీకూడ కన్నీరువదలెను. కూడనుండిన సర్దారులు పలువురు నేడ్చిరి. అక్కన్న మాదన్నలు ఏడ్చిరి. "వద్దు, వద్దు, అంతపనివద్దు. మీప్రాణం నా

ప్రాణం ఒకటే గాని వేరుకాదు. మేము ఏదైనా వదలుతాము గాని మిమ్ము మాత్రము వదలము. మీరు లేకపోతే మాకు ఈ సింహాసనమే వద్దు. ఇదంతా భగవంతునిచేష్ట.'' అని పలికెను ఎట్టికష్టమైనను రానిండు మంత్రులను స్నేహితులను వదలరాదని తానాషా నిశ్చయించుకొనెను. ఆపత్కాలమున ధైర్యము వహింపవలయుననియు, తాము క్రమముగా నుపాయము చేయగలమనియు సోదరులుపలికి సుల్తానును వీడ్కొనిరి.

మిన్ హాజ్ అత్తిమత్తరావులు మొగమొగములు చూచుకొనిరి. వారికిని దుఃఖము వచ్చినది. కాని అది వేఱు దుఃఖము. తమ పన్నాగములు నెఱవేఱుటకు బదులు వీరి స్నేహబంధము దృఢమగుచున్నదే యని వారి దుఃఖము.

## ప్రకరణము. ౧౬ – రామదాసు చరిత్రము.

అక్కన్న మాదన్నలు మంత్రులైన వెంటనే తమ బంధువుల కనేకులకు గొప్ప యుద్యోగము లిచ్చియుండిరిగదా. వానిలో గోపన్న తహసీలు ఒకటి. తొలుత నాతఁడు సాధారణమైన తహసీలుదారుగానే వచ్చెను. తనపనియందు చాల జాగరూకుఁడై ఏమాత్రము లెక్కలలో నెక్కువతక్కువ రాకుండ పాడిదప్పక తహసీలు చేయనారంభించెను. కాని త్వరలోనే ఈతనికి కబీరుదాసను భక్తుని సాంగత్యము కల్గెను. హిందూ మహమ్మదీయ మతాభిప్రాయములు మేళవించి వేదాంతము ప్రబలు దినములవి. రామరహీముగా దైవప్రార్థనలు సలుపు

కాలము. కబీరుదాసు గోపన్నకు రామమంత్ర ప్రభావముం
దెల్పెను. అది మొదలు రామదాసై గోపన్న నిరంతరము భజ
నలయందును భద్రాద్రి దేవుని సేవయందును తనకాలము పుచ్చు
చుండెను. భక్తి దినదిన ప్రవర్ధమానముకాఁగా దేవాలయమున
కైంకర్యములు చేయించెను. తన సొంతద్రవ్యము ఖర్చయి
పోఁగా నీతఁడు 'శ్రీరాముని నమ్మినవారికి ఆపదలు రావు' అని
భద్రాద్రిరామునికి నిత్యోత్సవములు చేయించుచుండఁగా
నాఱుసంవత్సరముల పైకము నిలువ యైనదని అక్కన్నగారికడ
నుండి దూత వచ్చి చెప్పెను. గోపన్న భక్తిపారవశ్యమున నా
పలుకుల నాలింపలేదు.

ఈలోపల రాజధానిలో చాలమార్పు లేర్పడినవి. అక్క
న్న మాదన్నల యధికారమునకు లోపము లేదుగాని వారికి
శత్రువు లేర్పడిరి. రెండుపర్యాయములు ఆశత్రువులు చాడీలు
చెప్పియు తానీషా వినలేదు. తామే వారిని చంపుటకు ప్రయ
త్నించియు ఫలింపలేదు. రామదాసుచర్యలు అత్తిమత్తషేక్
మిన్హాజులకు తెలిసినది. ఊరంతయు గందరగోళముగా
నుండుకాలమున తానాషాపేరిట గోపన్నను తర్కింపసాగిరి.
గోపన్నయు వారుపెట్టుబాధలను సహించెనేగాని మామలకు
చెప్పిపంపలేదు. ఆదుర్మార్గులు రహస్యముగా తమకు క్రింది
సర్దార్లచేత గోపన్నను చెఱలోనుంపించి క్రమముగా నొక
దినము తానాషా యండనుజేరి భద్రాచలము తాసిల్దారు
సర్కారుఖజానాకు పైకముపంపక భక్షించెనని పలికిరి. వెంటనే

దర్బారులో విచారణ జరిగెను. అది వాస్తవమే. మాదన్న ఏమియు బదులుచెప్పుటకు లేక ఆవిషయము ఈ దేశోపద్రవము లో తమకింకను తెలియరాలేదనియు ఎవరైననేమి న్యాయము ప్రకారము శిక్షింపవలెనని సభలో నుడివెను. ఆమాటయే చాలునని మిర్జహాజుపక్షమువారును అంతఃపురములోనివారు గోపన్నను తీవ్రముగ శిక్షింపవలసినదని తానాషాను పురి కొల్పుచుండిరి. తానాషా గోపన్నను పిలిపించెను. సంగతియం తయు విచారణచేసెను. ఆయన మహా రామభక్తుఁడని ఎఱిఁగి తనమంత్రులమీఁదనుండిన యనురాగముచే తత్క్షణమే క్షమించి భద్రాచలమునకే మర్యాదలతో పంపెను. ఈవిషయము తురు ష్కులలో ద్వేషమునకు హిందువులలో తానాషాపై నభిమా నమునకును కారణమాయెను పూర్వాచారములు మూఢ విశ్వాసములు గలయాదినములలో ఎట్టి స్వల్పవిషయమును గూర్చినైనను సులువుగా కథలు అల్లుకొనిపోవుటలో నాశ్చర్య ములేదు. శ్రీరాములవారే తానాషాకు దర్శన మనుగ్రహించి రామదాసుచెఱ విడిపించిరనియు, జనులు చెప్పుకొనసాగిరి. మఱికొందఱు తానాషాకు పూర్వజన్మవృత్తమును సయితము కల్పించిరి. ఆయన పూర్వజన్మమున నొక దొడ్డబ్రాహ్మణుఁ డనియు గంగాతీరమున నిత్యము స్నానముచేయుచు, శివునకు గంగోదకము నభిషేకముచేసిన దేవేంద్రపదవి కలుగునని చెప్పఁగా నట్లే కొంతకాలముచేసి, ఎన్నాళ్లకును శివుఁడు ప్రత్యక్షము కాలేదని విసిఁగి నీటికుండను శివలింగముపైఁ బడ

వేసెననియు నంతట శివుఁడు ప్రత్యక్షమై యాతని మ్లేచ్ఛుఁడ వై జనించి రాజవగుదువనియు నంతట భగవంతునిదయ గలుగుననియు వరమిచ్చెననియు నీజన్మమున తానాషా ఇంత వేదాంతిగా నుండుట కదే కారణమనియు పెక్కుకథలు బయలు దేరినవి. వాస్తవముగా తానాషా హిందువుల కంత ప్రియుఁడు గా నుండెను. వీనికెల్ల కారణము ఆతనిగురువు షారాజు కొత్తాల్ యొక్క యుపదేశమే.

## ప్రకరణము. ౧౭ - మంత్రుల దుర్మరణము.

ఈవిధముగా తానాషాయొక్క సంపూర్ణానురాగమును పొంది అక్కన్నమాదన్న లుండియు మహాలక్ష్మి నాడుచెప్పిన గడువు సమీపించుటచే గోపన్నతో సమానముగా కైంకర్య ములు చేయించుచు దిన మెదురుచూచుచుండిరి. 'దేవి కలలో కనఁబడి దాదాపు సంవత్సర మగుచున్నది. ఇది కడపటివారము. ఈవారము దాఁటులోపల మనపతనము నిశ్చయము' అని సోదరు లిరువురును తలంచుచు నొకదినము సాధారణముగ నెప్పటివలె నగరికిపోయిరి. ఉదయము పదునొకండుగంటలవఱకు సుల్తాను గోష్ఠియందు గడపిరి. ఏవేవోపనులు విచారించిరి. ఔరంగ జేబును తఱుమఁగొట్టుటకు ఉపాయము లాలోచించిరి. పదు నొకండుగంటలకు వెలికివచ్చి తమ బంగారుపల్లకిలో కూర్చుం డిరి; పల్లకీవారు రెండడుగులుపోయిరో లేదో అత్తిమత్తరా యని సిబ్బంది కనఁబడెను. రెండవదర్వాజా దాఁటుసరికి సిబ్బంది ఎక్కువయై మంతులు పల్లకీవారిని చావమోది తటాలున అక్కన్నమాదన్నలమీఁది కుఱికి వారితలలు ఖండించివేసిరి.

వారితోకూడ వచ్చుచుండిన వారిమేనల్లుఁడు రూస్తమురావు ఈదురంతముచూచి చేయునదిలేక ఒకరిదువ్వురతోపోరి ఇంటికి పోఁగా నాతని తఱుముకొనిపోయి ఇంటిలోనే కత్తితో పొడిచి చంపిరి. వారియింటిచుట్టును హిందువులును బ్రాహ్మణులును నివసించు పేటమీఁదనుఱికి వేయిమంది బ్రాహ్మణులను నఱికి వేసిరి. మంత్రుల భార్యలు తత్క్షణమే బావులలో దుమికి ప్రాణ త్యాగ మొనరించిరి. అక్కన్న కొమారుని మల్లన్నను ఆ దాది గుడ్డలలోచుట్టి ఎచ్చటికో ఊరివెలుపలికి కొనిపోయి ఒక మూరువాఁడు, తురక, మాదన్నభక్తుఁడుండ వానికడ వదలి భానుజీకడ చేర్పుమని పలికి తాను మరలివచ్చి తన యజ మానురాండ్రు దుమికిన బావిలోనే దుమికి మరణించెను. ఆ దినమును రాత్రియు లెక్కలేని హత్యలు జరిగినవి. మంత్రుల దేహములను వీధులవెంట లాగిరి.

అక్కన్న మాదన్నలు పడిపోఁగానే నౌకరులు సుల్తాను కడకు పరుగునపోయి ఏడ్చుచు 'సర్కార్, మర్గయా, సర్కార్ అక్కన్నా మర్గయా, మాదన్నా మర్గయా. జనానా సిబ్బంది వాళ్లమీద ఉఱికినారు సర్కారు. జంషీద్ వగైరాలుపోయి వాళ్లను పల్లకీనుండిలాగి కత్తితో నఱికి వాళ్లకు వీధిలో లాగి నారు సర్కార్' అని రొదచేయసాగిరి.

తానాషా సుల్తాన్ దిగ్భ్రమఁజెందెను. ఆతనికి నోట మాట రాలేదు. క్షణముండి 'హా!' అని యేడ్చుచు మూర్ఛ పడిపోయెను. వెంటనే నౌకరులు బానిసలును పన్నీరులు చల్లి

సేదదేర్చిరి. అబ్దుల్ రజాక్ మొదలైనవారు పరుగున చెంతకు వచ్చిరి. ఇంకనేమున్నది! మహామంత్రులు స్నేహితులు ఇట్టి ఘోరమరణము నందినా రన్న దుఃఖము సుల్తానునకు పొంగి పొంగి వచ్చుచుండెను. ఆతఁడు పిచ్చిపిచ్చిగా పలవింపసాగెను. ఎవరేమి చెప్పినను అది శాంతింపలేదు. 'అకే, మీరుపోయి ఖిల్లాదర్వాజా తెరచివేయండి. ఔరంగజేబుగాని మొగలాయీ వాళ్లెవరైనావచ్చి గోలకొండను స్వాధీనం చేసోమని చెప్పండి. ఇంక మాకు గోలకొండవద్దు ఏమీవద్దు. ఈరాజ్యం గీజ్యం మీరేతినండి. పాపాత్ములు ఈఆడవాళ్లు. మీరంతా నాశనమైపోయేకాలం వచ్చింది. గోలకొండ నాశమైపోయే కాలంవచ్చింది. మొగలాయీ మిమ్ము తునకలు తునకలుగా నఱుకుతారు! హా! అక్కన్న మాఅన్న. మాదన్న మాఅన్న, వాళ్లు పోయింతర్వాత మాకు ఎందుకూ ఈరాజ్యం, ఐశ్వర్యం?

అబ్దుల్ రజాక్ లాకీ "ధైర్యం తెచ్చుకోండి సర్కార్. హుజూర్ ఇట్లా ఉంటే మేమంతా ఎట్లా ఉండేది. మాకు ధైర్యం చెప్పవలసినవారు. ఇదంతా దేవుడి చేష్ట జహాపనా" అని ఏవేవో చెప్పుచుండెను.

సుల్తానుకు ఊరట కలుగలేదు. ఆయన వెంటనే తమ గురువును దర్శించెను. ఆస్వామి వేదాంతము తప్ప మఱియేమి చెప్పఁగలఁడు. తానాషా తన సర్దార్లతో మొగలాయీవారికి కోటను వదలివేయుఁడని ఆజ్ఞాపించుచునే యుండెనుగాని సర్దా ర్లెవరును కదలక నిలిచియుండిరి. తానాషా దుఃఖాతిరేకముచే

నిట్లనుచున్నాఁడని వారు మొగమొగంబులు చూచుకొనుచు మంత్రులమీఁద సుల్తానునకు ఇంతప్రేమ కలదని తమకు ఇంత వఱకు తెలియరాదాయెనని తమలో తాము చెప్పుకొనసాగిరి.

తానాషా మరల నారంభించెను. 'అక్కన్న మాదన్నలు మాకు ప్రాణం. వాళ్లే మాజీవం. ఈదేశానికి ఎంతపని చేసినారు! ఎంత మేధావులు! రాజ్యం విస్తరించినారు. ధనం చేర్చినారు. ఊరు కాపాడుతున్నారు. మహమ్మదీయులతో చాలా స్నేహం చేసినారు. మేమంటే ఎంతప్రియం వాళ్లకు. రాజ్యం వస్తుంది పోతుంది. అటువంటి స్నేహితులు వస్తారా? వాళ్లది ఎంత సమదృష్టి! హిందూ ముసల్మాన్ భేదం ఎక్కడా పెట్టుకోలేదు. మాకు వద్దండీ ఈతక్తు, ఈ ఐశ్వర్యం. మేం సన్న్యాసి అయిపోతాం. మక్కాకుపోతాము. కాశీ రామేశ్వరాలు తిరుగుతాము. తెరిచివేయండి, దర్వాజాలంతా తెరిచి వేయండి.' అని తానాషా మరల మరల పలుకుచుండెను. ఆ సందర్భమున సుల్తానుతో మాటలాడగలిగినవాఁ డెవఁడు? దర్వాజా తెఱచినయెడల మొగలాయీలు సర్వసంహారము చేయుదురు. ఖూనీచేయించినవారి యుద్దేశము అదికాదు. వారికి ఆమంత్రులు పోయి వేఱుమంత్రులు రావలయుననియు అట్లు చేసిన ఔరంగజేబు సంతోషించుననియు నభిప్రాయము.

అబ్దుల్ రజాక్ లారీ చాల జాలితో సుల్తానును చూచుచుండెను అతఁడుమాత్ర మేమిచేయగలఁడు? మొగలాయీలు భేదదండోపాయములలో చాల సమర్థులు. అందును వారి



**THE MURDER SCENE**
(From Havart)

Reproduced by kind permission of
The Govt. Epigraphist for India.

భేదోపాయము ద్రోహముతో కూడినది. వారితో తానాషా యొక్క అంతఃపురమందలి స్త్రీవర్గముచేరినది. వారికి రాజనీతి యేమి తెలియును. వారికి తెలిసినదంతయు కడుపుమంట తీర్చుకొనుట. పూర్వద్వేషములను మనసున నుంచుకొనియు, కొందఱు ద్రోహులతోచేరియు అక్కన్న మాదన్నలను చంపించి హిందువులను కడతేర్చిన ఔరంగజేబు సంతోషించునని తలంచిరి. మొగలాయీ పక్షపాతమవలంబించుటకు వారికిగల కారణ మీమాత్రమే. గొప్పసామ్రాజ్యమును ఈమంత్రులు కాపాడుచుండిరనియు వారిపతనముచేత నీసామ్రాజ్యము నశించుననియు నామూర్ఖురాండ్రకు తెలియదుగదా. మిగిలిన సర్దారులు కొందఱు ద్రోహులు. అక్కన్నమాదన్నలమీఁద వ్యక్తిద్వేషము గలవారు కొందఱు. మొగలాయీలు బలవంతులు గాన ఎట్లును గోలకొండ పడిపోయిన తమ యుద్యోగములకు లోటుండదని తలంచినవారు కొందఱు. అబ్దుల్ రజాక్ లారీ వీనిలో వేటిలోను చేరఁడు. ఆతఁడు బుద్ధిమంతుఁడును సమర్థుఁడును. అక్కన్నమాదన్నలు రాజభక్తులనియు దేశభక్తులనియు మహాసమర్థులనియు నాతఁడు ఎఱుఁగును. ఆతఁడో స్వయము రాజభక్తిసంపూర్ణుఁడు. వయస్సు చెల్లినవాఁడు. ఆతని చూపులో ఎంతభావముకలదో తెలియదుగాని చాల గొప్పవాఁడని మాత్రము తెలియుచుండెను. ఆతఁడు మెల్లగా తానాషా సమీపమునకువచ్చి మోకాలిపై నిలిచి నెమ్మదిగా 'జహాపనా' అనెను.

తానాషా అతనివైపు చూచెను. ఆచూపులో నాతఁడు మరల మనలోకమునకు వచ్చుచున్నాఁడని యనిపించుచుండెను 'జహాపనా' యను నా చల్లని పిలుపు ఆతని కెంతయో హృదయాహ్లాదకరముగా నుండెను.

మరల నాతఁడు 'జహాపనా' యనెను. 'అబ్దుల్ రజాక్ సాహెబ్, చెప్పండిభాయి' అని సుల్తాను ప్రియముగా పలికెను.

రజాక్,—"జహాపనా, దయచేసి తొందరపడవద్దు మనకు ఇంకా చాలాపని ఉన్నది గదా. మీరు మహావేదాంతులుగదా. ఎవరికీ కాలంరాకుండా వారు పోరు. ఎవరి నసీబ్ వారికి తప్పుతుందా? మంచి గొప్పమంత్రిలు ఘోరంగా చచ్చినారు. ఐనా పర్వాలేదు. మేం ఉన్నాం. ద్రోహులు ఒకరిద్దరు ఎక్డా ఉంటారు. వాళ్లపాపం వాళ్ల వెంటా ఉంటుంది. నేను మీనౌకరీ ఇన్నిదినాలు చేసినాను. మీకోసం కత్తి పట్టినాను. మీపేరుచెప్పి పోడుస్తున్నాను. నావంటివాళ్లు చచ్చిపోయే వఱకు, జహాపనా, మీరు దర్వాజా తెరవవద్దు. మాప్రాణాలు తీస్కాని మాశవాలమీద నడిచి శత్రివు లోపలికివస్తే మా ప్రాణం హాయిగా పోతుంది. నమ్మక్ తిన్నఋణం తీర్తుంది. హుజూర్ సెల్వాయిస్తే నేను కాపాడ్తాను ఖిల్లాను. నాప్రాణం మీద లోపలికి ఔరంగజేబు రానీండి. ఈ అనుగ్రహాము చేయండి సర్కార్, మీపాదాలుమీద కోర్తాను." అని చాల దీనముగాను పౌరుషముగాను వేడుకొనెను.

తానాషాహృదయము ద్రవించిపోయెను. అతనినోట మాటరాలేదు, కొన్నినిముసము లాతఁడు జడునివలె నుండెను. రజాక్ మరల నామాటలేపల్కెను. తానాషా ఇష్టములేని వానివలెనుండి మెల్లఁగా 'సరే. రజాక్ భాయి. మీా ఇష్టప్రకారం కానీండి. ఈఖిల్లాఅంతా మీాస్వాధీనం, ఎట్లాగుపోతాం. ఆపోయ్యేది మీామనసుప్రకారమే పోతాం. స్వల్పంలో మీా కెందుకు ఆయాసంచేయడం.' రజాక్ పరమానందమున సుల్తానుకు సలాముచేసి వెడలిపోయెను. దర్వాజాలు తెరవలేదుగదా యని యందఱును సంతోషించిరి.

రజాక్ సుల్తానును వదలి ఈవలికిరాఁగానే గోలకొండ మీాఁదికి మొగలాయీసైన్యము వచ్చుచున్నదని చారులువచ్చి నివేదించిరి. కాని పాదుషాసైన్యమువారు తాము సదుద్దేశముతో వచ్చుచుండునట్లు ప్రకటించియుండిరి. షాఆలముపంపిన సిఫారసుమీాఁద ఔరంగజేబు తానాషాకు బహుమతులు పంపెను. ఎట్లును అక్కన్నమాదన్నలు పోయినారు. తానాషా సంధిషరతులకు ఒప్పుకొనియుండెను. ధనము సంపాదించుటకు ఆలస్యమగుచుండెనేగాని తానాషా విరోధింపలేదు. పైగా పాదుషాకుమారుఁడు తానాషాను క్షమింపవలసినదనియు పాదుషాకు చెప్పిపంపియుండెను. ఇవెల్ల నాలోచించి చక్రవర్తి గోలకొండసుల్తానును మన్నించుమర్యాదగా నతనికి గొప్పదుస్తులు నగలు పంపెను. వీనిని కొనిపోవుపని పాదుషామీార్ హాషీం అనువానికే పెట్టెను. ఇందులో పాదుషా అభిప్రాయమేమి?

మీర్ హాషీం తానాషాసైన్యములోనుండి మొగలాయీల కడకు అంతకు కొన్ని నెలలక్రిందనే పాఱిపోయినవాఁడు. వీనిని పంపిన గోలకొండవారికి తప్పక కోపమువచ్చును. కాని రహస్యముగా పాదుషా ఈసాకుతోపోయి గోలకొండను స్వాధీనముచేసికొమ్మని హాషీముకు ఆజ్ఞయిచ్చియుండెననియు, గోలకొండవాఁడే కాఁబట్టి ఆతనికి లోగుట్టులన్నియు తెలిసియుండుననియు సంధికి వచ్చియున్నందున గోలకొండవారు కొంతకాలము యుద్ధప్రయత్నము మానియుందురనియు కొంద అనుకొనుచుండిరి. ఈవిషయము గోలకొండ చారులచెవిలో పడినది. దానినే వారు అబ్దుల్‌రజాక్‌తో చెప్పిరి.

అబ్దుల్‌రజాక్‌సాహెబు, షారెజ్‌ఖాను మొదలైనవారితో మొగలాయీవారిని ఢీకొనుటకు సంసిద్ధుఁడుగా నుండెను. మీర్ హాషీం అనువానివెంట నాతనికుమారుఁడు అబ్దుల్‌కరీం అనువాఁడు వచ్చుచుండెను. ఇంకను గొప్పసర్దారులు వచ్చుచుండిరి. రజాక్‌సాహేబు తనప్రయత్నములను చాలరహస్యముగా నుంచియుండెను. అబ్దుల్‌కరీమును మీర్‌హాషీమును గోలకొండకు ఇరువదిమైళ్లదూరమున మునగాలకడకు వచ్చిరి. వెంటనే రజాకుయొక్క యాజ్ఞచేత షేక్‌నైజాము అనుసర్దారును నాతని యధీనమందుండిన ఆఫ్ఘనుసైనికులును మొగలాయీలమీఁద నాకస్మికముగా దుమికిరి. వారిని ముట్టడించి పూర్తిగా దోచుకొనిరి. మీర్‌హాషీం ఈదెబ్బలో చనిపోయెను. అబ్దుల్‌కరీము బంధింపఁబడెను. ఆకస్మికయుద్ధము

గాన పాదుషాలుమకడనుండి సాయమువచ్చుటకు అవకాశము లేక పోయినది. ఇదంతయు 1685 సం. నవంబరు నెలలో జరిగినది.

ఈయుద్ధమునకు తానాషా చాలచింతించి మొగలాయీలను క్షమాపణప్రార్థించి, అబ్దుల్ కరీమును విడిపించి, దుర్మార్గులనుశిక్షించి దోపిడిపోయిన సొత్తుయొక్క విలువనంతయు తానిచ్చెనని కాఫీఖాన్ మొదలైనచరిత్రకారులు వ్రాసిరిగాని అట్టిదేదియు జరుగలేదని ఇతరగ్రంథములనుండి తెలియుచున్నది. కొందఱు చరిత్రకారులు ఆబహుమతులు పాదుషా తన కొమారుని కుద్దేశించెననియు కొందఱు అవి తానాషాకొఱకనియు వ్రాసియున్నారు. నిజము దేవునికెఱుక. కాని వెంటనేజరిగినదేమనఁగా మొగలాయీసైన్యము గోలకొండను వదలిపోయెను. ఇంతవఱకును మొగలాయీలు గోలకొండకు వెలుపలనుండి నానాబాధలు పడుచుండిరి. కోహీరులోనుండిన షా ఆలముయొక్క స్కంధావారములోని సిబ్బందికి అన్నము లేదు. గుఱ్ఱములకు ఉలవలుకాదుగదా గడ్డికూడ లేదు. సామానులు లాగు బండ్లయెడ్లకు నీళ్లేగతి. ఈస్థితిలో పాదుషా కుమారుని వెంటనే బయలుదేరి బిజాపూరును ముట్టడించుటకు తనకు సాయము రమ్మని ఆజ్ఞాపించెను. బిజాపురము సులభముగా మొగలాయీలకు లొంగునట్లు లేదు. అంతవఱకు షోలాపూరులో (సొన్నలికయగ్రహారము) నుండిన పాదుషా ఇప్పుడు స్వయముగానే బిజాపూరుముట్టడికి పూనుకొనెను. బిజాపూరును స్వాధీనముచేసికొనినతర్వాత గోలకొండమీఁదికి రావలయునని పాదుషాసంకల్పము.

## ప్రకరణము. ౧౮–బిజాపూరు ముట్టడి.

క్రీ. శ. 1686–వ సంవత్సరము ఔరంగజేబు అలంఘీరు పాదుషా ఆజ్ఞమీాఁద ముహమ్మదు ఆజామ్‌షా బిజాపూరును ముట్టడించెను. అతనికి సహాయముగా మహాయోధులు షా ఆలం, రుహుల్లాఖాన్, ఘాజుద్దీన్ ఖాన్ ఫిరోజుజంగు మొదలైన వారిని పాదుషా నియమించెను. ముట్టడి ప్రారంభమైనది. గొప్పసర్దారులు మొదలు సామాన్య సైనికులవఱకు అందఱు నడుములు బిగించుకొని కోటలెక్కుటకును, ఫిరంగులు కాల్చుటకును, పేటలు దోచుకొనుటకును, స్త్రీలను చెఱబట్టి హింసించుటకును, సొరంగములు త్రవ్వుటకును ప్రయత్నించుచుండిరి. కోటచుట్టును మొగలాయీలు రెండు కక్షులుగాచేరి రెండు వైపుల మంచెలులుకట్ట నారంభించి రెండునెలల పదిదినములకు అగడితవఱకునువచ్చి ఊరిని సంపూర్ణముగా నరికట్టిరి.

ముట్టడించునట్టి మొగలాయీ సర్దారులలో పాదుషా కుమారులు, ఒకరినిమించి యొకరు, కోటనుపట్టినకీర్తి తమకే రావలయునని కుట్రలుచేయుచుండిరి. పైగా నాసంవత్సరము క్షామమేర్పడెను. అందుచే ఆహారపదార్థములు దొరకవయ్యెను. కోటలోపలివారి బాధలు వీరికి పదింతలుగా నుండినవి. మొగలాయీలు బయటనున్నందున వారికి సరఫరాలు ఎచటి నుండియైనను రాగలవు గాని కోటలోనివారి కెట్లు రాగలవు? వారికి ఆలోపలనే సర్దుబాటు కావలసియుండెను. మొగలా

యీాలు కోటను పూర్తిగా ముట్టడింపఁగానే ఆ యవకాశ
మును పోయినది. లెక్కలేని జనమును గుఱ్ఱములును కోట
లోపల మరణించుచుండినవి. తమకు గుఱ్ఱములు తక్కువయై
నందున దక్కనీలు మొగలాయీాల సరపరాలను కొల్లగొట్ట
లేక పోయిరి.

ఇట్టి సందర్భములో బిజాపూరులోని మహమ్మదీయ
పండితులును వేదాంతులును ఔరంగజేబు పాదుషాను దర్శిం
చిరి. "నీవు మహమ్మదీయ మతాభిమానివి. న్యాయశాస్త్రము
చక్కగా నెఱుఁగుదువు. ఖొరానులో లేనిదానిని నీవు చేయవు.
శాస్త్రవేత్తల యభిప్రాయమును ఎప్పుడును అనుసరించెదవు.
ఇటువంటి గొప్ప ప్రభుసత్తముఁడవు నీవు నీసహోదర మహమ్మ
దీయులమైన మాతో నిట్లు యుద్ధముచేయుట న్యాయమా.
నీవే చెప్పుము" అని యందఱును అడిగిరి.

ఔరంగజేబు జవాబునకు తడవుకొనువాఁడుకాఁడుగదా.
వెంటనే ఇట్లనెను. "మీారు చెప్పినదానిలో ప్రతియక్షరమును
నిజము. నాకు మీారాజ్యము ఆక్కరలేదు. ఆపరమద్రోహి
యొక్క కొమారుఁడు మహాద్రోహి (శంభూజీ) మీావెనుకనే
యున్నాఁడు. వానికి మీారు స్థలమిచ్చినారు. ఇచ్చటినుండి ఢిల్లీ
వఱకును వాఁడు మహమ్మదీయులను బాధించుచున్నాఁడు. వారి
మొఱలు నాకు అనుక్షణమును చేరుచున్నవి. వానినిపట్టి నా
వశము చేయుఁడు. ఆతత్క్షణమే నేను ముట్టడిమాని పోయె
దను." ఆపండితులకు బదులు చెప్పుటకు తోచినదికాదు.

ఔరంగజేబు వచ్చిన కొలదికాలముననే సొరంగములు త్రవ్వుట మొదలైన పనులు అగడితవఱకును వచ్చినవి. కాని దానిని పూడ్చునట్టిపని అసాధ్యముగా నుండినది. అగడితకొనకు వచ్చినవారినందఱిని కోటమీఁద నుండువారు తుపాకులుపేల్చి చంపుచుండిరి. ఎవఁడును ఆచెంతకు పోవుటకు భయపడు చుండెను. మూఁడు నెలలకాలము ఆయఘాతమును పూడ్వ లేక మొగలాయీలు ఆలోచించుచుండిరి. అగడితలో మన్ను పోయువారికి గంపకు నాలుగణాలు ఇనాము అని పాదుషా ప్రకటించెను. ఈయాశచే వచ్చిన పలువురు కూలివాండ్రు తుపాకులమోత వినఁగానే పాఱిపోయిరి. తర్వాత గంపకు రూపాయయు తుదకు ఒక బంగారునాణెము (సవర) నిచ్చు నట్లు చాటింపఁగా సాహసికులు పలువురు ఆపనికి పూను కొనిరి. పైగా చనిపోయిన మనుష్యులను జంతువులను ఆ యఘాతముననే త్రోయుచుండిరి. కొందఱు పాపాత్ములు స్త్రీలను పురుషులను సయితము అందులోనికి త్రోసి డబ్బుఅడుగుచుం డిరి. వారికి సర్దారులు ఇచ్చుచును ఉండిరి. తుదకు ఎట్లో ప్రయాసపడి వానిని పూడ్చిరి. సొరంగములు ఇప్పుడు అగడి తకు ఆనుకొనియున్నవి. ఈపని పూర్తియైన వెంటనే పాదుషా రెండు మైళ్ల దూరములోనున్న తన గుడారమును సొరంగ ములు ప్రారంభమగుచోటికి మార్చుకొనెను. తర్వాత పూర్తిగ నాయుధములు ధరించి కవచ శిరస్త్రాణములు తొడుగుకొని సొరంగములలో నొకదాని ప్రవేశించి ఆప్రదేశమంతయు తనిఖీ

చేసెను. తర్వాత ఆమార్గముననే అగడితవఱకును పోయెను. అచ్చట మహోన్నతమైన కోటప్రాకారమును పగులగొట్టుటకు పెట్టియుండిన ఫిరంగులను తనిఖీచేసి ఏల యింకను పనివారు ప్రాలస్యము చేయుచున్నారని విచారణ చేయసాగెను. పాదుషా స్వయముగా వచ్చినందున ఉత్సాహభరితులై సర్దారులు తమ యెదుటనున్న కోటగోడను కూల్చుటకు బలమైన ప్రయత్నములుచేసి ఫిరంగులు కాల్చిరి. కాని నిష్ప్రయోజన మాయెను. కోటలోపలనుండినవారు పాదుషాపైనను సిబ్బంది మీఁదను కాల్చిన తుపాకులచేత మొగలాయీలకు చాల నష్టము కలిగెను.

తర్వాత నొక వారమున కంతయు బిజాపురముకోట పడిపోయినది. కాని మొగలాయీల ప్రతాపమునలన కాదు. మొగలాయీపాదుషాయొక్క దృఢసంకల్పమునకును ఆతఁడు చేయు ప్రయత్నమునకును కోటలోనివారికి ధైర్యముపోయి నది. బిజాపూరు సుల్తాను చదరంగములోని రాజువలె ఎత్తుల వారిచేతుల బొమ్మగానుండెను. లోపల పరస్పర ద్వేషముచేత పరిపాలనము పాడైయుండెను. బయటినుండి సహాయము వచ్చుట అసాధ్యము. భవిష్యత్తు అంధకారబంధురము. ఇట్టి పరిస్థితులలో బిజాపురి సర్దారులు ఎవరితోడకై యుద్ధము చేయవలయునో తెలియకయుండిరి. సికందరు ఆడిల్‌షా, తాను మంత్రులచేతి కీలుబొమ్మగా నుండుటకన్న ఔరంగజేబుకు స్వాధీనుఁడై భరణము గ్రహించుట యుక్తమని తలంచు స్థితి యేర్పడినది.

ఒకదినము సికందర్ ఆడిల్‌షాసుల్తాను తనమంత్రులతో నాలోచించి ఇఁక నీసర్వజనసంహారమును నిలుపుటకు తాను పాదుషాకు పాదాక్రాంతుఁడగుటకు నిశ్చయించుకొనెను. కోటలోని సిబ్బంది చాలవఱకు నాశముకాఁగా రెండువేలమంది మాత్రమే మిగిలియుండిరి. క్రీ. శ. 1686 వ సంవత్సరము, సెప్టెంబరు 12 వ తారీఖున బిజాపూరుయొక్క కడపటి సుల్తాను సికందర్ ఆడిల్‌షా తన పూర్వులసింహాసనమును పట్టణమును వదలి, మధ్యాహ్నము ఒంటిగంటకు కొందఱు మొగలాయీ యుద్యోగులతో ఔరంగజేబును దర్శించుటకు రసల్‌పూరు వైపుపోయెను. వీధులకు రెండు వైపులను పురజనులు బారులుదీరి నిలుచుండి ఏడ్చుచుండిరి. సికందర్‌షా తననగరిని కడసారి చూపు చూచుకొని బయలువెడలి రాఁగానే మొగలాయీవారు జయభేరి వాయింపసాగిరి.

ఈలోపల పాదుషా కొలువుతీరియున్న గూడారమును ఈయుత్సవముకై హెచ్చుగా శృంగారించిరి. పాదుషాయొక్క సామంతులు మన్సబ్దారులు మొదలైనవారందరు తమయాయుధముల నన్నిటిని ధరించి ఉజ్జ్వలవేషములతో వచ్చి వారి వారి స్థానములలో నిలిచిరి. పాదుషాయొక్క ప్రతీహారి భారామండ్ ఖానను వాఁడు పెత్తనము చేయుచు ఆగంతులకు వారి వారి స్థానములను చూపుచుండెను. గూడారద్వారము చెంతకు సికందరు రాఁగానే గొప్పయధికారులు కొంద ఱాతని పాదుషా చెంతకు తోడ్కొనిపోయిరి. పాపము సికందరుషా పాదుషా పాదములలో వ్రాలెను. ఆతని నవయావనమును సుందరాకార

మును రాచఠీవియు చూపరుల గుండెలను కరఁగించి అతనికై జాలిగొనునట్లు చేసినవి. పాదుషాకే ఆయువకుని చూచినంతట జాలికలిగెను. సికందరునుచూచి దయతో నిట్లనెను. 'భగవంతుఁడు నిన్ను కాపాడును గాక. నీవు బుద్ధిమంతుఁడవై తెలివిగా ప్రవర్తించినది నీమేలుకొఱకేగదా. నిన్ను నేను గొప్ప పదవియందుంచెదను. నీవేమియు భయపడవలదు. ధైర్యముగానుండుము.'' అని అతనిని తన మనుమని ప్రక్క కూర్చుండఁబెట్టుకొని గొప్ప దుస్తు బహుమతిగా నిచ్చి ఏఁబదివేల రూప్యములు వెలగలిగిన రత్నములుతాపిన బాకును, పచ్చరాల పతకముతోడి ముత్యాలహారమును పదుమూఁడువేల రూప్యముల వెలగలదానిని, రత్నములు తాపిన కత్తిని, వెల పొడుగు గదను ఇచ్చి సన్మానించి, ఖానను బిరుదముతో నొక మొగలాయీ సర్దారునిగాజేసి సంవత్సరమునకు లక్షరూపాయలు భరణ మేర్పాటుచేసెను. ఈమర్యాదయైనంతట సికందరును కొనిపోయి ఆతనికై ఏర్పాటుచేయఁబడియున్న గుడారములో ప్రవేశపెట్టిరి. బిజాపూరు సర్దారులందఱును మొగలాయీ సర్దారులైరి. పాదుషా యాజ్ఞపై మొగలాయీ అధికారులు బిజాపూరును స్వాధీనము చేసికొనిరి.

ఆతర్వాత ఒకవారమునకు పాదుషా బిజాపూరు ప్రవేశించెను. ఇంతకు పూర్వము కోటపడఁగొట్టుటకు ప్రయత్నము చేయుచుండిన చోట 'మంగలి దర్వాజా'గుండ కోటచొచ్చెను. వీధులలో పొవునప్పుడు రెండుచేతులతో నాణెములు వెదజల్లుచు

ఆకోటగోడలను కట్టడములను చూచుచు పోయెను. తర్వాత జమ్మమసీదులో భగవంతునిగూర్చి నమాజ్ చేసెను. తనకు జయమిచ్చినందులకు దేవుని స్తుతించెను. సికందర్ షా యొక్క నగరిలో కొన్ని గంటలు విశ్రమించెను. అచటికి ఆతని సర్దారులు పలువురు వచ్చి అతని విజయమునకై ప్రశంసించిరి. ఆ నగరిలో గోడలమీఁద నానావిధములైన చిత్రము లుండినవి. అవన్నియు ఖొరాను ధర్మమునకు విరుద్ధములనియు పరమాత్మతో మనుష్యుఁడు పోటీచేయరాదనియు మానవుల చిత్రములు ఎంతమాత్రము పనికిరావని వానినెల్ల తుడిపించెను. చాల మనోహరములైన చిత్రములు పాడైపోయినవి. పాదుషా యొక్క దిగ్విజయమును సూచించుచు మాలిక్-ఇ-మైదాన్ అను ఫిరంగిపై శాసనము చెక్కఁబడినది. సాయంకాలమునకు తుపాకులు పేల్చి బాణసంచా కావించి పాదుషా తన స్కంధావారమునకు మరలివచ్చెను. పాదుషా తాను లోనప్రవేశించిన మంగలి దర్వాజాకు ఆపేరు తొలగించి ఫత్ దర్వాజా అనఁగా విజయద్వారమని మరల నామకరణ మొనరించెను.

బిజాపూరు కళావిహీనమయిపోయెను. స్వతంత్ర రాజవంశము పోయినది; రాజప్రతినిధియొక్క పరిపాలనము ప్రారంభమైనది. ధనాదాయమంతయు ఢిల్లీకి పోసాగినది. సంగీతసాహిత్యాది లలితకళలను లాలించువారు లేరు. ఆస్థానము అధ్వాన్నమాయెను. కవి పండిత గాయక చిత్రకార గణికాదుల మొగములను జూచువారు లేరు. ఆతర్వాత రెండుసంవత్సరము

లకు ప్లేగువ్యాధి బయలుదేరి దాదాఁపు సగము జనమును తిని వేసినది. ఊరంతయు పాడుపడినట్లయినది. ఏకారణముచేతనో ఎప్పుడును సమృద్ధిగానుండు బావులుకూడ ఎండిపోయినవి. ఊరిలో గొప్పగోరీలు అలంకరణలవలెనుండుచు బిజాపురమునకు ఎప్పుడును ప్రత్యేకశోభను కూర్చెడివి. ఇప్పుడు ఆగోరీలే ఆయూరిని శ్మశానమువలె చేసినవి. ఎంతదూరముపోయినను పడిపోయిన భవనములు, గొప్పబురుజులు, మసీదులు, నిర్మానుష్యమైన వీధులు, అచ్చటచ్చట వీధులలోనే మహావృక్షములు మొలచి వీనిని చూచుకొనువారు పోయిరని చెప్పునట్లుండినవి. పెక్కుసౌధములమీఁద సయితము చెట్లు మొలచియుండినవి. పక్షులగూండ్లును వానియఱుపులును, గబ్బిలముల కంపును తప్ప ఆపాడుపడిన ఇండ్లలో విశేషములు లేవు.

పాదుషాకు పాదాక్రాంతుఁడైన సికందర్ ఆడిల్‌షా ఏమియు సుఖపడలేదు. కొంతకాలము పాదుషాతో నూరేఁగిన యనంతరము, అతఁడు తనరాజ్యములోని కృష్ణకుత్తురభాగము తనకు సామంతరాజ్యముగా ప్రసాదింపుమని ఎంత ప్రార్థించినను వినక పాదుషా సికందరును చల్లగా దౌలతాబాదులోని చెఱసాలకు పంపెను. ఆగిరిదుర్గములో నాతఁడు తన జీవితశేషము నంతయు నిట్టూర్చుచు గడపెను. (ఈతని నేకాకిగా పాదుషా వదలలేదు. ఇతనికి తోడుగా అబుల్‌హసన్ తానాషాసైతము అచ్చటనే తన ఆయుశ్శేషమును గడపెను.) కొంతకాలము బందిలోనున్న తర్వాత మరల పాదుషా తనకడకు పిలిపించి

తనవెంట ఖైదుల గుడారములో నుంచి కూడ కొనిపోవు చుండెను. ఇట్టి పరిస్థితిలో సికందర్ ఆడిల్‌షా క్రీ. శ. 1700 సంవత్సరమున ఏప్రిలు 3 వ తారీఖున తన ముప్పదిరెం డవ సంవత్సరమున చనిపోయెను. పదునాలుగేండ్ల వయసున సింహాసన మారోహించి మంత్రుల చేతి కీలుబొమ్మగా కొన్ని సంవత్సరములుండి తర్వాత పదునాలుగేండ్లు ఔరంగజేబు యొక్క ఖైదిగానుండి ఈ సంసారబంధమును సికందరు వదలెను.

ప్రాణములు పోవుటకు మునుపు ఆతఁడు కోరినట్లే శవ మును తెచ్చి బిజాపూరులో నాతని గురువు షేక్ ఫహీముల్లా అను స్వాములవారి సమాధిప్రక్క, పైన పెంకులుగాని మిద్దె గాని ఏమియులేనిచోట, పాతిపెట్టి గోరీకట్టిరి. తమ కడపటి సుల్తానుయొక్క శవము ఊరిలోనికి రాఁగానే వేలకొలఁది జనులు పోయిచూచి ఏడ్చిరి. పెక్కుస్త్రీలు తమభర్తలే మరణించిన నెట్లో అట్లు ఏడ్చి గాజులు పగులగొట్టుకొని అంగలార్చిరి. పాపము వారేమి చేయగలరు! పదునాలుగేండ్లుగా వారికి సుల్తాను లేఁడు. ఆతఁడుండినప్పుడును పాలించి యెఱుఁగడు. కాని తమకు సుల్తానని యొకడుండెనుగదా యను స్వాతంత్ర్య భావముకూడ పోయినది. తాము కేవలము బానిసలై పాదుషా ప్రీతికి తగినట్లు మెలఁగవలయునుగదా యని బిజాపూరువారు ఆక్రందించిరి.

## ౧౯ ప్రకరణము. ౧౯ – మొగలురాయబారి సాదత్ ఖాను.

బిజాపూరునకు పట్టినగతియే గోలకొండకును పట్టినది. ఆకర్కశహృదయుఁడైన పాదుషాకు దయాదాక్షిణ్యములు లేవు. 1686 వ సంవత్సరము డిసెంబరులో నాతఁడు బిజాపురమును వదలెను. వెంటనే గుల్బర్గాలో హజరత్ సయ్యద్ బందేనవాజ్ మహమద్ గైజుదరజ్ అను స్వాములవారి సమాధికి మ్రొక్కుటకు బయలుదేరెను. ఈతని మునిమనుమని శిష్యుఁడే గదా తానాషా. పాదుషా బయలుదేరుచునే తానాషాకును, గోలకొండలోని తన క్రొత్తరాయబారి సాదత్ ఖాఁ అను హాజీబునకును, తనకు తానాషా అప్పుపడియున్న పేష్కస్సు తత్క్షణమే చెల్లింపవలసినదని ఫర్మానా వ్రాసెను. ఫర్మానా తెచ్చువారిచేత రహస్యముగా నొక జాబు వ్రాసి యిచ్చెను. "మనము హైదరాబాదును జయించుటకు ప్రయత్నింపవలెను. త్వరలోనే మావిజయపతాకలు అచ్చటికి రాగలవు. ఇంతలోపల నీవు తానాషాను గుంజి సాధ్యమైనంత ధనమును లాగి నీయుద్యోగధర్మమును నిర్వహింపవలెను."

సాదత్ ఖాను పాదుషా ఆజ్ఞను ప్రతి యక్షరమును నిర్వహించెను. తానాషాతో నాతఁడు అబద్ధములు చెప్పసాగెను. పాదుషా తానాషాపై సదభిప్రాయము గలిగియున్నాఁడనియు తన కారుణ్యమంతయు చూపఁగలఁడనియు చాలమర్యాదచేయఁగలఁడనియు తానాషాతో చెప్పుచుండెను. తానాషా కడనుండి

ధనమును వస్తువులను గుంజుటకు నక్షత్రకుల నేర్పాటు గావించెను. పాదుషా కోర్కెలు వర్ణనాతీతములు. కాని ఆసమయమున తానాషాకడ పేష్కస్సంతయు నిచ్చివేయుటకు తగిన ధనములేదు. అతఁడు తన మంత్రులతో నాలోచించి ఇట్లు సాదత్ ఖానుకు చెప్పి పంపెను. "ఈదుర్భిక్షములో ధనము సంపాదించుట చాల కష్టముగా నున్నది. అందుచేత నేను నా వాగ్దానమును నెఱవేర్చుకొనుటకై డబ్బుగాగాక వస్తువులుగా సమర్పింపఁదలఁచితిని. రత్నాలు, ఆభరణములు, బంగారము, వెండి మొదలైనవి పంపగలను. ఇవి మీకు సమ్మతమైనయెడల మీఖ్వాజాసరాను మాకడకు పంపుఁడు. ఆవస్తువులను మేము ముట్టఁజెప్పఁగలము."

సాదత్ ఖాను ఇందులకు ఒప్పుకొనలేదు; ఖ్వాజాసరాను పంపనులేదు. కొన్నిదినములు ఉత్తర ప్రత్యుత్తరములు జరిగినవి. గుల్బర్గానుండి పాదుషా గోలకొండకు బయలుదేరివచ్చుచున్నాఁడని తెలియఁగానే తానాషా తానే సాదత్ ఖాను యొక్క సేవకులను పిలిచి తాను పంపఁదలంచుకొనియుండిన యావెలగల వస్తువులనన్నిటిని పెట్టెలలోపెట్టి, వానికి జాపితాలువ్రాసి, తన మొహరుంగరముతో ముద్రవేసికట్టి వానిని తాకట్టుగా నుంచుకొమ్మని పంపెను. పైగా తనకు ఎంతపైకము వసూలగునో దానిని రెండు మూఁడు దినములలో పంపి మిగిలిన పైకమునకు తానిచ్చిన నగలకు ఖిమ్మత్తుకట్టి వానిలోనుండి ఇచ్చునట్లు ఖరారుచేసెను. ఈనగలకు సాదత్ ఖాన్ తన

మొహరువేసిన రసీదును పాదుషాకుపంపి ఆయనకు తానాషా యొక్క సదుద్దేశములను తెలిపి మన్నన ప్రార్థింపవలసినదని కోరెను. ఇదంతయు తత్క్షణమే పాదుషాకు తెలుపవలసినదని వేఁడెను. తర్వాత తానాషా కొన్ని గంపలలో గొప్పపండ్లను ఏరి పాదుషాకు పంపెను. సాదత్ ఖాను తానును పాదుషాకు కొన్ని పండ్లగంపలు పంపెను.

రెండుదినములు గడచినవి. పాదుషాకడనుండి రాయబారిగాని వర్తమానముగాని లేదు సరిగదా పాదుషా గొప్ప సైన్యముతో గోలకొండమీఁదికి వచ్చుచున్నాఁడని తెలిసిపోయినది. తానాషా ఆశ్చర్యపడెను. ఇదంతయు మొగలాయీ వారి కపట ప్రయోగముగా నాతఁడు భావించెను. తత్క్షణమే ఆతఁడు సాదత్ ఖానునకు ఈవిధముగా వ్రాసెను. "నగలు రత్నములు పంపుటలో నాయుద్దేశము నాగౌరవమును కాపాడుకొనుటయు క్షమకోరుటయేగాని వేఱుగాదు. పాదుషాయొక్క సైన్యము యుద్ధమునకు సిద్ధముగా నీవైపేవచ్చుట చూడఁగా నాయుద్దేశము పూర్తిగా విఫలమైనట్లే యున్నది. పాదుషాకడ నుండి మాకెట్టి మన్ననయు రాదని స్పష్టమైనది. అందుచేత నేను నీయొద్ద తాకట్టుగా నిచ్చిన వస్తువులను నీవు తత్క్షణమే నాకు వాపసుచేయవలసినది" అని.

సాదత్ ఖాను ఇట్లు జవాబువ్రాసెను. "నాకుకూడ అటువంటి వృత్తాంతమే వచ్చినది. త్వరలోనే పాదుషావారి విజయ ధ్వజము ఇచ్చటికి వచ్చి చేరుననుట నిశ్చయము? పాదుషా

కొఱకు మీరు నిర్దేశించిన నగలు రత్నములు మొదలైన వానిని ఆపండ్లతోకూడ నేను పాదుషావారికి పంపివేసి నా ధర్మమును నెఱవేర్చుకొంటిని. ఇప్పుడు ఆవస్తువులకు బదులు నాతలయు ప్రాణములు పాదుషావారి పేరుచెప్పి బలివేయవలసినదే.''

ఈజవాబు వినఁగానే తానాషాకు కోపము వచ్చినది. తత్క్షణమే సాదత్ ఖానుని ఇంటి చుట్టును ముట్టడివేయించెను. సాదత్ ఖాను చాలనేర్పరి. సమయోచితముగ సంచరించువాఁడు. అతఁడు మరల నీవార్తను తానాషాకు పంపెను. ''ఈ విషయములో మీరు బహుశః న్యాయముగానే ప్రవర్తించుచున్నారని యనుకొనెదను. కాని నేను పాదుషాగారిమీఁది భక్తి గౌరములచేతను వారి మేలుకోరుటచేతను తత్క్షణమే ఆ వస్తువులను పంపివేసితిని. మఱి నాకడ వేఱేమియు మిగులనందువలన నారాజభక్తికిని కార్యనిర్వాహణమునకును నన్ను చిత్రవధ చేయించుకొనుట తప్ప వేరేమియు కానరాదు. కాని నాచావువలన మిమ్ముకొట్టి శిక్షించుటకు పాదుషాగారికి మఱియొక కారణము దొరకినట్లగును. మిమ్ము క్షమించుటకొఱకు ఇప్పుడున్న ఈయాశాత్రణము సైతము అప్పుడు మాయమగును. లేక నన్ను వదలినచో పాదుషావారి క్షమ సాధించుటకు కొంత వీలగును. నాప్రాణముండునంతవఱకును మీరు భద్రముగ నుండు నుపాయమును వెదకుట నాపని.''

తానాషా ఈవిషయమై ఆలోచించెను తుదకు అతనిని క్షమించి వదలిపెట్టుటయే మంచిదని తలంచెను. సాదత్ ఖానును అవమానపఱచుటకన్న నాతని గౌరవపఱచుట మేలని తలంచి పిలిపించి, గౌరవించి, పొగడి అతనికి వస్త్రములు ఉడుపులు ఆభరణములును ఇచ్చిపంపెను.

ఔరంగజేబు బిజాపురమునువదలి గోలకొండవైపు వచ్చుచు మార్గమధ్యమున సయ్యద్ ముహమ్మద్ ఘయజ్ దరజ్ యొక్క సమాధికడ నిలిచి ఆసన్న్యాసి గోరికి మ్రొక్కి ఇరువదివేల రూప్యములు అచ్చటి భక్తులకును సన్న్యాసులకును పంచియిచ్చెను. భగవధ్ధ్యానములు పారాయణములు మొదలైనవి జరిపి అచటినుండి తానాషాను జయించుటకు బయలుదేరెను.

ఈసమాచారము తెలియఁగానే తానాషా కలఁతనందెను. సందర్భములు నానాటికిని విషమముగా పరిణమించు చుండినవి. తత్క్షణమే తానాషా సమర్థుఁడైన వాచాలకు నొకనిని రాయబారిగా పంపుచు తానొక జాబు పాదుషాకు వ్రాసి తాను చేసినదంతయు నపరాధమేయని యొప్పుకొనుచు క్షమాపణగోరెను. అపరాధ మెంతయైనను చెల్లించుటకు ఒప్పుకొనెను; రాయబారివెంట చాల నజరులు పంపెను. ఈప్రార్థనకంతయు జవాబు పాదుషాయొక్క సైనికుల అసిధారలే. పాదుషాకడ నుండి సాదత్ ఖానుకు వచ్చిన యొక ఫర్మానాలో తానాషాపై పెక్కు నిందారోపణము లుండినవి.

"ఈదురదృష్టవంతుఁడు హ్రస్వదృష్టి. వీఁడు చేసిన దురంతములు లెక్కలేనివి. అందులో కొన్ని ఇవి—

(1) వీఁడు తన రాజ్యాధికారమునంతయు కుటిలాత్మకుఁడైన మతహీనుని స్వాధీనమందుంచెను. సయ్యదులు సన్యాసులు మొదలైన మహమ్మదీయ మహాత్ములనందఱను వానికి క్రిందనుంచెను.

(2) ప్రత్యక్షముగా నానాదుర్మార్గములకు తావిచ్చెను.

(3) తాను నిరంతరము పాపకార్యము లొనర్చుచు సదా సారాయము సేవించుటలోనే మునిఁగియున్నాఁడు.

(4) ఇస్లామునకును మతద్రోహమునకును ఏమాత్రము భేదము చూపఁడు. న్యాయాన్యాయములు పూజాతిరస్కారములు బాగోగులు ఇతనికన్నియు నొకటే.

(5) ఆతుచ్ఛునికి శంభువునకు సాయముచేయుటకు ఏమాత్రము వెనుదీయలేదు. ఇందుచే ఇహపరములకు కాకపోయినాఁడు, మతద్రోహులకు సాయముచేయరాదని ఖొరానులో లేదా?

(6) లెక్కలేని ఫర్మానాలలో మేము చెప్పిన విషయములనుగాని వానితో పంపిన పెద్దమనుష్యుల వాక్యములనుగాని సరకుచేయలేదు.

(7) పైగా నీమధ్యనే ఈతఁడు ఆశంభువునకు ఒకలక్షహొన్నులు సహాయము చేసియున్నాఁడు.

(8) ఇప్పుడతఁడు తనగర్వాంధతచేత నేర్పడిన విఫల మార్గములో పోవుచున్నాఁడు. తన కేదో ఇహపరములలో మోక్షము కలదని భ్రమపడుచున్నాఁడు.

ఆవెనుక నీ క్రిందిభావముగల పద్యభాగమును పాదుషా ఉదాహరించెను. "ఈయాశ ఎంత వ్యర్థము, ఈతలంపు ఎంత తెలివితక్కువ."

## ప్రకరణము. ౧౫—గోలకొండముట్టడి ప్రారంభము.

తానాషా ఆస లుడిగెను. తనకు ఇఁక పాదుషాకడనుండి ఎట్టి మోక్షమును లేదు. ఆతఁడు క్షమింపఁడు. ఇఁకను ఆత్మ రక్షణ వ్యూహము పన్నవలసినదే. శత్రువులను తఱుమఁగొట్టుట కాతఁడు సేనను ఆయత్తపఱుప నారంభించెను. తానాషా కొలువులో షేక్ మిన్హాజ్, షారెజ్ ఖాన్, ముస్తఫాఖాన్ అను నామాంతరము వహించిన అబ్దుర్ రజాక్ లారీయును మఱికొందఱు మహాసాహసికులు నుండిరి. తానాషా వీరిని గొప్పదండిచ్చి పాదుషామీఁదికి పంపుచు నిట్లు చెప్పెను. "మా సేనాపతులారా, మీరు పాదుషాను జయించిన పక్షమున సాధ్యమైన వఱకు నతని ప్రాణములతో పట్టుకొని చాలమర్యాదలతో మా కడకు తెండు."

ఆఫౌజుదారులు జవాబు పలికిరి—"జహాపనా, అలంఘీరుయొక్క దగ్ధహస్తమును చూడఁగానే మాహృదయములు దహించిపోవును, అతఁడు కావించిన వినాశమును తలఁచుకొన్న

ప్పుడు మా హృదయపుటములు ఆఘోరముల తలంపుచేత మలమల మాడిపోవుచున్నవి. అతనిని మేము పట్టుకొనినచో ఆతనియందు మాకెట్టి గౌరవము నుండుట కవకాశములేదు.”

గోలకొండ కుతుబుషాహి సైన్యములు రెండు ప్రయాణముల దూరమువచ్చి మొగలాయీ సేనలను తాఁకినవి. ఇంతలో నొక సమాచారము వచ్చినది. పాదుషా ఆజ్ఞపై ఖ్వాజు ద్దీఌ ఖాఌ బహదూర్ ఫిరోజ్ జంగ్ అనువాఁడు బిజాపూరు పడిపోయిన వెనుక ఇబ్రహీంఘర్ కోటను పట్టుటకు పోయియుండెను. ఇప్పుడు ఆతఁ డాకోటను పట్టుకొని వెంటనే మొగలాయీలతో చేరినవార్త గోలకొండవారికి వచ్చెను. ఈసేనాపతులకు కొంతభయమైనది. ఇంతలో 1687 సం॥ ఫిబ్రవరినెల గోలకొండకు ఒక క్రోసుదూరమున, కలరాస్ అనుచోట, ఢిల్లీవారిసైన్యములు విడిసినవి. పాదుషా ఆజ్ఞమీఁద సేనాపతులకు మోర్చాలు ఫిరంగిగుండ్లు మొదలైనవి పంచిపెట్టఁబడినవి. గోలకొండకోటకు ఆధారమైన వాని నన్నిటిని నాశముచేయుటకు ముట్టడిపరికరములను సేకరించుటకును ఉత్తరువాయెను.

ఈలోపల తానాషాయొక్క సైన్యము మొగలాయీవారిని చుట్టవేసికొని యుద్ధముచేయ నారంభించెను. గోలకొండవారు బాణములు ప్రయోగించిరి, ఫిరంగులను కాల్చిరి ఒకపగలంతయు ఘోరయుద్ధ మాయెను. యోధులు ఇరువాగులయందును తమ పరాక్రమములను చూపిరి. అనేకులకు గాయములు తగిలినవి. కొందఱు మరణించిరి. షాఆలంయొక్క

అధికారులలో ఇరువురకు బలమైన గాయములు తగిలినవి. ఈ సందర్భమున నేకారణముననో గోలకొండవారు యుద్ధభూమిని వదలివచ్చిరి.

గోలకొండ ముట్టడి ప్రారంభమైనది. మోర్చాలను అచ్చటచ్చట నిలుపునప్పటికి ఫిరోజుజంగు యుద్ధరంగమునకు వచ్చి చేరెను. మొగలాయీలు సొరంగములు మొదలైనవి త్రవ్వుటకును అవి పైన కనఁబడకుండుటకు పందిళ్లను కట్టుటకు నాజ్ఞయాయెను. సముద్రతరంగములవలె పొంగుచు వచ్చుచుండిన సైన్యము కొట్టుటకు ప్రారంభించెను. ముట్టడి ప్రయత్నములు జరుగుచుండఁగా గోలకొండవారు ఎదిరించుచు అనుదినము అటనట యుద్ధములు చేయుచునే యుండిరి. ఒకదినము గోలకొండ కోట ప్రాకారమునకు ముందు కాపుండిన సైన్యమును ఎదిర్చి చంపవలసినదని ఆజ్ఞకాఁగానే కులిజ్ ఖాన్ బహదూర్ అనునతఁడు, ఘాజుద్దీన్ ఖాన్ బహదూర్ ఫిరోజుజంగుయొక్క తండ్రి, పాదుషామీఁది భక్తిపారవశ్యముచేత వీరావేశముతో శత్రువుల నెదుర్కొని కోటగోడలవఱకును పోయెను. అప్పుడు విధివిలాసముచేత కోటగోడలనుండి ఒక ఫిరంగిగుండు ఆతని భుజమునకు తగిలి ఒకచేయి తెగిపోయినది. అంతట నతఁడు వెనుకకు తిరిగి గుఱ్ఱముమీఁద స్వారిచేయుచునే ఏమాత్రము బాధపడక తన సైన్యమును చేరుకొనెను. పాదుషా ఆతనికి వైద్యము చేయుటకు ఉమాదుత్ ముల్క్ ఆసద్ ఖాన్ అనువానిని చాల హెచ్చరికతో పంపెను. ఆతఁడు వచ్చునప్పటికి ఇతర వైద్యులు

కులిజ్ ఖాఁ భుజమునుండి తునుకలైన ఎముకలను వెలికితీయు చుండిరి. ఆమహావీరుఁడు శాంతుఁడుగా కూర్చుండియుండెను; తన ప్రక్కనుండువారితో మాటలాడుచు, రెండవచేతితో కాఫీత్రాగుచు పాదుషా తనకడకు మంచి వైద్యుని పంపెనని చెప్పుచు ఈషత్తయినను బాధలేకయుండెను. కాని ఎంత జాగ్రతగా వైద్యము చేసినను లాభములేకపోఁగా నాతఁడు మూఁడవదినము మరణించెను.

కోటనుపట్టుటకు ఏర్పాటుచేయఁబడిన మోర్చాలవారు దినదినము కోటవైపు వచ్చుచుండిరి. ఒకదినము ఫిరోజుజంగు మోర్చాలవారిని ముందు నడుపుచుండఁగా గోలకొండ సైన్యము వెంటఁబెట్టుకొని అబ్దుల్‌రజాక్‌లారీ మహావేశముతో మొగలాయీవారిని ఎదుర్కొనెను. మొగలాయీ సైన్యములో ననేకులు రాజపుత్రులుండిరి. వారిలో పెక్కుమందిని చంపి, కిషోర్‌సింగ్‌హాదా యనువానిని గోలకొండవారు గాయపఱచి ఖయిదుపట్టుకొని పోనుండఁగా మొగలాయీలు ప్రయత్నముతో తప్పించిరి. గోలకొండవారును చాలమంది చనిపోయిరి. కాని దక్కనీలు చూపిన పరాక్రమమునకు మొగలాయీలు భయపడిరి. పాదుషాసైన్యమువారు తమలో చనిపోయినవారిని ఎత్తుకొనిపోవుటయే చాల కష్టముగా నుండెను. ఎంతధైర్యముతో ప్రయత్నించినను సాధ్యముకాలేదు. దాక్షిణాత్యులు తమవారి శవములనేగాక ఢిల్లీవారివికూడ తీసికొనిపోయిరి. తుదకు పర్షియను, తురానీ సైన్యములువచ్చి రంగ

మును ప్రవేశించినవి. అత్తర్వాత అబ్దుల్ రజాక్ యొక్క సైన్య
ము నాటికి విశ్రమించినది.

ఆదినము మొదలు మరల నట్టి యుద్ధములు జరుగలేదు.
కారణము కలదు. పాదుషా దూతలనుపంపి షేకుమిర్ హాజ్
షేక్ నైజామ్ అను నిరువురను, గోలకొండ సేనాపతులను,
లంచములిచ్చి స్వాధీనము చేసికొనసాగెను. వారు తానాషా
చేసిన ఉపకారములను మఱచిపోయి మొగలాయీవారితో
చేరిరి. తత్క్షణమే ఔరంగజేబు వారికి మర్యాదచేసి మహమ్మద్
ఇబ్రహీమును ఏడువేల సైన్యమునకు మన్సబ్దారుగాచేసి, ఆరు
వేలస్వారులు జీతమిచ్చి పైగా అతనికి మహబత్ ఖాన్ అను
బిరుదిచ్చెను. షేకున్నైజామును ఆఱువేల సైన్యమునకు అధి
పతిగా చేసి, ఐదువేలస్వారుల వేతనమునంది తకరబ్ ఖాన్ అను
బిరుదమునందెను. ఈ ఇరువురును కోటపట్టుటలో శత్రువునకు
చాల సాయముచేసిరి. అందులో ముహమ్మద్ ఇబ్రహీము
చాల ప్రయత్నము చేయసాగెను. తానాషాయొక్క సామం
తులలో తుదవఱకు రాజభక్తిని ప్రకటించి కోట శత్రువునకు
స్వాధీనమైనదినము సైతము పోరాడిన వీరుడు అబ్దుర్ రజాక్
లారీ యొకడే.

ముట్టడి చాలకాలము జరిగినది. కోటలోపల కొంత
తుపాకిమందును ఆయుధసామగ్రులు నుండినవి. వీనితో మొగ
లాయీలమీదికి గోలకొండవారు తలుపుసందులనుండియు,
బురుజులనుండియు, గోడలమాటులనుండియు ఫిరంగులను తుపా

కులను కాల్చుచు బాణములు ప్రయోగించుచు నుండిరి. వీని ప్రయోగములచేత ఆకాశమంతయు పొగగ్రమ్మి పగలు రాత్రి యను భేదము పోయినది. అంతయు చీకటిమైనది. ప్రతిదినమును ఢిల్లీవారి సైన్యము మహాపరాక్రమమునుచూపి పోరాడుచునేయుండిరి. అనేకులు చనిపోవుచుండిరి. కొందఱు పాదుషాను మెప్పించుటకును ఆతనిమీఁది తమభక్తిని ప్రకటించుటకును సంవత్సరపుపని ఒకనెలలోను నెలపని ఒకదినములోను చేయుచు సొరంగములు త్రవ్వుచు యంత్రములు నిర్మించుచు కోటలో ప్రవేశించుటకు మార్గములు వెదకుచు కష్టపడి ఎట్లెట్లో ప్రాణములకు తెగించి అగడితను సమీపించిరి. తర్వాత అగడితను మట్టితో పూడ్చుటకు పాదుషా అనుజ్ఞనొసంగెను. పాదుషా తానే స్వయముగా నొక గోనెసంచిలో మట్టిపోసి కుట్టి అఖాతములో వేసెను. సైన్యమంతయు పాదుషాను అనుకరింప నారంభించెను. ఫిరంగులను ఎక్కించి కోటమీఁదికి ప్రయోగించుటకు ఎత్తుకట్టడములు కట్ట నారంభించిరి.

## ప్రకరణము. ౨౦ – క్షామము.

ఈవిధముగా నెంతపనిచేయుచున్నను, కోటబురుజులలో కొన్ని ప్రదేశములు పగిలి గోలకొండ సైన్యమునకు రక్షణ తగ్గినను మొగలాయీ సైన్యములో కొంతయతృప్తి యేర్పడి చాలమంది తిరుగుబాటుచేయు నట్లుండిరి. ఇందులకు కారణము జనులకు ఆహారము లేకపోవుటయు జంతువులకు గడ్డిలేక పోవుటయు. చుట్టుపట్ల క్షామము కలిగెను. ఈసందర్భమున

మహాధనికులుకూడ స్కంధావారమున దిగులుపడసాగిరి. ఆ సంవత్సరము వర్షములు చాల తక్కువయైనందున జొన్నలు గాని రాగులుగాని పండలేదు. పైరు ఎండిపోయినది. పేదలు మాడిపోసాగిరి. ఈలోపల తానాషాకు సహాయముచేయుటకు వచ్చిన మహారాష్ట్రసైన్యము మొగలాయీవారికి వచ్చుచుండిన సరఫరాలను పూర్తిగా నడ్డగించివేసెను. మొగలు సైన్యములోనే అంటువ్యాధులు బయలుదేరినవి. అన్నాహారములు లేకయు రోగములువచ్చియు ప్రతిదినము లెక్కలేనివారు చని పోవుచుండిరి. చాలమంది సిపాయీలు కడుపుకోసము తానాషా కడకుపోయిరి. మఱికొందఱు తానాషాతో చేరకపోయినను రహస్యముగా తానాషాసైన్యమునకు సాయము చేయుచుండిరి.

ఈలోపల పాదుషా కొమారులలో వైషమ్య మేర్పడెను. ఆజమ్‌షాకు షాఆలముమీఁద సరిపడనందున పాదుషా అతనిని ఉజ్జయిని అక్బరాబాదులలోని విషయములను చూచు కొనుటకు పంపించియుండెను. ఇప్పుడు పాదుషా ఆజమ్‌షాను పిలిపించి గోలకొండమీఁదికి పంపెను. బిజాపూరును పరిపాలించుటకు నియమితుఁడైన రుహుల్లాఖానునుకూడ పాదుషా పిలిపించెను. పైగా మీర్జా యూర్ అలీ అను నతఁడు పాదుషాకు చాల ప్రియము చేయుచుండియు ఎట్టి ఉన్నతోద్యోగమును అంతవఱకు కోరియుండలేదు. పాదుషా అతనికి సైన్యము యొక్క దరోఘా ఉద్యోగమిచ్చి సరఫరాలు చూచుకొమ్మని చెప్పెను. మీర్జాయూర్ అలీ ఆయుద్యోగము చాల కష్టమని

యు తుదకు తన కవమానమే ఇందువలన కలుగుననియు తలంచి ఆయుద్యోగమును వలదనెను. ఆయుద్యోగము వస్తువులు లేనందున చాల నప్రియమైన నౌకరిగానుండెను. తుదకు షారిఫ్‌ఖా ననునతని కాయుద్యోగమిచ్చిరి. ఆయప్రియమైన నౌకరి వాని కర్కశ స్వభావముచేత మరింత అప్రియమై ఎల్లవారును వానిని ద్వేషించునట్టి పరిస్థితి యేర్పడినది.

మొగలాయీవారి దాడిచేత దేశమంతయు పాడైపోయెను. పాతిపెట్టిన ధనములవలె ప్రభువులు ఎచ్చటెచ్చటనో దాగియుండిరి. దారిద్ర్యము దేశమందు ప్రబలి కవుల కావ్యములలో ప్రజ్ఞాదారిద్ర్యము కనఁబడుచుండెను. సిపాయీలకు జలధారకు బదులు అసిధారయు ఆహారమునకు బదులు సంహారమును దొరకుచుండినవి. వైద్యులు తమ వైద్యమును మఱచిపోయి ఆహారమే మహౌషధమని తలంచుచుండిరి. జ్యోతిష్కుఁడు తనశాస్త్రము ఎవరికిని అక్కరలేనందున ఎచ్చట రొట్టెదొరకునా యని చూచుచు చంద్రుని చూచి ఇది ఏల రొట్టెగా నుండరాదని కోరుచుండెను. పాదుషాయొక్క కరణములకు కరణీయములు లేవాయెను. కాని ప్రధానకరణము మాత్రము సంవత్సరమంతయు రంజానేయని వ్రాసికొనసాగెను. ఖొరానులో 'భోజనము చేయుము' అను వాక్యమును చదివి "తిండివలదు అని ఎచ్చటను లేదే" అని యొక సాయెబు చింతించుచుండెను. దర్జీవాఁడు తన సూదితో సమానమై పోయెను. వస్త్రమును కుట్టుటకు బదులు దానిని పఱచి దాని

ముందు తాను కూర్చుండి ముష్టి యెత్తసాగెను. సాలెవాఁడు వస్త్రమునకు చాయమూర్చుటకు బదులు తానే చాయమూఁటి పోయెను. రొట్టెలయంగడివానికే రొట్టె చిక్కుబలేదు. చిల్లర సామానుల యంగడివాఁడు అంగడి నెత్తివేయుటకు ఆలోచించుచుండెను. వానియంగడిలో తక్కెడయు గుండ్లును తప్ప వేఱు లేవు. వడ్రంగి తన బంపమును ఉలియు చేతఁబట్టుకొని ఆకాశము చూచుచుండెను. కమ్మరివాఁడు కమ్మని వస్తువేది దొరకునా యని దిక్కులు చూచుచుండెను. మంగలివాని కత్తికి పని లేదు. వంటవాండ్రందఱకు చాల విశ్రాంతి కలిగినది. పొయ్యిలలో పిల్లులుకూడ వెచ్చదనము లేమిచే పరుండుటను మానివేసినవి. ఒకయింటినుండి ఏడ్పులు వినవచ్చినవి. పోయి విచారింపఁగా వారియింటికి బంధువులు భోజనమునకు వచ్చిరని తెలిసినది. ఇంకొకచోట జనులు చాల పరిహాసము చేయుచుండిరి. కారణ మేమనఁగా నొకఁడు రొట్టెను చూచినట్లు కలగనెనట. ఈదుఃఖము లేవియు తెలియని పిల్లలుమాత్రము సంతోషముగా నాడుకొనుచు, ఆఁకలివేసినప్పుడు ఏడ్చుచు, తాము పస్తుండి తమకు తల్లిదండ్రులు పెట్టగా తినుచుండిరి; 'ఈగోలకొండ ఎంత గట్టికోటరా' అని యెవరో నేర్పినదానిని పాటగా పాడుచుండిరి.

## ప్రకరణము. ౨౧ – ముట్టడి—రెండవ ఘట్టము.

గోలకొండ చాల గట్టికోట. ముట్టడి ప్రారంభమైనది మొదలు ఆకస్మికముగావచ్చి కోటను పట్టవలయునని ఫిరోజు జంగు ప్రయత్నించుచుండెను. కోట లోపలను వెలుపలను

కావలియుండు సిబ్బంది మామూలుగా మూఁడు జాములవఱ కును మేలుకొనియుండుటచే నాలవజామున త్రాటి నిచ్చెనలు వేసి ఉచ్చుత్రాళ్లు విసరి వానిని పట్టుకొని మెల్లగా గోడల నెగఁ బ్రాకి లోపల ప్రవేశింపఁదలంచెను. ఒకదినము రాత్రి మూఁడు జాములైన పిదప ఒకజాము మిగిలియుండఁగా కొందఱు మహా వీరులతో నాతఁడు కోటగోడను సమీపించెను. తానచ్చట నొక బండఱాతి వెనుక నిలిచి తన పరివారమును పని ప్రారం భింప నాజ్ఞాపించెను. ఇఱువురు సాహసికులు చాలనేర్పు చూపి కోట గోడలమీఁదికెక్కిపోయిరి. కొందఱు ఉచ్చుత్రాళ్ల మూల మున సగముదూరము ఎక్కిరి. కాని వారి దురదృష్టవశమున ఆచోట సంచరించుచుండిన యొక పాడుకుక్క, అచట పడియుం డిన శవములను తినుచుండినట్టిది, వీరినిచూచి తటాలున మొ ఱుగసాగినది. వెంటనే కావలివారు మేల్కొని కాగడాలు వెలి గించి. ఆశత్రువులనుచూచి వారిని వెంటనే చంపి క్రిందికి దొర్లిం చిరి. ఇతరులనేకులను చంపిరి. ఈవిపత్తునుచూచి దుఃఖపడి చేయునదిలేక ఫిరోజుజంగు వెనుదిరిగిపోయెను.

ఇంతలో పాదుషాయొక్క స్కంధావారమున నొక యలజడియాయెను. ఇరువురు శ్రమపడి కోటగోడలమీఁదికి ఎక్కిరని తెలియఁగానే కొందఱు తత్ఫలితమును ఎదురుచూచు నోపిక లేనివారై సంతోషాతిరేకముచేత పాదుషాకడకు పరువెత్తి కోటను పట్టుకొనినట్లు చెప్పిరి. అప్పుడు పాదుషా తెల్లవారు జాము నమాజు చేయుచుండెను. తత్క్షణమే భేరీవాద్యములు

వాయించి విజయమును ప్రకటింపుఁడని పాదుషా యుత్తరు వొసంగెను. స్కంధావారములోనివారందఱు ఒకరితో నొకరు సంతోషవార్తను చెప్పుకొన మొదలిడిరి. మహమ్మదీయ కోలాహలము మిన్నుముట్టెను. కొందఱు సిఫాయీలు బిగ్గరగా కేకరింపులు పెట్టసాగిరి. కొందఱు ఒకరినొకఱు పట్టుకొనుచు, లాగుకొనుచు, కౌఁగలించుకొనుచు, బరబర కొంతదూరము లాగుచు, నానావికారములు చేయుచు, గట్టిగా నవ్వుచు రచ్చ చేయసాగిరి. ఒక సిఫాయి తాను ఈవిషయము ముందే జోస్యము చెప్పియుండినట్లును అట్లే జరిగినది చూడుమని బడాయి చాటించుచునుండెను. 'అబ్బ ఇక విశ్రాంతి' అని యొకఁడు, 'నాకు కలవచ్చినది' అని మఱియొకఁడు, 'నాకు సర్దార్ చాల మర్యాద చేస్తాడు' అని ఇంకొకఁడు 'రేపు నేను ఢిల్లీకి ప్రయాణం, రేపటినుంచి నలభై దినాలలో ఇల్లుచేర్తాం' అని కొందఱును ఎగురుచుండిరి. ఒక సిఫాయి తన వస్త్రములు వెంటనే తెమ్మని చాకలివానికి మనిషిని పంపెను. కొందఱు మూటలు కట్టనారంభించిరి. ఈవిధముగా సిఫాయీలుండఁగా కోటగోడమీఁది నుండి ఫిరంగిగుండు వారినడుమ వచ్చిపడినది. 'చచ్చానురా బాబూ' అని ఒక్కొకరును దూరముగాపోయిరి. మరల కలసి 'ఇది ఎట్లువచ్చినది' అని ఆశ్చర్యపడసాగిరి. 'ఇది విజయసూచకముగా కాల్చినది; గుఱితప్పి ఇట్లు వచ్చినది' అని నవ్వసాగిరి. తటాలున నింకొక ఫిరంగిగుండువచ్చి వారికి కొంతదూరమున పడెను. ఈ విశేషమేమో కనుఁగొనవలయునని నలువురు సిఫా

యీాలు బయలుదేరిరి. ఒకఁడు ఒకమిత్తిరెక్కెను. ఇతరులు వాని ననుగమింపనుండఁగా మిత్తుమీఁదివాఁడు తుపాకిదెబ్బకు చచ్చి క్రిందపడెను. ఎక్కుచున్నట్టివారిలో నొకని తలపగిలిపోయి మెదడు నలువైపుల చెదరినది. ఇంకొకఁడు దూరముగాపోయి పదిలమైనచోటినుండి చూచి 'అయ్యో! మనవారు ఓడిపోయి నారుగదరా!' అని నిట్టూర్చెను. ఇంతలో పాదుషాగారి సైన్యములు చాల దెబ్బతిన్నవని స్కంధావారములో పూర్తిగా తెలిసి పోయెను.

ప్రకరణము. ౨౨ – మరల ముట్టడి ప్రయత్నములు.

మేనెల 16 వ తారీఖున కోటకావలి సైన్యము తటాలున వెలికివచ్చి వెలుపలనున్న ముట్టడివారిని కొట్టుట కారంభించెనని పాదుషాకు సమాచారమువచ్చెను. వెంటనే ఇజత్ ఖా నను వాఁడు వారిమీఁదికి పోయెనుగాని ఈయుద్ధములో మొగలాయీాలు డెబ్బదిమంది చనిపోయిరి. దాక్షిణాత్యులు ఎందఱు చనిపోయిరో తెలియదు. తర్వాత కోటలోపలివారు పెద్ద ఫిరంగి నొకదానిని కోటగోడమీఁదికి తెచ్చి దానిని సరిగా పాదుషాయొక్క శిబిరమునకు గుఱిచేసి కొన్నిగుండ్లు కాల్చిరి. అందుఁగొన్ని పాదుషా నిద్రించు గుడారమునుకూడ ప్రవేశించినవి; కొన్నిచుట్టును తాఁకుచు పోయినవి. పాదుషా భయపడి తత్క్షణమే తన గుడారముముందు రక్షకకాయమానముల నిర్మించుట కేర్పాటుచేసెను. వానికడ ఎత్తుగోడలవంటివానిని కట్టి వానిమీఁద ఫిరంగుల నెక్కించి కోటగోడమీఁదివారిని కూల్చు

మనెను. కాని కావలి సైన్యము విడిసియున్నచోటి కెదుటిభూమి
పల్లమైనందున పాదుషాకోరిక సాధించుటకు వీలులేకపోయెను.
అంతట ఔరంగజేబు పాదుషా రెంపువందల తోలుకవచము
లను తయారుచేయించి సాహసికులకు పంచిపెట్టించెను. గట్టి
నిచ్చెన నొకదానిని సిద్ధముచేయించి దానిని కోటగోడలను
సాధించు కట్టడములకానించి తానే ఎక్కుటకు ప్రయత్నిం
చుచు కాలుజారి పడఁబోయి తప్పించుకొనెను. ఈపని పాదుషా
కావలయునని యే చేసెను. అతఁ డంత గట్టిపట్టుదల చూపినచో
నితరులు తమ సాహసములు చూపుదురని యాతని నమ్మకము.

పాదుషాయొక్క ప్రయత్నములను చూచి ఖాజీల
కందఱకును పెద్దఖాజీయైన ఖాజీ అబ్దుల్లా యను నతఁడు
పాదుషాకడకు వచ్చెను. గోలకొండకోటను నాశముచేసి అబుల్
హసన్ తానాషా తుదముట్టువఱకు యుద్ధముచేయుటకు
పాదుషా సంకల్పించియున్నాఁడని తలంచి యాతఁడు, మహమ్మ
దీయాచారమునకు ఇది విరుద్ధమనియు శరణాగతుఁడైన ముస
ల్మానును కొట్టుట ఖొరాను ధర్మమునకు విరుద్ధమని పాదుషాతో
మనవిచేసెను. కాని ఇట్టి యనవసర ప్రవేశము పాదుషాకు
రుచింపనందున నాతఁడు ఆఖాజీని తన స్కంధావారమునుండి
దూరముగా తఱిమి వేసెను. మున్నొకపర్యాయము బిజాపూ
రును ముట్టడించునప్పుడును ఇట్లే జరిగెను. బిజాపురగోల
కొండల ముట్టడించుటకు పూర్వము పాదుషా, ఖాజీ షేకుల్
ఇస్లామ్ అను నతనిని తన దండయాత్ర న్యాయ్యమా యని

యడిగినందులకు ఆయన, ఎంతమాత్రము కాదనఁగా పాదుషా ఆతని నవమానించినవిధమునకు ఆతఁడు తన యుద్యోగమును వదలుకొని మక్కాకు పోయెను.

ఇట్లుండఁగా జూనునెల 16 వ తారీఖునాఁడు రాత్రి గొప్ప తుపానుకొట్టెను. మొగలాయీవారి స్కంధావారమంతయు నానావిధముల బీభత్సమాయెను. డేరాలును గుడిసెలును చపారములును చిందరవందరగా నెగిరిపోయినవి. కొన్ని తడిసి ముద్దయైనవి. సర్వత్ర బురద రేఁగి పడినగుర్తులు కనఁబడుచుండెను. పాదుషావారి కార్ఖానాలలోని సామానులన్నియు వెల్లువలో కొట్టుకొనిపోయినవి. సొరంగములయందును పల్లములలోను దాఁగియుండినవా రందఱును మునిఁగిపోయిరి. గాలిని వానను లక్ష్యముచేయక కోటమీఁదికి లగ్గలెక్కుటకు ప్రయత్నించి ముందుకు సాగినవా రందఱును ప్రవాహములో కొట్టుకొనిపోయిరి. వారెంత మొత్తుకొనినను వారిని కాపాడుట అసాధ్యమాయెను. కొండలమీఁదను కోటలమీఁదను దిబ్బలమీఁదను ఉండినవారు మాత్రమే ప్రాణములు దక్కించుకొనిరి. ఫిరంగికొఱకు కట్టిన మట్టిదిబ్బ కరఁగి నేలమట్టమై పోయెను.

సూర్యోదయమాయెను. గోలకొండ కోటలోపలనుండిన సిబ్బంది ఆవులించుచు మేలుకొనెను. తత్క్షణమే ఈయవకాశమును పూర్తిగా నుపయోగించుకొనుటకు శత్రువులమీఁది కుఱికెను. పాదుషాయొక్క శిబిరములో మిగిలినదానినంతయు ధ్వంసముచేసెను. మొగలాయీ సిపాయీలనేకులు చంపఁ

బడిరి, అనేకులు పట్టుఁబడిరి; మిగిలినవారు తమ ప్రాణములను కాపాడుకొనుటకు పాఱిపోయిరి. అబిసీనియావాఁడైన సలీంఖాననువాఁడు తటాలున నొక గుంటలోనికి దుమికి యీఁది పాఱిపోయెను. తన ప్రతాపమునుగూర్చి ప్రగల్భములు చెప్పుకొనుచుండిన మఫ్షిఫ్ ఖాను అబ్దుల్ రజాక్ లారీ తనకంటఁ గగపడఁగానే యొక సొరంగములో ప్రవేశించి బురదతో తన తలను కప్పుకొని వాని కగపడక ప్రాణముల రక్షించుకొనెను. తనకన్న ఘనుఁడు లేఁడని చెప్పుకొనుచుండిన జంషీద్ ఖాను బలముగాలఁది పరుగెత్తి, అటనట చేతులతోకూడ ప్రాకి, పాఱిపోయెను.

ఆతర్వాత గోలకొండ సిబ్బంది ఇజ్జత్ ఖానను వానిని డీకొనెను. వానికిని ఎదిరించి పోరాడుటకు ధైర్యము లేక ఒకపాటి యాచ్ఛాదనముగల సొరంగములోపడి పాఱిపోవుటకు యత్నించెనుగాని అబ్దుల్ రజాక్ లారీయొక్క సైనికులు ఆసొరంగమును చుట్టవేసికొనిరి. ఇదిచూచి వాఁడేదో దెబ్బతగిలి ప్రాణముపోవునట్లు పడిపోయెను. సిపాయీలు వానినిచూచి ఇదంతయు మోసమని చెప్పుకొనసాగిరి. 'మూర్ఛపోయినాడుగాని బ్రదుకవచ్చును' అనియొకఁడు, 'ఇదియొక వణుకురోగము. భయమువలనవచ్చును' అని మఱియొకఁడు 'వీని తలకాయను ఇనుముతో కాల్చిన ప్రాణమువచ్చును' అని ఇంకొక ఉపాయశాలియు చెప్పసాగిరి. ఇంతలో నొకసిపాయి దివిటీ నొకదానిని వాని నెత్తికడకు తేఁగానే, ఎక్కడకాల్తురో యని, ఇజత్ ఖాను లేచి కూర్చుండెను. కాని ఇంతవఱకు ఆతఁడెవఁడో ఆసిపాయీలకు

తెలియదు. ఆతని మొగమంతయు బురదగా నుండెను. అతని
తలపాగతోనే ఆతని కాలుచేతులు మెడయుకట్టి సారంగము
నుండి వెలికిలాగి తలను తెగవేయనుండిరి. ఇంతలో నొక
సిఫాయి పూర్వము మొగలాయీవారికడనుండి ఝామమున
తానాషాకడకు వచ్చినవాఁడు 'ఆహా, ఈయన ఇజత్ ఖాను.
పాదుషాయొక్క గొప్పసేనానులలో నొకఁడుగదా' అనెను
వెంటనే వానిని కోటలోపలికి లాగుకొనిపోయిరి. ఇదేవిధముగా
సార్ బరాఖాన్ అనువాఁడును వానితోడి పండ్రెండుగురు సర్దా
రులు ఖైదుచేయఁబడి గోలకొండ కోటలోపలికి తేఁబడిరి. కాని
సాదుల్లాఖానను వాని పెద్దకొమారుఁడు లత్ఫుల్లాఖానను వాఁడు
ఫిరంగిబండ్లను తోలుచు ఎంతకును వదలక చాలపరాక్రమము
చూపెను. పాదుషా ఆతనికి బహుమానముగా నొక కత్తి
నిచ్చెను.

ఈవిషయమంతయు తెలియఁగానే పాదుషా, ఘాజు
ద్దీన్ ఖాన్ ఫిరోజ్ జంగ్ ఏమాయెనని యడిగెను. పాదుషా
యొక్క శిబిరమునకును కోటకును నడుమనున్న యొక మసీ
దులో కొందఱు యోధులతో నాతఁడు తలదాఁచుకొనియు
న్నాఁడనియు, మూసీనది వెల్లువలు పాఱుచుండినందున శత్రు
వులమీఁదికి పోవుట కాతనికి అవకాశము లేకుండెననియు చెంత
నున్నవారు చెప్పిరి. సిఫాయీలను దాఁటించుట కుపయోగపడు
చుండిన పడవ ఎచ్చటను కానరాకుండెను. అంతట పాదుషా
హాయత్ ఖానను వానిని ఎనుబది డెబ్బది యేనుఁగులతోపోయి

మూసీనదినిదాఁటి వానివీపున నాసర్దారులను తెమ్మని యాజ్ఞా పించెను. వాఁ డట్లే బయలుదేరెనుకాని ప్రవాహము చాల వేగముగా నుండినందున ఏనుఁగులకు దాఁటుటకు అదను చిక్క లేదు. ఆదినము అర్ధరాత్రమువఱకును ఆతఁడు ప్రయత్నించి వెనుకకు తిరిగెను.

## ప్రకరణము ౨౩. తానాషా జాబు.

అబ్దుల్ రజాక్ లారీ తాను ఖైదుపట్టుకొనిపోయిన యా మొగలాయీ సర్దారులను తానీషాకడకు కొనిపోయెను. గోల కొండసుల్తాను వెంటనే వారికి సేదదేర్చుకొను సదుపాయములు చేయించి మూఁడుదినములు తనకడ నుంచుకొని, వారికి విందులు మొదలైన యుపచారములుచేసి మర్యాదగా మాట లాడి వారి చిత్తవిభ్రాంతిని తీర్చెను. ఇజత్ ఖాను, సార్ బరా ఖాను మొదలైనవారికి గొప్పదుస్తులను బహుమానమిచ్చెను. సార్ బరాఖానును పిలుచుకొనిపోయి, తానాషా, తాను నిలువ చేసి యుంచుకొనియున్న ధాన్యమును, తనకడనుండిన తుపాకి మందును యుద్ధపరికరములను చూపి, తనకు వలసినదానికన్నను హెచ్చుగా వస్తుసంచయము కలదనియు కోట వదల ననియు నొకజాబువ్రాసి దానిని పాదుషా కిమ్మని ప్రమాణపూర్వక ముగా కోరి గౌరవముతో వీడ్కొలిపెను.

వీరందఱును పాదుషాకడకు పోయిరి. తానాషా సుల్తాను మర్యాదచేయఁగా పాదుషా వారిని అవమానపఱచెను. ఇజత్

ఖానును సార్ భరాఖానును వారు వచ్చిన విధమునకును తానాషాకడ బహుమతు లందినందులకును చాలగర్హించెను. ఇజత్ ఖానుయొక్క బిరుదములను తీసివేసి, అతనిని పదవిలో నుండి క్రిందికిలాగి బెంగలా యనుచోటికి పంపెను. సార్ బరాఖానునుకూడ అట్లే బిరుదరహితునిచేసి పదవితగ్గించి, పాఱిపోవుట బానిసలక్షణము గాన నాతఁడు బానిసయైనాఁడని ప్రకటించెను. తానాషా వ్రాసినజాబును ఫిరోజుజంగున కిచ్చి అందలి ప్రధానాంశములను ఆలోచించుటకు తగినవని తోచిన యెడల తనకు తెలుపవలసినదని యాజ్ఞాపించెను. జలాలనువాఁడు తానాషాకడనుండి తానొకమాట చెప్పవలసియున్నదని విన్న వించుకొనెను. ఆమాటనువిని పాదుషా రాత్రి మూఁడవ భాగము జరిగిన వెనుక, లోకమంతయు నిశ్శబ్దమైనంతట అబుల్ హసనుయొక్క విషయమంతయు వచ్చి తనతో చెప్పవలసినదని యాజ్ఞాపించెను.

రాత్రిలో మూడవపాలు జరిగినయనంతరము పాదుషా చేత జలాలు ఆజాబునిచ్చెను. పాదుషా స్వయముగానే చదువు కొనెను.

"పాదుషా వారి యాస్థానమందలి సేవకులలో నన్నొక నింగా నేను తలంచుకొనుచున్నాను. నేను తెలిసిగాని తెలి యకగాని లేక నా బుద్ధిపూర్వకముగగాని చేసిన తప్పులకన్నిటి కిని చాలినంతశిక్షను ఈపాటికే అనుభవించినాను. ఇకను క్షమాపణను అనుగ్రహింతురని ఆశతో కాచుకొనియున్నాను.

మీారు జయించి ఈకోట మీా స్వాధీనమైనయెడల మీాసైన్య మంతయు మీా దేశమునకు తిరిగి సుఖముగాపోయి చేరును. మాకోటను పాడుపెట్టి మీాబానిసలలో నొకని స్వాధీనమం దుంచి మీారును పోగలరు. ఆ బానిసనుగానుండు భాగ్యము నాకే కలుగునుగాక యని నేను కోరుచున్నాను. ఈ మీా ఫర్గణాకు సుబేదారుగా నేర్పాటు కాగలవాఁడు తనకును తన మనుష్యులకును కొంత ద్రవ్యము ఖర్చుచేయవలసి యుండును. ఆమొత్తము మీారు మాకడనుండి రాబట్టు కొనుదానికన్నను హెచ్చుగా నుండునేగాని తక్కువగా నుండదు. ఆ తక్కువ పడునట్టి మొత్తమును తాము తమ ఖజానానుండి వెచ్చింపవలసివచ్చును. అది మీాకు పెద్ద ఖర్చు గదా. కాని నేను ఈవిజనీకృత దేశమును మరల జనాకీర్ణము గావించి చక్కగా పరిపాలింప సమర్థుఁడనుగా నున్నాను. ప్రస్తు తము మన యుద్ధములచేత పాడుపడిన ఈదేశము ఈగుడ్ల గూబలును ఘూతుకములునుపోయి మరల బాగుపడుటకు ఏడె నిమిది సంవత్సరములు పట్టుట స్పష్టము. తమ యుడిదార్లకు పైకము కట్టుటకు చాలినంత ధనమును ఇంకను హెచ్చును నేను వసూలుచేయగలిగినంత ఇతరులు చేయఁజాలరనునది తమకు తెలిసియేయున్నది. నాయీాప్రార్థనను తాము అంగీక రించునెడల తమ కరగ్రాహులచేతికి తమ సైన్యము బయలు దేరిన మొదటి విడుదలచోటికే ఒక కోటిరూపాయలను అప రాధముగా సమర్పించుకొనగలను. తర్వాత మాకోటగోడల

కడకు రాగానే తమ దివ్యపాదములకడ పెద్దమొత్తమును సమర్పణము చేయగలను. ఇట్లిదంతయు చేయుటలో నాయభిప్రాయమేమనఁగా ముసల్మానులు ఇంకను చావకుండవలయుననియు తమ సిబ్బందికి ప్రయాస తగ్గవలయుననియేగాని వేఱుకాదు. ఇంత నేను ప్రార్థించి పాదములలోపడియు పాదుషావారు అనుగ్రహింపకపోయిన, తమ సేవకులు ఇంకను కొంతకాలము వృథాగా పోరాడవలయునని దివ్యచిత్తమైనయెడల, బాధపడియున్న తమ సిబ్బందికి కొంత శ్రమాపనోదార్థము ఐదాఱు లక్షల మణుగుల ధాన్యమును పంపుటకు సిద్ధముగానున్నాను. నాకడనుండు ధాన్యకటకమును తమ సర్దారు సార్ బరాఖాను గారు చూచివచ్చియున్నారుగదా. ఆధాన్యము నాకు కావలసినదానికన్న నెంతయో ఎక్కువ. ఇవన్నియు తమ దివ్యచిత్తమునకు తేవలయును.''

ఈవిధముగా తానాషాజాబును చదివి అందలివిషయములను, తాను అనుభవించినవానిని, వివరముగా, పాదుషా హృదయము కరఁగునట్లుగా సార్ బరాఖాన్ చెప్పెను. పాదుషా మనసు చలించినవానివలెనై ఇట్లనెను. ''మాయాజ్ఞలను తిరస్కరించు నభిప్రాయము అబుల్‌హాసనుకు లేనియెడల నాతఁడు తత్క్షణమే చేతులు జోడించుకొని మాకడకు వచ్చినయెడల మా ఔదార్యమునకు తగినట్లు మేము చేయఁగలము.'' అనెను. తానీషా ప్రార్థనలు చేయుచునేయున్నను బీరారువారైన ముసద్దీలకును ఉద్యోగులకును తన గదాధరుల మూల

మున పాదుషా, ఏబదివేల గోనెసంచులను, రెండు గజముల పొడవు ఒక గజము వెడల్పుగలవానిని, తక్షణమే కుట్టించి ఇతర యుద్ధసామగ్రితో పంపవలసినదని ఆజ్ఞాపించెను.

## ప్రకరణము-౨౮. సొరంగములు.

క్రీ. శ. 1687 సం. జూన్ 20 వ తారీఖునాటికి గోల కొండకోట గోడల క్రిందికి మూఁడు సొరంగములు త్రవ్వఁబడి నవి. వాని నిండుగ తుపాకిమందు నింపఁబడినది. తుపాకి మందుకు నిప్పంటించుటకు కొంతముందు మోర్ఛాలవాడు గొప్ప శబ్దముచేయుచు వీరావేశముతో యుద్ధమునకు వచ్చుచున్నట్లు ఉండినయెడల కోటలోపలి రక్షకసిబ్బంది ఇది యేమో యని గుంపుగా గోడలమీఁదికి వత్తురనియు తుపాకిమందు పేలిన వెంటనే మొత్తముగా చత్తురనియు పాదుషా ఆలోచించి అట్లు చేయుమని యాజ్ఞాపించెను.

కాని మొగలాయీల యీ ప్రయత్నమంతయు అబ్దుల్ రజాకు ఎట్లో గ్రహించెను. ఆతఁడును అతని యనుచరులును ఎట్లో ప్రయత్నించి ఆ ప్రదేశములను కనుగొనిరి. గోలకొండ కోటలోపలినుండి త్రవ్వి ఆతుపాకిమందును పూర్తిగా రెండు సొరంగములనుండి తీసివేసి ఆ ప్రదేశమంతయు నీరు పాటించి మట్టితో కప్పివేసిరి. మిగిలినదానినంతయు నీటితో తడిపిరి. ఇంతలో బయట మొగలాయీలు కోటపట్టునట్టి హాహాకార ములుచేయ నారంభింపఁగా కొందఱు కోటగోడలమీఁదికిపోయి చూడసాగిరి. పాదుషా ఏర్పాటుప్రకారము సర్దారులు ఈల

వేయగానే మందులవారు మందుకు మొదటి సొరంగముకడ నిప్పంటించిరి. కొంతమందు పోయినందుచేతను కొంతతడిసినందు నను మొగలాయీలకు చేర్పగానున్న మందు బాగుగానుండి వారిపైపే పేలినది. మందులవారు, వారివెంట కాచుకొని గోడపడఁగానే లోపల ప్రవేశింపనుండిన సైన్యము, ఫిరంగుల వారు, వేడుకచూచుచుండినవారు అందఱు కాలి చచ్చిరి. గోడల్లో కొంతభాగము కూలినందున అగడితకును దానికిని నడుమ చాలమంది సమాధినందిరి. ఇందువలన మొగలాయీ లకే అపారనష్టము కలిగెను. కోటమీఁదివారిలో చాలకొద్ది మంధి చచ్చిరిగాని అపాయమేమియు కలుగలేదు. మొగ లాయీలు చచ్చినవారి సంఖ్య 1098.

మొగలాయీవారు ఇట్లగునని తలంపలేదు. వారికి ఈ యాశ్చర్యముచేత చాలభయ మేర్పడెను. తా మెదురు చూడనివిధమున నందఱు జనులు చనిపోయినందులకు వారికి మతిపోయిన ట్లాయెను. తుపాకిమందువలని పొగయు దుమ్మును స్కంధావారమంతటిని ఆక్రమించి అంధకారబంధురముగా చేసెను. గోలకొండవారు మొగలాయీగోడును చూచిరి. తత్క్షణమే నానావిధములైన బలవత్తమములైన ఆయుధము లన్నిటిని గ్రహించి పాదుషావారి సైన్యముమీఁదపడి మొగ లాయీల మోర్జాలను కొన్నిటిని పట్టుకొనిరి. పాదుషాకు ఈవిషయము తెలియఁగానే గోలకొండవారిని దండించి మరల మోర్జాలను యథాపూర్వము ప్రతిష్ఠింప నాజ్ఞాపించెను. ఇరు

వాగులలో పలువురు నాశమై ఘోరయుద్ధమైనంతట మరల మోర్జాలను తిరిగి వానివానిచోట నిలిపిరి. ఈదెబ్బనుండి మొగలాయీలు కొంచెకొంచెము తేరుకొనునంతలో రెండవసారంగమునకు నిప్పంటించుటకు ఆజ్ఞవచ్చెను. ఇంతలో కోటలోపలనుండి కొన్నివేలరాళ్లు బండలు పక్షులవలె రివ్వురివ్వునవచ్చి లెక్కలేని మొగలాయీల తలలనుకొట్టగా మొగలాయీల యేడ్పులును రొదలును ఆకాశమును ముట్టుచుండెను. ఈమారు రెండువేలయేడుగురు మొగలాయీసిఫాయీలు మరణించిరి. మరల కోటలోని ఫౌజు బయలుదేరివచ్చి మోర్జాలను పట్టుకొనయత్నించినవి. ఆసమయమునకు సరిగా ఘానుబహదూరు ఫిరోజ్‌జంగు ఆచోటికి వచ్చిచేరెను. ఇరుపక్షులవారికిని ఘోరయుద్ధమాయెను. ఆఱుమంది మొగలాయీసైనికులు చనిపోయిరి. ఫిరోజుజంగు ఎంతయత్నించియు గోలకొండవారు తగ్గలేదు.

ఈ రెండవ దురంతవార్త పాదుషా చెవిసోకఁగానే ఆతనికోపాగ్ని మండసాగెను. తత్క్షణమే ఆతఁడు పల్లకియెక్కి యుద్ధరంగమునకు వచ్చెను. మహాశూరులును యోధాగ్రేసరులును ఒకచోట చేరవలసినదని పాదుషా ఆజ్ఞాపించెను. అందఱును ఆయత్తపడుచుండిరి. పాదుషాయొక్క పల్లకి వచ్చుచుండఁగా నొకఁడు కోటగోడనుండి పేల్చిన తుపాకిదెబ్బకు పల్లకిమోయువారిలో నొకనిచేయి విరిగిపోయినది. పాదుషా మాత్రము చలింపక పల్లకిని పొమ్మనెను. ఫిరోజుజంగు మొద

లైనవారు పాదుషాయొక్క దృఢసంకల్పమునుచూచి తమ పరాక్రమములను చూపసాగిరి.

ఇంతలో దైవాధీనముగా మరల నొక తుపాను చెల రేఁగినది. మొగలాయీలు త్రవ్వుకొనిన సొరంగముతే వారికి నదులవలె అడ్డుతగిలెను. ఫిరంగులుంచు దిబ్బలన్నియు కరఁగి పోయినవి. ప్రవాహము క్షణక్షణమునకును ఎదురెక్కుచు మహావేగముతో వచ్చుచుండెను. మరల గోలకొండవారి ఫౌజులు కోటవెలువడి మోర్చాల వారిమీఁదికి వచ్చిపడినవి. మొగలాయీల చిన్నఫిరంగుల నన్నిటిని లాగుకొనిపోయిరి. బరువైనవానిని మేకులుకొట్టి నిరుపయోగముచేసిరి. అగడితలో మొగలాయీలు వేసిన మట్టిమూటలనుతీసి కోటగోడలో పడి పోయిన చోటులలో పెట్టించిరి. ఇంతలో నొకఁడు పాదుషాగారి పల్లకిముందు నడచుచుండిన గొప్ప యేనుఁగును నలువదివేల రూపాయల వెలగలదానిని ఫిరంగితో కొట్టిచంపెను. ఏలనో వారెవ్వరును పాదుషామీఁదికి ఫిరంగులను కాల్పలేదు. బహుశః తానాషా ఆజ్ఞ కాఁబోలు. ఇంతలో సాయంకాల మాయెను. మొగలాయీలు చేయునది లేక ఆదినము యుద్ధము మానుకొని తమ గూడారముల నాశ్రయించిరి.

మఱునాఁడు తెల్లవాఱఁగానే పాదుషా దిగ్విజయము బయలుదేరెను. మూఁడవ సొరంగమునకు నిప్పంటించునప్పుడు తానే సమీపమున నుండవలయునని ఢిల్లీశ్వరుని సంకల్పము. సముద్రమువలె మొగలాయీ సైన్యము ఘోషతో బయలు

చేరెను. కవచములు ధరించిన యోధులు తిమింగిలములవలె నుండిరి. ధూళిధూసరితమైన యీ ప్రపంచమున యోధుల శిరస్త్రాణములు నీటిమీఁది బుడగలవలె మినమినలాడుచుండినవి. పాదుషా నల్లనిగుఱ్ఱముమీఁద నెక్కి యమధర్మరాజువలె వచ్చుచుండెను. సర్దారులందఱును పాదుషావెనుక వారివారి తరగతుల ప్రకారము వచ్చుచు తానాషానుపట్టు యమకింకరులవలె నుండిరి. కొందఱు సిఫాయీలదుస్తు లెఱ్ఱగానే యుండెనుగాని మొగములు మాత్రము దుఃఖావృతమై వెలవెల పాఱియుండెను. కొన్ని గుఱ్ఱములమీఁది కవచములు చర్మములవలెను అశ్వములు వాని యస్థిపంజరములవలెను వానికి కాబోవు దుర్దశను సూచించునట్లుండెను.

కోటగోడలను సమీపించినంతట పాదుషా మూఁడవ సారంగమునకు నిప్పంటించుటకు ఉత్తరువిచ్చెను. అది ఎంత మాత్రము మండలేదు. ఒక నిప్పురవ్వయైనను రాలేదు. తర్వాత మొగలాయీలకు తెలిసినది - గోలకొండవారు మందును పూర్తిగా తీసివేసి వత్తినిసైతము కత్తిరించి వేసిరని. మందుపేలి గోడపగులఁగానే కోటమీఁదికిదుమికి దానిని పట్టుకొనుటకు చేసిన ప్రయత్నమంతయు నాటికి మానుకొనవలసి వచ్చెను. సిబ్బందియంతయు మొగము వ్రేలవేసికొని వెనుదిరిగిపోయెను. ఫిరోజుజంగునకు రెండుబాణములు తగిలినందున మంచిగాయమై యుండెను. ఇంక ననేకులకు దెబ్బలు తగిలి యుండినవి. కోటపట్టుపనిని సేనాధిపత్యమును తనకుమారుఁడు ఆజంషాకు పాదుషా ఒప్పగించెను.

తర్వాత కొన్నిదినములవఱకు తానాషాసైన్యములు మొగలాయీలను ఢీకొనలేదు. మొగలాయీలును కోటను పట్టుటకు రాలేదు. కొందరు సర్దారులు పాదుషాకడకు పోయి హైదరాబాదు మొదలైన ప్రధాననగరములను పట్టుకొని దేశమును స్వాధీనము చేసికొనినయెడల తానాషా కొన్నాళ్లు కోటలోనుండి పోరాడి తుదకు అన్నాహారములు లేనందున వశపడునని మనవిచేసిరి. వెంటనే పాదుషా కొందఱు అధికారులను ప్రధానప్రదేశములకు పంపి తన జాబులలోను కచేరీ కాగితములమీఁదను ఫర్మానాలలోను దరఖాస్తులయందును హైదరాబా దనుపేరు వ్యవహరింపక దానికి దార్-ఉల్-జిహాద్ అని క్రొత్తపేరు వ్రాయవలయునని యాజ్ఞాపించెను. అబ్దుల్‌రహీంఖానును పన్నులు మొదలైన వసూలు పనులయందు నియమించి మహమ్మదీయేతరుల యాచారవ్యవహారముల వేటిని సాగనీయక దేవాలయములను కూల్పించి మసీదులుకట్టుట కేర్పాటుచేసెను.

## ప్రకరణము ౨౫. రజాక్ యొక్క కడపటియుద్ధము.

ఈలోపల తానాషాయొక్క సర్దారులలో చాలమంది ఔరంగజేబుయొక్క స్కంధావారమును ప్రవేశించి పాదుషా కడ మర్యాదలను పదవులను సంపాదించుకొనిరి. ఇట్లుండగా తానాషాకోటలో నొకవదంతి పుట్టెను. గోలకొండసర్దారులలో ప్రధానులగు ముప్వురలో నొకఁడైన షేక్ మిన్ హాజ్ అను వాఁడు లోలోపల పాదుషాకు సహాయముచేయుట కొడంబడి

యున్నాఁడని తానాషాతో కొందఱు ఆప్తులు చెప్పసాగిరి. తానాషా ఆమాటలనునమ్మి షేక్ మిర్హాజును చెఱఁబెట్టించెను. ఇప్పుడు తానాషాయొక్క సర్దారులలో నమ్మకమైన వారు ఇరువురే మిగిలిరి. ఒకడు అబ్దుల్ రజాక్ లారీ యను వాఁడును రెండవవాడు అబ్దుల్లాఖాన్ పాని. ఈ యిరువురును తమ శక్తినంతయు వినియోగించి తమ సుల్తానుకొఱకు పాటుపడుచుండిరి.

అబ్దుల్ రజాక్ లారీకడకు పాదుషా దూతనుపంపెను. 6000 సైన్యమునకు ఆధిపత్యమును పెక్కు గౌరవములను ఇచ్చున ట్లొకఫర్మానా వ్రాసిపంపెను. రజాకునకు చాలకోపము వచ్చెను. రాజభక్తినుండి ఏమాత్రమును ఆతఁడు చలింపక పాదుషాదూతను తిరుగఁగొట్టెను. అతఁడు తనప్రాణమును సైతము లక్ష్యముచేయలేదు. ఆఫర్మానాను కొనిపోయి కోటగోడమీఁదనిలిచి పాదుషా సైన్యమునకుచూపించి దానిపై నుమ్మివేసి నానావిధములుగా వెక్కిరించి తుదకు చింపి పాఱవేసెను. పాదుషాకు ఇట్లు చెప్పిపంపెను. "ఈమహాయుద్ధమునకు సరిపోల్పతగినది కార్బాలాయుద్ధముతప్ప వేఱులేదు. హాజరత్ ఇమాంహుసేనుతో చేరియుండి తుదకు ద్రోహులై ఆతనిమీఁదనే కత్తినెత్తినపాపులతో అబ్దుర్ రజాక్ లారీ ప్రాణముండఁగా ఎంతమాత్రము చేరఁడు. ఆడెబ్బది ఇరువురు వీరులలో నొకనివలె ఇహపరములలో కీర్తిప్రతిష్ఠలు నాకు రాగలవు. తమ నాయకునికిని తమకును ప్రాణముండువఱకును

పోరాడి నశించినవారిలో నొకఁడను కాగలను.'' ఈవాక్యములు వినఁగానే పాదుషాకు ఆశ్చర్యమాయెను. ఆతనియందు గౌరవ మేర్పడెను. కాని ప్రత్యక్షముగమాత్రము ఇట్లనెను. ''ఛీ! దురదృష్టవంతుఁడా.''

మరల మొగలాయీలు ముట్టడి ప్రారంభించిరి. రుహుల్లాఖానను వాఁడు కోటనుపట్టుటకు తన సామర్థ్యము నంతయు వినియోగింప నారంభించెను. తుద కాతని ప్రయత్నములకు కొంతఫలము కనఁబడెను. కోటతలుపులు తెఱచు నుపాయము కనఁబడెను. రణమస్తఖాను, అబ్దుల్ పానియను వానిమూలమున అబ్దుల్లాఖాన్ ఆఫ్ఘన్‌పానియను సర్దారును స్వాధీనపఱచుకొనెను. ఈతఁడు తానాషాయొక్క గొప్పసేనాపతిగా నుండినందున ఒకదర్వాజా ఆతనిస్వాధీనమందు నుల్తానుంచియుండెను. ఇది ప్రధానమైన ఖిర్కీదర్వాజా. ఎట్టి యాలస్యమును లేక కోటనుపట్టు మార్గమును చెప్పవలసినదని యాతనిని మొగలాయీలు ప్రార్థించిరి. వారుచూపిన యాశలకులొంగి కోటగోడలో ఫిరంగిదెబ్బలకు చెడిపోయిన ప్రదేశములనుచెప్పి మొగలాయీవారి సైన్యమురాఁగానే తానుతలుపు తెఱచున ట్లాతఁడు రహస్యముగా నొప్పుకొనెను. ఈ విషయము తానాషాకును రజాకునకును తెలియదు.

ఒకనాఁడు రాత్రి మూఁడుజాము లైనతర్వాత మొగలాయీసర్దారులు రుహుల్లాఖాను, ముఖ్‌తర్‌ఖాను, రణమస్తఖాను, సాఫ్‌షికన్‌ఖాను మొదలైనవారు అబ్దుల్లాఖాను చెప్పిన

మార్గములలో కోటగోడలమీఁదికివచ్చిరి.మహమ్మద్ ఆజంషా, పాదుషా కుమారుఁడు, సైన్యముతో కోటదర్వాజాకడకు వచ్చి నిలిచెను. వెంటనే అబ్దుల్లా తలుపులు తెఱచివేసెను. వెంటనే మొగలాయీలు లోపల ప్రవేశించి ఆయాచోటులను గట్టిగా పట్టుకొనసాగిరి.

ఈయార్భాటములు వినరాఁగానే అబ్దుల్ రజాక్ తానాషాయందలి భక్త్యావేశములు ఒక్కమారు ఉబికిరాఁగా తటాలున యుద్ధసన్నద్ధుఁడాయెను. తాను పూర్తిగా కవచాదులు ధరించుటకుగాని గుఱ్ఱమునకు జీనులు వేయుటకు గాని అవకాశము లేదు. ఒకకత్తి చేతఁగొని కనఁబడిన యొక గుఱ్ఱము యొక్క వట్టివీపుమీఁదికి దుమికి రెండవచేత డాలుమాత్రము తీసికొని యుద్ధమునకు ఉఱికెను. అతని వెంటనుండిన పండ్రెండుగురును అట్లే దుమికిరి. ఆ వేగములో ఎవరు ఎచటనుండిరో తెలియలేదు. ఊహాతీతమైన పరాక్రమమును రజాక్ చూపసాగెను. అఱువదియేండ్ల వాఁడు కాళ్లతోను చేతులతోను పోరాడెను. ప్రాణమునకే తెగించెను, "నాకడపటి శ్వాసం ఉండేవఱకు తానాషాకోసం పోరాడ్తాను" అని ఆతఁడఱచుచుండెను. అడుగడుగునకు కత్తులును ఈటెలును వచ్చుచుండఁగా కొట్టుచు త్రోయుచు పోవుచునేయుండెను. ఆతనికి నఖశిఖపర్యంతము కత్తిదెబ్బలు ఈటెపోటులును. దర్వాజావఱకును నఱకుచుపోయి తలుపులు వేయవలయునని యాతని యుద్దేశముకాఁబోలు. లెక్కలేని గాయములకుతోడు ఆతనికి

మొగమున పండ్రెండు గాయములు తగిలినవి. ఒకదెబ్బకు కన్నొకటి పోయినది. ఆతని గుఱ్ఱమునకు చాల గాయములు తగిలి అది అతని బరువునకు వణఁకుచుండెను. ఇంతవఱకు వచ్చి నంతట ఆతఁడు గుఱ్ఱముయొక్క కళ్లెములను వదలి దానినిమాత్రము తన కాళ్లసందున గట్టిగా పట్టుకొనెను. ఆగుఱ్ఱము తత్క్షణమే గుంపునుండి తప్పించుకొని రజాక్ను కొనిపోయి ఒకచెట్టు క్రిందత్రోసి చూచుచు నిలిచియుండెను. ఇంతలో తెల్లవారెను. ఎవరో ఆతని గుర్తించి దయదాల్చి తమ యింటికి మోయించుకొని పోయెను. ఆతని కింకను ఆయుర్దాయమున్నది కాఁబోలు.

౨౬–తానాషా భోజన సమయము.

కోటయంతయు గందరగోళింప సాగినవెంటనే ఈవార్త తానాషాకు తెలిసెను. తత్క్షణమే సుల్తాను కోటలోను అంతఃపురమందును ఏడ్చుచున్న స్త్రీలను పరివారమును ఓదార్చి వారి కడ సెలవుపుచ్చుకొనసాగెను. తర్వాత ఆస్థానమునకువచ్చి తన సింహాసనముమీఁద కూర్చుండెను. ఆవాహనలేని అతిథులకై ఎదురుచూచువానివలె దర్పముతో నుండెను. భోజనసమయమైనంత త్వరగా నన్నపానముల కాజ్ఞాపించెను. ఇంతలోపల రుహుల్లాఖాఁ ముక్తారుఖానులు ఇతర సర్దారులతోను గొప్పవారితోనువచ్చి తానాషాను చూచిరి. సింహాసనముమీఁద నుండి ఆక్లిష్టపరిస్థితిలోగూడ ఆస్థానభోగమును వీడని యాప్రభువును చూచినంతనే వారి ధైర్యము తగ్గెను. ఆతని తేజమే వారిని కొట్టునట్లుండెను. ఇంక కొంతసేపటికి ఖైదుచేయఁబడు

వానివలె నాతఁడు కనఁబడలేదు. ఆ చింతయే లేనివానివలె నుండెను. మొగలాయీ సర్దారులు ఆతనికి సలాములు చేసిరి. ఆతఁడు వారికి తనకీవియంతయు కనఁబడునట్లు బదులు సలాము చేసెను, వారినందఱను ప్రత్యేకముగా హెచ్చరించుకొని మర్యాదచేసి గంభీరముగ స్వాగతము పలికెను.

ఇంతలో నొక సేవకుఁడువచ్చి తానాషాకు భోజనము సిద్ధమైయున్నదని విన్నవించెను. వెంటనే సుల్తాను తనకు భోజన వేళయైనదని వారితో చెప్పి వారినికూడ తనతో విందారగింప ప్రార్థించెను. కొందఱు దుర్జనులు తానాషాను అటునుండి పోనీయరాదని పలికిరి. కాని మొగలాయీ సర్దారులు ఆలోచించి అట్లు చేయుటలో తప్పులేదని తలంచి ఒప్పుకొనిరి, ముక్తార్ ఖానును మఱియొకఁడును తానాషాతో భోజనమునకు కూర్చుండిరి. రుహుల్లాఖాను ఆశ్చర్యపడి "ఇది భోజనానికి సమయమా?" అని యడిగెను,

తానాషా ఆతని హృదయమును గ్రహించి వెంటనే ఇట్లు జబాబిచ్చెను. "అవును, ఇదే భోజనానికి సమయం".

రుహుల్లాఖాన్.—అది నాకు తెల్సును; కానీ ఇట్వంటి సందర్భంలో మీాకు ఎట్లా నోటికి పడ్తుంది.

తానాషా.—మీారూ సాధారణ జనులకే మనస్సులో ఉంచుకొని మాటలాడుతున్నారు. నాకు భగవంతుడిలో సంపూర్ణమైన నమ్మకం ఉంది. ఆయన దయామయుఁడు మహనీయుఁడు, ఈప్రపంచం అంతా సృజించి ధనికులు దరిద్రులు

అనే భేదం లేకుండా కాపాడేవాఁడు. తన కృపాకటాక్షం ఆయన సేవకుడైన తానాషామీాదనుండి ఎంతమాత్రం మరల్చడు. అతనికి ఏర్పాటుచేసిన అన్నం తప్పక పంపుతాడు. నాపితా మహమాతామహులు ఇద్దరున్ను తమకాలం అంతా ఐశ్వర్యములోనే గడపినారు. కాని నేను కొంతకాలం దారిద్ర్యం అనుభవింపవలెను అని భగవంతుని ఆజ్ఞ కాబోలు గడపినాను. మళ్లీ ఆమహామహుడు ఈదీనుడిమీాద కనికరించి సకలఐశ్వర్యములు ఇచ్చినాడు. నాకు ఆయన ఏర్పఱచిన సన్నివేశములచేతా ఒక గంటలో నేను రాజై పోయినాను. ఎవరున్ను నేను రాజౌతానని తలచలేదు. నేనుకూడా. భగవంతుడి అనుగ్రహంవల్ల నా హృదయంలో కోరికలు ఏమిన్నీ లేవు. లక్షలు దానం ఇచ్చినాను. కోట్లు ఖర్చుచేసినాను. ఇప్పుడు రాజ్యాధిపత్యం నాదగ్గ నుండి లాగివేస్తున్నాడు దేవుడు. బహుశః నేనేమైనా అపరాధముచేసినానేమో. దేవుడు ఈమాత్రం దయచూపినందుకు నేను కృతజ్ఞత చూపవలసినవాడినే కాని ఆయన ఆజ్ఞకు చింతించను. నాకాలము ముగిసినవెంటనే ఈరాజ్యాధికారతంత్రంను ఆస్తికుడైన అలంఘీరు పాదుషాచేత ఉంచిన భగవంతుడికి వందనము లాచరిస్తున్నాను. ఇదంతా దైవ విచిత్రం.”

భోజనానంతరము తానాషా తన గుఱ్ఱమునకు ఆజ్ఞాపించి, శరీరమున విశేషవస్తువు లేవియుధరింపక మెడలో నొక ముత్యాలహారమునుమాత్రము ధరించి మొగలాయీా సర్దారు

లతో బయలుదేరెను. ఆతఁడు ముందుపోవుచుండఁగా వారు అతనివెనుక వచ్చుచుండిరి. ఆదృశ్యము చంద్రునిచుట్టును కాంతి గుడికట్టిన ట్లుండెను. ఆమహనీయుఁడు పెండ్లినాఁడు సైతము ఇంతనెమ్మదిగా నడచియుండఁడు. ఆతనిమొగమున నెట్టిభావమును కనఁబడలేదు. శాంతిమాత్ర ముండెను. పాదుషాపుత్త్రుఁడు మహమ్మద్ ఆజాం కోటకుబయట నొక గుడారమున నుండెను. తానాషా వచ్చుచున్నాఁడని సేవకులు వచ్చి చెప్పఁగానే లేచి గుడారము వాకిటనిలిచి ఎదురుచూచు చుండెను. తానాషా అచ్చటికి వచ్చుచునే గుఱ్ఱమునుదిగి ఆజామునకు తనమెడలోని హారమును వేసి బహుమానము చేసెను. రాజకుమారుఁడు దానిని గ్రహించి తానాషాను కౌఁగిలించుకొని చాలదయతో ఓదార్పుపలికి పాదుషాకడకు కొనిపోయెను. ఎల్లవారిని క్షమించునట్టి యౌదార్యమును ప్రకటించుచు పాదుషా తానాషాను చాల మర్యాదతోచూచి, ఆతఁడు తనసభలోనికి వచ్చి తన సర్దారులవలె నిలిచియుండ వలసిన పనిలేదని స్వేచ్ఛనొసంగి గౌరవించెను.

రుహుల్లాఖాన్ మొదలైనవారు తమకుదొరకిన వస్తు జాతమంతయు సేకరించుకొనిరి. తానాషాయొక్క బంగారము, నగలు మొదలైనవానిని వెదకి స్వాధీనము చేసికొనసాగిరి. గోలకొండలోని ధనికులయు సర్దారులయు వస్తువిశేషములను సోదా వేయించుటకు మనుష్యుల నేర్పాటుచేసిరి. ఈదోపిడి యైనతర్వాత మొగలాయీ సర్దారులు తా మపహరించినది

పోఁగా పాదుషావారి ఖజానాకు చెల్లించిన బంగారము, నగలు, రత్నాదికముల విలువ ఆఱుకోటుల ఎనుబదిరెండులక్షల పది వేల హొన్నులును, రెండుకోటుల ఏబదిమూఁడు వేల రూపాయ లును, నూటపదిహేనుకోటుల పదమూఁడులక్షల దమ్ములు. ఇవిగాక బంగారు వెండిపాత్రలు, నగిషీవస్తువులు ఎన్నియో. ఈకోటను పట్టినందులకు అబ్దుల్ కరీంఖాన్ అను వానికి మొదట ముల్తాఫిత్ ఖాన్ అనుబిరుమను తర్వాత పీర్ ఖాన్ అను పెద్దబిరుదును ఇచ్చి పాదుషా గౌరవించెను. హైదరా బాదును పాదుషా దార్-ఉల్-జిహాద్ (మతమునకై పోరా డిన స్థలము) అని పేర్కొనెను. తానాషాకును బిజాపూరు కును సాయముచేసిన పెద్దినాయకుఁ డనువానిమీఁదికి పాదుషా పెద్దసైన్యమును పంపెను. ఈతఁడు పండ్రెండువేల గుఱ్ఱ ములతోను లెక్కలేని కాల్బలముతోను మొగలాయీల నడ్డగించి వారికివచ్చు ఆహారాదికములను రానీయక నిలిపి తానాషాకొఱకు చాల శ్రమపడియుండెను. పాదుషాసైన్య ములు రాగానే తత్క్షణమే వారికి లొంగిపోయెను. తన సొత్తం తయు వారి స్వాధీనమొనర్చెను. పాదుషా సంతోషించి ఆత నిని తనకొలువులోనికి గ్రహించి పంచహజారి మన్సబ్దారుగా నియమించెను. ఆదోనికోట ఇంకను బిజాపురపు పూర్వమంత్రి యైన మాసూద్ స్వాధీనముననుండెను. పాదుషా ఆదోనిని జయించుటకు ఫిరోజుజంగును 25 వేల గుఱ్ఱములతో పంపెను. వెనుకనే దుముదారుదొరగా తన కొమారుఁడు ఆజంషాను

పంపెను. సైన్యమున కిచ్చుటకు వస్తువులుగాని ధనముగాని లేనందున వారి దినవెచ్చమునకుమాత్రము ఫిరోజుజంగు పైక మిచ్చుచుండెను.

1688 సం॥ జనవరినెల పాదుషా గోలకొండనువదలి బీదరువైపు బయలుదేరెను. హైదరాబాదు ప్రాంతములను పాలించుటకు ఏర్పాటులుచేసెను. తానాషాను జాఫరాబాదు వఱకు పాదుషా తనతోకూడ కొనిపోయెనుగాని అచ్చటికి చేరఁగానే జాఁసిఫర్ ఖాఁ అనువాని నేతృత్వమున దండిచ్చి దౌలతాబాదుకోటకు పంపుచు ఆతనికి అన్నవస్త్రములును సువాసన ద్రవ్యాదికములును కొఱతలేక సరఫరా చేయవల సినదని ఏర్పాటుచేసెను.

## ప్రకరణము ౨౭. తానాషానగలు : సాదత్ ఖాను.

సాధత్ ఖాను పాదుషాకు చాల నమ్మకమైన నౌకరు లలో నొకఁడు. ఇతఁడు మొగలాయీరాయబారిగా కొంత కాలము గోలకొండలో నుండెను. తానాషాతో జగడము కల్పించుకొనవలసినదని పాదుషా ఈతనికి బోధించుచుండినను ఈతనికి తానాషాపై గౌరవ మేర్పడియుండెను. ప్రకృతిచేత మంచివాఁడైనందునను తానాషాయొక్క సుగుణములచేత నాకర్షింపఁబడినందునను గోలకొండసుల్తానును పాదుషాచే క్షమింపింప నెంచెను. అందుచేత నాతఁడు తానాషానుగుఱించిన కొన్నివిషయములు పాదుషాకుచెప్పక దాచెను. కాని పాదుషా సహస్రాక్షుఁడు. ఎట్లో ఆసంగతులనన్నిటిని గ్రహించెను. గోల

కొండ పతనానంతరము పాదుషా ఇతనిని పిలిపించి పై విషయముల నడిగి కోపగించి వాని యుద్యోగమునుండి తక్కువదానికి లాగి జీతముతగ్గించి, బిరుదులు తీసివేసి శిక్షించెను.

కాని సాదత్ ఖాను ఇంకను, తానాషా తనకడనుంచిన ఆ తొమ్మిదితట్టల నగలను పాదుషాకు చేర్పలేదు. తాను వానిని పాదుషాకు చేర్చినట్లు తానాషాతో చెప్పినదంతయు అబద్ధము. ఇప్పు డాతఁడు వానిని పాదుషాయొక్క నగల ముసద్దీలను తీసికొమ్మని కోరెను. కాని పాదుషా యాజ్ఞలేక వారు వానిని గ్రహించుటకు భయపడి ఏవేవో సాకుచెప్పి ఆలస్యము చేయుచుండిరి. ఇంతకాల మూరకుండి వానిని గ్రహింపుమని ఇప్పుడు పాదుషాను కోరుటకు సాదత్ ఖానునకు ధైర్యము రాలేదు. ఒక సంవత్సరము ఇట్లు జరిగినవెనుక ఆ నగల ముసద్దీలు ఈవిషయమును పాదుషాతో చెప్పిరి. ఇప్పుడు పాదుషాకు సాదత్ ఖానుపై దయ గలిగెను. "ఆతఁడు నమ్మఁదగినవాఁడే. ఆతట్టలను మీరు తీసికొనవచ్చును. ఆతనికి దానికి తగిన రసీదిండు. వానిని చిన్నప్పటినుండి మేము పెంచితిమి. బాల్యములో మాయొడిలో ఆడుకొనినవాఁడు. ఈగోలకొండకు పంపినప్పుడు కొంత అశ్రద్ధ చేసినాఁడు. అందుచేత వానికి ఈదండన చేయవలసివచ్చినది" అని పాదుషా వానిని ఆదినమే పిలిపించి వాని యుద్యోగమును మరల వానికిచ్చి 'మూర్షిద్ కులిఖాఁ' అను బిరుదము పూర్వము, వానితండ్రి వహించిన దానిని, వానికీయవచ్చెను.

వెంటనే సాదత్ ఖాను పాదుషాకు తగినట్లు జవాబు చెప్పెను. "మేము శైశవమునుండి తమ బానిసలముగా నున్నందున అప్పుడప్పుడు తప్పుపోవుచుందుము. ఆసమయములలో మాబిరుదులు గౌరవములన్నియు వెంటనే మాకు తప్పిపోవుచుండును. జనులలో మావాస్తవ నామములు పర్వ్యటకు చాల కాలము పట్టును. అందువలన మేము బిరుదులు లేక మామూలుగా నుండుటయే మంచిదని తోచుచున్నది. కాని నాకు బిరుదే తప్పక ఈవలయునని పాదుషావారి సంకల్పమైనయెడల నాప్రార్థన ఏమనఁగా, ఆబిరుదు నాసొంత పేరుగానే యుండనిండు. ఎంతచేతననఁగా మాతండ్రిగారు వహించిన బిరుదును ధరించుయోగ్యత నాకులేదు." పాదుషా చిఱునవ్వు నవ్వి సరేయనెను.

కాఫిఖాన్ తాను వ్రాసిన తవారిఖ్‌లో సాదత్ ఖానును గుఱించి యిట్లు వ్రాసెను. "నేను సాదత్ ఖానుతో చాలకాలముంటిని. అందువలన నతని నడవడిని చక్కఁగా నెఱుఁగుదును. వానిస్నేహితులు ఆనగలను అపహరించి వానితావున సామాన్యపు నకళ్లను మరల యథాపూర్వముంచి పాదుషాకిచ్చివేయుమని చెప్పిరిగాని అతని హృదయము దానికి ఒప్పుకొనలేదు. అతఁడు చాల సత్యవంతుఁడు." అని.

ప్రకరణము–౨౦. అబ్దుర్ రజాక్ లారీ బ్రదుకుట.

ఆవిధముగా పడిపోయిన అబ్దుల్ రజాకులారీని మరల కొందఱు రుహుల్లాఖాన్ కడకు కొనిపోయిరి. లెక్కలేని గాయ

ములతో ఒడలు తెలియక లారీపడియుండెను. షాఫ్‌షికన్‌ఖాన్ ఆతనినిచూచి "ఆహా, ఆహా గరుహోతు పాపిలారీ! వాని తలకాయను తత్క్షణమే కొట్టి, పాదుషాకుచూపి. కోట దర్వాజాకు తగిలించవలెను" అనెను. రుహుల్లాఖాన్ "ఈవిధముగా ప్రాణము పోవునట్టి స్థితిలోనున్నను ఈతఁడు గొప్పవాఁడు. ఇట్టివాని తలను పాదుషా ఆజ్ఞలేక కొట్టుట ఔదార్యము కాదు" అని అతనివిషయము పాదుషాకు పోయిచెప్పెను. ఆతని ఆయద్భుత వీరవిహారమును స్వామిభక్తిని విని పాదుషా ఇరువురు వైద్యులను రజాక్ యొక్క గాయములను మాన్ప నియమించెను. వారిలో నొకఁడు ఐరోపీయుఁడు, రెండవవాఁడు సాయెబు. వారిని ప్రతిదినమును లారీయొక్క స్థితిని తనకు చెప్పునట్లు కట్టడిసేసెను. తర్వాత పాదుషా రుహుల్లాఖానును పిలిచి "తానాషాకు అదృష్టముండి, రజాక్ లారీవంటి స్వామి భక్తి గలవాఁడు మఱియొకడుండినయెడల ఈకోటను పట్టుటకు మనకు ఇంకను చాలకాలము పట్టియుండును!" అని ఆశ్చర్యపడెను.

వైద్యులు రజాకును పరీక్షించి ఆతని శరీరమందు మొత్తము డెబ్బది గాయములనియు గాయములమీఁద పడిన గాయములకు లెక్కలేదనియు చెప్పిరి. ఒకకన్ను పూర్తిగా పోయినను రెండవకన్ను గట్టిగా నుండెను. ఆతఁడు బ్రదుకుట మాత్రము దైవాధీనమనిరి. పదుమూఁడు దినములు వైద్యు లుపచరింపఁగా రజాక్ కన్ను తెఱచి తానాషాయని పలవరించెను. ఆతర్వాత నాతనికి నెమ్మదించునని వైద్యులకే ధైర్యము

వచ్చినది. రజాకునకు స్పృహవచ్చినదని పాదుషాకు తెలియఁ గానే ఆతఁడు రజాకునకు ఫర్మానా పంపెను. "నిన్ను మేము క్షమించినాము. నీపెద్ద కుమారుఁడు అబ్దుల్ ఖాదర్‌ను ఇంకను కొలువుచేయగలవారిని మాకడకుపంపుము. వారందఱును తమ కును తమతండ్రికొఱకును మాక్షమాపణ వేడినయెడల వారికి గొప్ప మర్యాదలిచ్చి ఉన్నతోద్యోగముల నీయగలము."

ఈవిధముగా పాదుషా దయతోఁ చెప్పిపంపఁగా అబ్దుల్ రజాకు మర్యాదార్థము పాదుషాకు వందనములు చెప్పెను. "ఇంతవఱకును నాప్రాణములు పోక నేను బ్రదికియుండుట నిజ మే. కాని ఈ ప్రస్తుతపు దురవస్థచేత నేను బ్రదికి పాదుషా వారికి బానిసనగుదు ననుట మాత్రము కల్ల. కాని దయా మయుఁడైన భగవంతుడు నాకు సంపూర్ణారోగ్య మిచ్చి నా జీవితమును పొడిగించినను సర్వవిధముల చితికిపోయిన నేను ఇకను నౌకరీచేయగలనను నమ్మకము లేదు. ఒకవేళ చేయ గలిగినను అబుల్‌హసన్ తానాషాచేత వృద్ధికి తేఁబడినవాఁడు అలంఘీరు పాదుషాకు పాదాక్రాంతుఁడై నౌకరీ చేయఁడని మాత్రము దృఢముగా నమ్ముఁడు." అని యీవిధమున రజాక్ బదులు చెప్పిపంపెను.

పాదుషాకు ఈవాక్యములు వ్యథ కలిగించెను. కాని కొంతకుకొంత న్యాయముగా పోవువాఁడు గావున రజాకును త్వరలో ఆరోగ్యవంతుని చేయుఁడని వైద్యులకు హెచ్చరించెను. రజాక్ యొక్క ఆస్తిలో కొల్లపోఁగా మిగిలిన దానినంతయు

నాతనికి ఒప్పఁ జెప్పించెను. ఆతఁడు పూర్ణారోగ్యము నందినం తనే అతనిని ఓదార్చి పాదుషాకడకు తెమ్మని హైదరాబాదు యొక్క సుబేదారునికి ఉత్తరువాయెను. సుబేదా రాతని చేతికి సంకెళ్లు తగిలించి కొనిపొమ్మనెను గాని ఖాఁబహదూర్ ఫిరోజ్ జంగు అడ్డుపడి ఆ యవమానమును నిలిపి తనకడ కొన్ని దినము లుంచుకొని, నామకార్థమైనను పాదుషా కొలువును ఒప్పుకొమ్మని ప్రార్థించెను.

రజాకు పాదుషాను దర్శించుట కొప్పుకొనెను. పాదుషా రజాకును చాలగౌరవించెను.

పాదుషా—అబ్దుల్ రజాక్ సాహెబ్, మీరు చాల గొప్పవారు. ఇంత స్వామిభక్తి, సాహసం, మతగౌరవం చూపినవాళ్లను మేము చూడలేదు. మీకు ఏమి కావలెనో కోరండి మేం చేస్తాం.

రజాక్—భగవంతుడి దయవల్ల నాకు చావు ఒకటే మిగిలి ఉంది. ఇంక ఏమీవద్దు.

పాదుషా—పోయిందేమో పోయింది. మీరు మా తరఫ్‌లో ఈగోల్కొండలో నవాబ్‌గా ఉండండి.

రజాక్—అల్లా! అల్లా! మహాత్ముడు తానాషా. ఆయన ఉప్పుతిని ఎట్వంటి పాపీకూడా ఆపనిచేయడు. అబ్దుల్ రజాక్ లారీ చేయనేచెయ్యడు.

పాదుషా—మాదగ్గర సేనాపతిగా ఉండండీ సాహేబ్.

రజాక్—తానాషా సుల్తాన్ బహద్దర్ నౌకరీచేసిన వాడు ముసల్మాన్ ఐతే ఇంకొకడికీ నౌకరీచెయ్యడు జహాపనా.

పాదుషా—మీకు నౌకరీ ఇష్టంలేకపోతే మీకొమారులకీ ఇస్తాం.

రజాక్—ఆ వెధవలు ఎట్లాపోతే నాకేమి? తెల్వి ఉంటే బతుకుతారు. వాళ్లకు నాకు ఏమి ఇలాఖా.

పాదుషా—అచ్ఛా! అచ్ఛా! మీవంటివారు ఇంకొకరు ఈగోల్కొండలో ఉంటే మేము కోటనుపట్టి ఉండలేము. మీరు చాలాగొప్పవారు. మరి మీయిష్టం ఏమి?

రజాక్—జహాపనా! నాకు ఏమి ఇష్టం ఉంటుంది? మాసుల్తాన్ బందీ, మావజీర్లు అక్కన్న మాదన్నలు మర్గయా. మాకోట చెడిపోయింది. ఎక్కడచూచినా ద్రోహులు ఉన్నారు. నా ముసలిప్రాణం ఇంకా ఈ శ్మశానంకు చూస్తూ ఉండదు. దేవుడు దయాచూపిస్తే తానాషాకు నౌకరీచేస్తాన్, లేకపోతే మెల్లగా బయలుదేరిపోతాన్. పోతాన్ జహాపనా. మక్కాకుపోతాన్. మక్కా, మక్కా, మక్కా

అని పలుకుచునే దుఃఖాతిరేకమున వెడలిపోయెను. కాని రజాక్ మక్కాచేరలేదు. పెర్షియా దేశమునకు పోయి అచ్చట తన జన్మస్థలమగు 'లార్'లో కొన్నిదినము లుండి తర్వాత మక్కాకుపోవుచు దారిలో చనిపోయెను.

## ప్రకరణము ౨౯ - తానాషా కడపటిమాటలు.

అబుల్ హసన్ తానాషా దౌలతాబాదుకోటలో ఖైదిగా 1688 సంవత్సరము జనవరి నెలలో ప్రవేశించెను. ఆకోట యందే పదునాలుగుసంవత్సరములు ఆమహనీయుఁడు బందిగా గడపి తుదకు అతిసారభేదులచేత ప్రాణములను కోలుపోయెను. ఆతఁడు చనిపోయినప్పుడు ఒక విచిత్రదైవఘటన జరిగినది. తానాషా చాలజబ్బులో నుండఁగా నొకనాఁడు వేకువను ఆకోటను కాపాడునట్టి ఖిలేదారునకు స్వప్న మొకటివచ్చినది. ఎవరోవచ్చి ఆతనితో "అదుగో తానాషా చనిపోయినాఁడు. ఆతని శవమును తీసికొనిపోయి అతనిగురువైన సయ్యద్‌రాజు కొత్తాల్ యొక్క సమాధిప్రక్క సమాధిచేయుము" అని చెప్పినట్లుండెను.

తెల్లవాఱఁగానే ఖిలేదారు తానాషాను దర్శించెను. తానాషా తనవైపు చూడఁగానే సలాముపెట్టి 'తమతో నొక విషయము తత్‌క్షణమే మనవిచేయవలయును' అనెను. వెంటనే తానాషా అందుకొని 'అవును. నీకు కలలోవచ్చిన భగవదాజ్ఞ నాకు మెలకువలోనే వచ్చినది. భగవదాజ్ఞను నెఱవేర్పుము' అనెను. ఖిలేదారు ఆశ్చర్యపడెను. ఆతర్వాత కొన్ని నిముసములకంతయు తానాషా మరణించెను. తత్‌క్షణమే ఖిలేదారు ఢిల్లీపాదుషాకు తెలుపకయే తానాషా శవమును కొనిపోయి

ఆతని గురువుయొక్క సమాధికి ప్రక్కన పాతి సమాధి కట్టించెను. ఇందుచేతనే ఈయనగోరి గోలకొండలో లేదు. గురుశిష్యులు మరల కలసికొనిరి. తానాషా చనిపోయిననాటి తారీఖు తెలియదు. కాని యీతఁడు పదునాలుగేండ్లు తలిదండ్రులకడ తనబాల్యమును, తర్వాత పదునాలుగేండ్లు సయ్యద్ రాజు కొత్తాల్ కడ శిష్యుఁడును, పదునాలుగేండ్లు సుల్తానుగాను, పదునాలుగేండ్లు ఖైదీగాను నుండినందున ఏబదియాఱు సంవత్సరములు జీవించి క్రీ. శ. 1702 లో మరణించెనని తెలియుచున్నది.

తానాషా బందీకృతుఁడైనతర్వాత నాతని కొకకుమారుఁడు పుట్టెను. సుల్తానుగాన ఆతని యంతఃపురముకూడ నాతనితో కూడ దౌలత్ బాదులోనే యుండెను. ఆపిల్లవానికి బందిసుల్తానని ఇతరులు పేరుపెట్టిరి. ఆతఁడు పెద్దవాఁడైనంతట పాదుషా వానికి ఆస్థానమునకు వచ్చుట కనుజ్ఞనొసంగెను. కాని ఆబాలుఁడు వచ్చుట కారంభించినంతట తానాషా పూర్వభృత్యులకు వానియందు దాక్షిణ్యభక్తు లేర్పడి వారందఱును అతనికి సలాము లిడసాగిరి. ఈవిషయము పాదుషాకు తెలియఁగానే వానిని ఆస్థానమునకు రానీయక రహస్యముగా చంపించెను.

శ్లో. రామే ప్రవ్రజనం, బలేర్నియమనం, పాణ్డోస్సుతానాంవనమ్
వృష్ణీనాం నిధనం, నలస్యనృపతేః రాజ్యాత్ పరిభ్రంశనమ్,

కారాగారనిషేవణంచ మరణం సంచిన్త్య లజ్జేశ్వరే
సర్వం కాలవశా దుపైతిచ నరః కోవాపరిత్రాయతే?

సమాప్తము.

---

చంద్రికాప్రెస్సు, చాకలపేట, మదరాసు.—15-2-49.

# 1949 నుండి ఈధరలు.

## వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4, మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీథి, జి. టి. మదరాసు.

ఆర్డరుతోకూడ సగముసొమ్ము అడ్వాన్సు పంపవలెను.

(తపాలుచార్జి ప్రత్యేకము.)

## సంస్కృత గ్రంథములు.

మేఘసందేశము, మల్లినాథ వ్యాఖ్యా - తెనుగున ప్రతిపద టీకా తాత్పర్యపద ప్రయోజనచర్చా-ఆక్షేపసమాధానములు. రు. 2 8

రఘువంశము మల్లినాథవ్యాఖ్యా - తెనుగు టీకాతాత్పర్యములు. మొదటి 6 సర్గలు 3 0

కుమారసంభవము, మొదటి 6 సర్గలు. పైదానివలెనే టీక. 3 0

అమరుకావ్యము శృంగారతత్త్వము. వేమభూపాల సంస్కృత వ్యాఖ్య. సంపూర్ణాంధ్రటీకయు. అచ్చగుచున్నది. 1 8

పుష్పబాణవిలాసము. సంస్కృతవ్యాఖ్య. తెనుగు పూర్ణటీక. 0 12

హితోపదేశము, మూలమాత్రము 1 0

పంచతంత్రము, ,, 1 8

దశకుమారచరిత్రము ,, 1 0

వ్రతకల్పవల్లి (6 వ్రతములు) 0 12

బిల్హణచరిత్రము, తెనుగు పూర్ణటీక. (అచ్చగుచున్నది)

రసమంజరి, శృంగార రస స్వరూపవిస్తరము, సటీక. ,,

ప్రియదర్శికా నాటిక, శ్రీహర్షకృతి సంస్కృతటిప్పణము గద్య పద్యములుగా ఆంధ్రీకరణము సంయుతము 1 0

శబ్దమంజరీ సమాసకుసుమావళీ తిఙంతమంజరులు. పాఠప్రతి 0 4

## ఆంధ్ర గ్రంథములు.

### పద్యకావ్యములు.

ఆముక్తమాల్యద సంజీవనీవ్యాఖ్య. 12 0

శృంగారనైషధము సర్వంకషావ్యాఖ్య. (అచ్చగుచున్నది)

విజయవిలాసము, చేమకూర వేంకటరాజు. టీకాసహితము. మరలఅచ్చు 3
సారంగధరచరిత్రము ,, ,,
జ్ఞానవాసిష్ఠరామాయణము, వేదాంతము, మడికిసింగనకృతి 1
ఆంధ్రబిల్హణీయము, నిర్దోషము 0
పారిజాతాపహరణము, మూలము 0
సారంగధరచరిత్ర, ద్విపద (కవి విశ్వకర్మమతస్థుఁడు) 0
హరిశ్చంద్ర, ద్విపద, గౌరనమంత్రి ప్రణీతము 1

## నాటకములు.

ప్రతాపరుద్రీయ నాటకము, సటిప్పణము, క్రౌనుసైజు 2
బొబ్బిలియుద్ధ నాటకము 1
ఉషానాటకము, సటిప్పణము, క్రౌనుసైజు 1
శాకుంతల నాటకము, కాళిదాసీయమునకు తెనుఁగు 1
విక్రమోర్వశీయ నాటకము, Inter Text నోట్సుతో 2
మాళవికాగ్నిమిత్ర నాటకము 0
నాగానంద నాటకము (అచ్చగుచున్నది)
రత్నావళీనాటిక, శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారివ్యాఖ్యతో 1
ప్రియదర్శికా నాటిక 0
ఉత్తరరామచరిత్ర నాటకము—విపులమగు పీఠికతో పునర్ముద్రితము 2

## సులభ వచనగ్రంథములు.

హితోపదేశకథలు, నీతిబోధకములు, (అచ్చగుచున్నది) 0
భోజ కాళిదాసకథలు, రసభరితములు వెలువడనున్నది. 0
బేతాళ పంచవింశతిక 0
విక్రమార్కుని యద్భుతకథలు, గుణము కలిగించునవి. పునర్ముద్రితము 1
కథాసరిత్సాగరము, అద్భుతనీతి వ్యవహారకథలు, ఆరుభాగములు 12
ఒక్కొక్కభాగము ప్రత్యేకముగా 2
ఆంధ్రదశకుమారచరిత్రము, మూలమునకు సరియైనయాంధ్రీకరణము 1

## లక్షణగ్రంథములు.

| | | |
|---|---|---|
| ఆంధ్రసాహిత్యదర్పణము. ఉదాహరణశ్లోకములతో | 5 | 0 |
| కావ్యాలంకారచూడామణి తొమ్మిది ఉల్లాసములును పూర్తిగా | 1 | 8 |
| అలంకారసారసంగ్రహము, సటీక | 0 | 12 |
| ఛందస్సు, విద్యార్థుల కుపయోగకరము, సంగ్రహము | 0 | 4 |

## శారదాకాంచికలు - విమర్శలు - ఉపన్యాసములు.

| | | | |
|---|---|---|---|
| తిక్కన విక్రమార్కచరిత్ర ముద్రణవిమర్శనము | 1 కింకిణి (అచ్చగుచున్నది) | | |
| ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శ | 2 కింకిణి ,, | | |
| కాశీమాహాత్మ్య ముద్రణవిమర్శనము | 3 కింకిణి ,, | | |
| గ్రామ్యభాషాప్రయోగనిబంధనము. (పాత్రోచిత భావమును గుఱించినది) | 4 కింకిణి | 0 | 12 |
| మోచాకుసుమాపాదవిచారము | 5 కింకిణి ,, | | |
| ఆంధ్రవ్యాకరణ సర్వస్వవిమర్శనము | 6 కింకిణి ,, | | |
| విమర్శవినోదము, సంస్కృతాంధ్ర కావ్య నాటకాది విషయకము | | 0 | 12 |
| తిక్కన సోమయాజివిజయము 0 8. | విసంధివివేకము | 0 | 2 |
| భారతాభారతీరూపకమర్యాదలు, (నాట్యకళా చరిత్రము) | | 0 | 6 |
| ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము | | 0 | 6 |
| గ్రామ్యదేశనిరసనము, కడుపుబ్బ నవ్వించు విమర్శ | | 0 | 6 |
| స్త్రీపునర్వివాహగ్రంథము | | 1 | 0 |
| ఆంధ్రహితోపదేశచంపువు, గద్యపద్యాత్మకము | | 1 | 4 |
| ఆంధ్రభాషాసర్వస్వార్థనియమక విషయములు (నిఘంటురచనావిధి) | | 0 | 4 |

## క్రొత్తగా వెలువడిన గ్రంథములు.

| | | |
|---|---|---|
| కుమారదేవపండితీయము, పాణినీయవ్యాకరణవ్యాఖ్య. తార్కికవారిధి | 2 | 8 |
| పద్యకథావళి For Comprehension Test | 0 | 12 |
| ఉదయనచరితము. శ్రీ శాస్త్రిగారి కథాసరిత్సాగరమునుండి పాఠశాలలకు అని సంగ్రహింపబడినది. | 1 | 4 |

తెలుగు ఫైలాలజీ TELUGU PHILOLOGY ఆంధ్రశబ్ద
తత్త్వము. కీ. శే. శ్రీ ప్రొఫెసరు, శేషగిరిశాస్త్రిగారిచే రచి
యింపఁబడినది. ఇప్పుడే పునర్ముద్రితము. ఇందు ఆంధ్రవ్యాక
రణము సంపూర్ణముగా చర్చింపఁబడియున్నది. అరవము, కన్న
డము, మలయాళభాషలతోడి పోలికలు చూపఁబడియున్నవి.
ఫైలాలజీవిద్యార్థులకు చాల ఉపయోగకరము 2 భాగములు 3

చరిత్రరచన, ప్రథమభాగము. చరిత్రరచన యనగా నేమి? సాధన
సామగ్రి ఎట్టిది? అను విషయములను చర్చించి శాతవాహన,
పల్లవ, చాళుక్య, చోళుల ప్రారంభచరిత్రములు ఈభాగ
మున సులభమైన శైలిలో ఎల్లవారికిని ఉపయోగపడునట్లు శ్రీ
నేలటూరు వేంకటరమణయ్యగారిచే రచింపఁబడినవి. 2

అక్కన్న మాదన్నలచరిత్రము. కర్త: వే. వేం. శాస్త్రి (M. A)
గోలకొండ కుతుబుషాహి సుల్తానులలో కడపటివాఁడైన
తానీషాయొక్క కాలము, రామదాసు (గోపన్న) యొక్క మామ
లైన ఈ యాంధ్రమంత్రులయొక్క విషాదచరిత్రము సులభ
మైన నవలవలె రచియింపఁబడియున్నది. 2

శ్రీకృష్ణరాయవిజయనాటకము. కర్త. వే. వేం. శాస్త్రి (M. A.) 0
వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము — 25 ప్రక
రణములు, సులభమైనశైలి. శాస్త్రులవారి హాస్యము, విమర్శలు, విద్యా
వినోదములు, సుఖదుఃఖములు, సమకాలికపండితవిమర్శలు మొదలైన
యనేకవిశేషములు గలవు. శ్రీ డాక్టరు, సర్, కట్టమంచి రామలింగా
రెడ్డిగారి 'గుణగ్రాహి' యను నుపన్యాసముతో నలంకృతము. 2